## ముఖచిత్రం

ఎన్. టి. రామారావుగారి ముఖ చిత్రం అందంగానూ, ఆకర్షణీయంగానూ ఉంది.

కె. ప్రహ్లాద్‌రావు (దామరగిద్ద)

* * *

ఎన్. టి. రామారావుగారి ముఖ చిత్రము ఫెంటాస్టిక్‌గా ఉంది.

కె. కుమార్ చౌదరి, విజయ (కాశీబుగ్గ)

* * *

నందమూరి తారక రాముని ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్రవారపత్రికను చూసిన వెంటనే ఆనంద తరంగం వెల్లువలా వెలువడింది.

బి. సుభాష్ (హైదరాబాదు)

* * *

24—9—82 నాటి ఆంధ్ర పత్రిక వార పత్రిక ముఖ చిత్రం నా అభిమాన నటుడు ఎన్. టి రామారావుగారిని శ్రీ బొమ్మన్ చాలా సువర్ణంగా చిత్రీకరించి, కళారంగంలో మరో మెట్టుని అధిరోహించారు అని చెప్పక తప్పదు.

పి. శ్రీనివాస్, పి. పద్మావతి, (కాశీబుగ్గ)

* * *

ప్రముఖ నటుడు శ్రీ ఎన్. టి. ఆర్. గారి ముఖ చిత్రం చక్కగా ఉంది. చిత్రకారునికి నా శుభాకాంక్షలు. నిత్యం మనము తిరిగే సమాజంలో శవాలతో వ్యాపారంసేసే మనుషులు ఉంటారనివూహించలేం. దారిద్ర్యంవలనమనుషులు మానవత్వాన్ని మరచి అంతహీన స్థితికి దిగజారుతారని రచయిత 'స్వార్థం' కథలో వివరించారు. 'బలి' కథ కూడ బావుంది.

రవు, ఎస్. సుజన (మహబూబాబాదు)




కదలిపోనన్ ముఖ చిత్రం
బమితంబగు కరుణతోడి యాలోచనలన్
ప్రముఖంబుగ ప్రకటితమై
ప్రముదంబును గూర్చె వారపత్రిక కనగన్

బావట్ల వెంకటేశ్వరసాయి (చెరువు)

* * *

24—9—82 తేదీ నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖ చిత్రం బాగా లేదు. కెరటం కథ చాల బాగుంది.

వీరా కృష్ణ (పాలమూరు)

* * *

నటరత్న పద్మశ్రీ ఎన్. టి. రామారావుగారి ముఖ చిత్రంతో ఆంధ్రపత్రిక ఏమంత ఆకర్షణీయంగా లేదు. ఆ ముఖ చిత్రంలో ఎలాటి కళ లేదు' పెయింట్‌తో దించిన ఆర్ట్. అందుకే ఏమంత చూడ ముచ్చటగా లేదు.

కందిగట్ల ప్రభాకర్ (జనగామ)

### కార్టూన్

24—9—82 పంచికలో సోమేశ్వర్ గారి "వయో వృద్ధుల సంవత్సరం"పై కార్టూన్ అంత బాగా లేదని చెప్పటకు చింతిస్తున్నాను.

పులిజాల సురేష్‌కుమార్ (నరసరావుపేట)

### ఆమె కథ ... !

రావూరి భరద్వాజగారి కథానిక ఆమె కథ ! కాదు కళ్ళ కథ!! కాదు కాదు ఆ కళ్ళ కథ !!! అద్భుతంగా వుంది.

చలంగారు కథలు రాసిన కాలం తెలుగు సాహిత్యానికి స్వర్ణ యుగంలాంటి దనుకుంటా. ఆ సమకాలీన రచయిత లందరూ సాహిత్యాన్ని తపస్సు క్రింద తీసుకొన్నారు. కనకనే అప్పటి విలువలు ఎప్పటికీ నిలుస్తాయి. ఇప్పుడూ అలాంటి ఉత్తమ సాహిత్యం లేదనటం లేదు గాని, మొత్తంమీద సమాజాన్ని ప్రభావితం చేస్తున్న పత్రికల్లో వ్యాపార సాహిత్యమే ప్రముఖంగా కనపడుతుంది. నేటి రచయితల్లో చాలామంది అక్షర బేహారులు. ఇది చాలా సిగ్గు పడాల్సిన విషయం.

రావూరి భరద్వాజలాంటి ఆ తరం రచయిత ప్రేమ కథ రాద్దామని కూర్చున్నా 'ఆకలే' సాక్షాత్కరించిందాయనకు. వ్యవస్థలోనే ఈ పరిస్థితి ఏర్పడింది. ఈ తరం రచయిత ఇప్పటికైనా ఆలోచించాలి—అక్షర వ్యాపారం చేసేటప్పుడు !

కర్లపాలెం హనుమంతరావు (విజయవాడ)

* * *

ఈ సచికలో కథలన్నీ బాగున్నవి. అన్నింటిలో రావూరి భరద్వాజగారి కథ ఆమె కథ ! కాదు. కళ్ళ కథ!! కాదు కాదు ఆ కళ్ళ కథ !!!! చాలా బాగున్నది.

శేషు, ప్రసూన (గుంటూరు)

### సందేహం

మా గురువుగారు, ఆంధ్రుల అభిమాన నటుడు, తెలుగు దేశపు ఆశాజ్యోతి నందమూరిగారి ముఖ చిత్రంతో 24—9—82 న పత్రిక మమ్మల్నెంతో ఆకర్షించింది. కథలు కూడా బావున్నాయి. నందం రామారావుగారి 'స్వార్థం'యడవల్లి నాగేశ్వరరావుగారి 'బలి' చెప్పుకోదగినవి. మనిషిలోని 'స్వార్థం'ఎంత వికృతంగా ఉంటుందో స్వార్థంకథలో చిత్రిస్తే, మనిషి హేతుబద్ధంగా ఆలోచించగల్గిన నాడు మూఢ నమ్మకాలకి తావుండదని బలిలో సహేతుకంగా రుజువు చెయ్యడం జరిగింది. ఇక సీరియల్స్ అన్నిటిలో ధర్మో రక్షతి రక్షితః అద్భుతంగా ఉంది. బ్రాహ్మణులు నైతికంగా పతనమై పోయారంటూ తిట్టి పోసే వారికి, అందుకు మూల కారకులైన ఆర్థిక సాంస్కృతిక పతనాల గురించి కూడా వివరించి చెప్పటం రచయిత అభిప్రాయంగా తోస్తోంది. కథ చదువుతూంటే గత వెయ్యి సంవత్సరాల దాస్యం తర్వాత ఒకప్పటి సంస్కృతితో, ఒకప్పటి నైతిక విలువలతో నిలిచిన కుల మేది? కుటుంబ మేది? అనే సందేహం తలెత్తుతోంది ? రచయిత లందరికీ అభినందనలు. ఢిల్లీ లేఖని మళ్లీ ప్రవేశపెట్టటం మంచి ఆలోచన. కార్టూన్ల ఎన్నిక బావుంది.

మూరపనేని రాజశేఖరం (ఒంగోలు)

( 74 వ పేజీ చూడండి )

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 1972]

శుక్రవారం 22-10-'82

దుందుభినామ సం. నిజాశ్వియుజ శు. పంచమి

**సంపుటము 75 సంచిక 8**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80

విడి ప్రతి వెల రు 1-50

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



లోకంపోకడ * ఉరిమెన్



## న్యూఢిల్లీ లేఖ

డాక్టర్ జయ్ దుబాషీ

# రష్యాలో భారతదేశం కర్మాగారాలు నెలకొల్పితే?

శ్రీమతి గాంధీ రష్యా వెళ్ళి మామూలు కానుకలు పట్టుకొస్తున్నారు. అవేమిటి ? కొత్త ప్రాజెక్టులని పేరు. అవి కొత్తవో, పాతవో చెప్పటం కష్టం. ఒరిస్సాలో ఉక్కు కర్మాగారం కట్టిపెడతామంటున్నారు రష్యా వారు. దీనినే బ్రిటిషువారూ కట్టిపెడతామంటున్నారని వార్తలు వచ్చేవి. భారతదేశం యొక్క అణుశక్తి పథకం పట్ల వారికి ఆసక్తి కలుగుతోంది. (ఇంతదాకా వారికి అందులో ప్రవేశం ఇవ్వబడలేదు) ఆంధ్ర ప్రదేశ్ ప్రస్తుతం శ్రీమతి గాంధీ దత్తత తీసుకున్న రాష్ట్రం. ఇక్కడ బాక్సయిట్, అల్యూమినా కర్మాగారాలు వస్తాయని వార్తలు వినపడుతున్నాయి. ఇది శ్రీమతి గాంధీ దత్తతతీసుకున్న రాష్ట్రం కదా ? అక్కడ ఎవరూ కొన్ని నెలలకన్నా ముఖ్యమంత్రిగా ఆగలేకపోతున్నారు !

ఆడుక్కునేవారికి ఇష్టాయిష్టాలేమిటి ? బాగానే ఉంది కాని, ఎల్లకాలం అడుక్కోవటమేనా? ఉక్కు సంగతి తీసుకోండి. అనాదిగా భారతదేశం ఉక్కు తయారుచేసే దేశాలలో ఒకటి. రష్యా వారి కన్నా ముందే భారతదేశం ఉక్కు తయారుచేసేది–అమెరికావారి సాయంతోనే అనుకోండి. జంషెడ్‌పూర్‌లో టాటా వారి ఉక్కుకర్మాగారం పెట్టి 75 సంవత్సరాలయింది. మనకి రష్యావారు నెలకొల్పిన రెండు ఉక్కుకర్మాగారాలు ఉన్నాయి. అయితే మనదేశంలో ''మెకాన్'' అనే సంస్థ ఒకటి ఉంది. ఇది ఉక్కు కర్మాగారాల నిర్మాణంలో సలహా ఇవ్వగలదు దస్తూర్ అండ్ కంపెనీ అనే మరొక సలహాసంస్థ ఉంది. ఈ సంస్థ వారు లిబియా, అర్జెంటినా దేశాలలో ఉక్కు కర్మాగారాలు పెట్టటానికి తోడుపడుతున్నారు. కాని వీరు మనకి పనికిరారు. ముందు బ్రిటన్‌ని ఆశ్రయించాము. ఇప్పుడు రష్యాని ఆశ్రయిస్తున్నాము వారు తాపీగా తమకి తోచినప్పుడు తమ నివేదికని ఇస్తారు. అది వారికి అలవాటు. ఇంతలో 5 సంవత్సరాలు గడిచిపోతాయి.

ఇక అణుశక్తిని తీసుకోండి. రష్యా వారు ఏమి చేస్తారో తెలీదు. కాని, అమెరికా – ఫ్రాన్సుల కన్నా భిన్నంగా ప్రవర్తిస్తారా? అదీ కాకుండా భారతీయ శాస్త్రవేత్తలే అణుశక్తి కేంద్రాలని నిర్మించగలరుట కదా ? వారి నిర్మాణాలలో 5లేక 6శాతంకన్నా విదేశీ భాగం అక్కరలేదుటకదా? వీరు చెయ్యలేనిది రష్యా వారు ఏమి చేస్తారు? ఏమీ లేదనే అనాలి.

అసలు భారతదేశానికి ఇప్పుడు కావలిసినది ఎక్కువ సహాయం కాదు. తక్కువ కావాలి. అన్నిటికన్నా ఎక్కువ కావలిసినది ఆత్మ విశ్వాసం. రష్యా వారు కాని మరెవరు కాని దానినే దెబ్బతీస్తారు తమ సహాయాన్ని అందజేసి ప్రపంచంలోని పారిశ్రామిక దేశాలలో భారతదేశానిది ఆరు లేదా ఏడవ స్థానం. కాని, ఈ స్థానం రావటానికి దిగుమతి అయిన సాంకేతిక విజ్ఞానం, పెట్టుబడి తోడుపడ్డాయి.

భారతదేశంలో విదేశ సహాయం లేనిదే అవతరించగలపారిశ్రామికనిర్మాణం (ప్రాజెక్టు) ఒక్కటి లేదంటే సత్యదూరం కానేరదు. ప్రభుత్వరంగంలోనూ ఇంతే, ప్రయివేటు రంగంలోనూ ఇంతే. వచ్చే సాయం కొంతదాకా కమ్యూనిస్టు రాజ్యాల నుండి రావచ్చు కాని అధికంగా పాశ్చాత్య దేశాలనుంచే దిగుమతి అవుతూ ఉంటుంది.

ఇందులో తప్పేమీ లేదు. రష్యాలో జరిగిన ''విప్లవం'' తరువాత వారూ అమెరికా వద్ద సహాయం తీసుకున్నారు. కాని, ప్రతి దానికీ హద్దు అంటూ ఉంటుంది. మనం ఆ హద్దుని చేరుకున్నాము.

ప్రపంచ బాంకువారు తరచు అనేమాట ఏమిటంటే మనకి పెట్టుబడి తక్కువ.



భారత్ – రష్యా సంయుక్త ప్రకటనపై సంతకాలు చేస్తున్న ప్రధాని శ్రీమతి గాంధీ, సోవియెట్ అధ్యక్షుడు శ్రీ లియొనిడ్ బ్రెజ్నేవ్.

బాంకు సహాయం లేనిదే మనమేమీచెయ్యలేము అని. ఇది అర్థంలేనిమాట. ప్రపంచబాంకు–అలాంటి సంస్థలు మనని తమ కొంగుకి కట్టుకుని ఉంచుకోవాలని అనుకుంటాయని నా నమ్మకం; మనం స్వతంత్రంగాజీవించటం వారికి ఇష్టం ఉండదు. అవసరమయితే యుద్ధంచేసి అయినాసరే మనని ఈ స్థితిలో ఉంచటానికి ప్రయత్నిస్తారు వారు. ప్రపంచ బాంకుకి పేదరికమే ఒక మంచి వ్యాపారం. భారతదేశం లాంటి వారు ఈ వ్యాపారంలో మంచి కాతాదారులు. బాంకులకి వడ్డీ ఇచ్చి అప్పుతీసుకునేవారు చాలా ముఖ్యంకదా? భారతదేశం వంటి దేశాలు ఎగబడి అప్పుతీసుకుంటే ఈ సంస్థకి ఎంతో మంచిది.

భారతదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందినదేశం అన్నసంగతి విదేశాలవారికి చాలా మందికి తెలీదు. ఇటీవలే నేను లండన్‌లో ఒక పెద్ద బాంకు అధికారితో మాటలాడుతున్నాను "అమెరికావారు యురేనియమ్ ఇంధనం ఇవ్వకపోతే వచ్చే పెద్ద నష్టమేమీ ఉండదు. దాని బదులు ఇంకేదో మేమే తయారుచేసుకోగలము" అన్నాను. ఆయన ఆశ్చర్యపోయాడు. ఇంత సామర్థ్యంకల శాస్త్రవేత్తలు భారతదేశంలో ఉన్నారని ఆయనకి తెలీదు. "భారతదేశంలోని అణుశక్తికేంద్రాల నిర్మాణాన్ని మేమే నిర్ణయించుకున్నాము. వాటిలోని యంత్రసామగ్రిని మేమే తయారు చేసుకున్నాము. ఆ కేంద్రాలని మేమే స్వయంగా నడుపుకుంటున్నాము" అని నేను చెప్పగా విని ఆయన అదిరిపోయాడు. ఈ బాంకు అధికారి రోజూ లండన్‌లోని ఇండియా హవుస్ పక్కనుంచి వెడుతూ ఉంటాడు కాని (ఎందరో విదేశీయుల వలే) ఆయనకి భారతదేశాన్ని గురించి అంతగా తెలీదు. శ్రీమతి గాంధీ, ఆమె పరివారం విదేశాలకి వెళ్లి సహాయం తెచ్చుకున్నారన్న వార్తలు (ఆమె ఏదో విజయవంతంగా సాధించుకు వచ్చినట్లుగా) పత్రికలలో చూసి ఇటువంటివారు భారతదేశాన్ని తక్కువ అంచనా వేస్తారు. భారతదేశం ఈ రకం సహాయం తీసుకొనటం సరికాదు, వెంటనే ఈ పద్ధతి మానుకోవాలి.

నేనొక ప్రశ్న వేస్తాను : అసలు భారతదేశమే సోవియెట్ యూనియన్‌లో ఒక ఉక్కు కర్మాగారం ఎందుకు నెలకొల్పరాదు ? నెలకొల్పే సామర్థ్యం మనవారికి ఉంది కదా ! ఉండటంవలననే కదా మన దేశానికి చెందిన సలహా సంస్థలు విదేశాల వారికి ఉక్కు కర్మాగారాలు పెట్టటానికి తోడుపడుతున్నాయి ? ఇక్కడ భారీ యంత్ర సంస్థ ( హెవీ ఇంజినీరింగ్ కార్పొరేషన్ ) వంటివి ఉక్కు కర్మాగారాలకి కావలిసిన యంత్ర సామగ్రిని తయారు చెయ్యగలవు.

శ్రీమతి గాంధీ ఒకసారి లెయొనిడ్ బ్రెజ్నేవ్‌ని న్యూఢిల్లీకి పిలిచి సోవియట్ యూనియన్‌లో మన సహాయంతో ఒక స్కూటర్ ఫ్యాక్టరీ లేదా ఒక ఉక్కు కర్మాగారం లేదా ఒక అణుశక్తి కేంద్రాన్ని పెట్టే ఒప్పందం ఎందుకు చేసుకోరాదు ?

ఇలాంటిదే గనుక జరిగితే, దాని వార్త ప్రపంచ మంతా ప్రసారం అయితే లండన్‌లో నేను కలిసిన బాంకు అధికారి వంటి వారు ఉలిక్కిపడ గలరు !

కాని శ్రీమతి గాంధీ అంతపని చెయ్యరు. చేస్తే భారత్ – రష్యా పరస్పర సహకారం అధ్యాయం ముగుస్తుంది.

భారత్ సోవియెట్ మైత్రి కోసం మనం పెద్ద మొత్తాన్నే చెల్లిస్తున్నాము అదేమిటంటే– మన ఆత్మగౌరవాన్నీ, మన ఆత్మవిశ్వాసాన్నీ వదులుకుంటున్నాము.



# జాగ్రత్త

పొలటుంగు వెంకటేశ్వరరావు

సుబ్బారావు బట్టలు వేసుకుని ట్రిమ్‌గా తయారయి ముందు వరండాలోకి వచ్చాడు, బెల్టు సర్దుకుంటూ. వరండాలో సోఫాలో కూర్చుని వున్న ముసలయ్యగారు కొడుకుని చూసి చిరునవ్వు నవ్వారు. ఆయన నవ్వులో వాత్సల్యం వుంది. ప్రేమ వుంది. ఆశీర్వచనం వుంది. ఆశ కూడా వుంది.

'నేను ఆఫీసుకి వెళ్ళి వస్తాను, నాన్నా' అన్నాడు సుబ్బారావు తండ్రితో.

'అలాగే. జాగ్రత్తగా వెళ్లిరా నాన్నా' అన్నాడు ముసలాయన, వాత్సల్యం నిండిన స్వరంతో.

సైకిలు ఎక్కబోతూ, తలెత్తి బెడ్‌రూం కిటికీ వైపు చూసాడు సుబ్బారావు. కిటికీ దగ్గర నిలబడి దొంగ చూపులు చూస్తూ వున్న సుజాత అర్జంట్‌గా చూపులు ప్రక్కకు తిప్పుకుంది. సుజాత చంకలో బోసి నవ్వులు వలకబోస్తూ బాబు కేరింతలు కొడుతూ వున్నాడు. ప్రేమగా చెయ్యెత్తి టాటా చెప్పాడు సుబ్బారావు. అప్రయత్నంగానే చెయ్యి వూపిన సుజాత కన్నులలో అనురాగం, ఆప్యాయత ఆరాధన దాగలేక పోయాయి. సెలయేటి నీటిలాగ ముందుకి వురికాయి.

'దండాలండీ, అయ్యగారూ !'

వెనుదిరిగి చూసాడు సుబ్బారావు. వినయంగా రెండుచేతులూ కలిపి నమస్కారం చేస్తున్నాడు మునిరత్నం. మునిరత్నం పెళ్ళాం, పిల్లలూ తాడూ బొంగరం లేనివాడు. ఆకలితో అల్లాడుతూ రోడ్ల వెంట తిరుగుతూ వున్న మునిరత్నానికి సుమారు ఏడాదిక్రితం ఆశ్రయం ఇచ్చాడు సుబ్బారావు. అప్పటినుంచీ ఆ ఇంటినే కనిపెట్టుకుని వుంటూ, ఆ పనీ ఈ పనీ చేస్తూ పడివుంటున్నాడు మునిరత్నం.

'ఆఫీసుకేనా అయ్యగారూ ! జాగ్రత్తగా వెళ్లిరండి' అన్నాడు మునిరత్నం అభిమానంగా.

'సరేలేవోయ్' విసుగ్గా అన్నాడు సుబ్బారావు.

జాగ్రత్త !

జాగ్రత్త !

తనకి అందరూ జాగర్తలు చెప్పేవాళ్లే ! తనేదో సముద్రం మీదకి సాహసయానానికీ, పర్వతాల పయికి ఎక్స్‌పెడిషన్‌కీ వెళ్తున్నాడన్నట్టూ, అతి భయంకర మయిన పరిస్థితుల్ని ఎదుర్కోబోతున్నట్టూ—ఇందాక, ఇంట్లో సుజాతా అంతే ! అందరిదీ ఒకటే పాట ! జాగ్రత్త ! జాగ్రత్త !

అతను బాత్‌రూం నుంచి బయటికి వచ్చాడు—ఇందాక. ఏదో పని చేస్తూ అక్కడ్నే తచ్చాడుతూ వుంది సుజాత. సుతారంగా ఆ వాలు జడని పట్టుకుని, తన వేపు త్రిప్పుకుని, కౌగిలిలో బంధించి, పెదాల మీద బలంగా ముద్ర వేశాడు సుబ్బారావు. తన్మయంతో కన్నులరమోడ్చి కొన్ని క్షణాలు అలాగే వుండిపోయింది తరుణి. ఆ వెంటనే ఏదో గుర్తు వచ్చినట్లుగా—

'ఆఫీసుకి టయిమవటంలేదూ ?' అంది నవ్వి ఆ నవ్వు మన మోహన కరమయి వట్టిది !

అవునన్నట్లు తల వూపాడు సుబ్బారావూ, నవ్వుతూ. అప్పుడే పదవుతూంది.

'మరి తొందరగా తయారవండీ.' అని ఆర్డరు వేసింది అతివ.

అలాగేనన్నట్లు కళ్లు ఆడించాడు సుబ్బారావు సుబ్బారావు గబగబా బట్టలు వేసుకుని బెడ్‌రూంలోంచి బయట పడుతూ వుండగా, కాఫీ గ్లాసు తెచ్చి అందించింది సుజాత. అది తాగి కాళీ గ్లాసు అందించుతూ—

'వెళ్తానూ !' అన్నాడు సుబ్బారావు, అయిష్టంగా.

'అలాగే. జాగర్తగా వెళ్లిరండి' అంది సుజాత.

నవ్వుకున్నాడు సుబ్బారావు జాగ్రత్తట ?

సైకిలెక్కి వుషారుగా తొక్కాడు సుబ్బారావు. గబగబ వురికించాడు వాహనాన్ని.

రోడ్డు కురుక్షేత్ర రణరంగంలాగ వుంది. ఆర్టీసీబస్సులు, సిటీబస్సులు, రిక్షాలు, సైకిళ్లు, వాటిమీద క్రిక్కిరిసిన మనుషులు క్షురవాళ్ళు, యువకులు, ముసలి వాళ్ళు, ఆడా, మగా, పిల్లలూను. కాలినడకన కొంప మునిగిపోయేటట్టుగా హడావుడిగా సాగిపోయే

మనుషులు. నేల ఈనినట్లుగా రకరకాల వాహనాలు. ఏ వాహనమూలేని మరి ఎందరో మ ను షు లు. అంతా హడావుడి. స్పీడు. ఉరుకులూ, పరుగులూ.

స్కైకిలు మీద బాణంలాగ దూసుకుని పోతూవున్న సుబ్బారావుని సెం ట ర్లో చప్పట్లుకొట్టి పిలిచాడు, చంచ్రలావు. చంచ్రలావుదీ సుబ్బారావు వూరే. అతనికి ఆ సెంటర్లోనే పెద్ద బట్టలషాపు వుంది. బాగా కలిగినవాడు. అ త ని కి సుబ్బారావంటే అభిమానం. ఆ అభిమానంతోనే అ త ను సుబ్బారావుని మంచికీ, చెడుకీ ఆదు కుంటాడు. మాట రూపేణా డబ్బు విషయి కంగా, అప్పు గావల్సినప్పుడూ, చంచ్రలావు సుబ్బారావుని గతంలో అనేకసార్లు ఆదు కున్నాడు. ఈ రోజుకి లెక్కలు చూస్తే, సుబ్బారావు అతనికి సుమారు వెయ్యి రూపాయలు కాషూ, దుకాణంలో తీసుకున్న బట్టలు తాలూకు అయిదు వ ం ద ల రూపాయలు అరువూ ఇవ్వదేలతాడు.

రెండ్నిమిషాలు మంచీ చెడూ మాట్లాడాక 'ఏమిటయ్యా ఆ స్పీడూ?' అని అడిగాడు చంచ్రలావు.

సుబ్బారావు నవ్వి, 'ఆఫీసుకి టయి మయ్యింది' అన్నాడు.

'అయితే అయ్యిందిలే, జాగ్రత్తగావెళ్లిరా. అసలే రోజులు బాగాలేవు' అన్నాడు చంచ్రలావు మందలింపు ధోరణిలో.

అలాగేనన్నట్లు నవ్వి తలూపి స్కైకిలు ఎక్కాడు సుబ్బారావు.

శివాజీ సెంటర్లో మలుపు తిరుగుతూ వుండగా, ఫాన్సీషాపు లోంచి పున్నారావు పలక రించాడు సుబ్బారావుని.

'ఏంటి పంతులుగారూ! అంత స్పీడుగా పోతున్నారూ? ఏంటీ కతా?'—

'ఆఫీసుకి టయిమయిందయ్యా' అని నవ్వాడు సుబ్బారావు.

'ఆగండాగండి' అని బలవంతాన ఆపాడు పున్నారావు. కుర్రాడ్ని అర్జంటుగా పంపి కూల్డ్రింకు తెప్పించాడు. క్లుప్తంగా మంచీ చెడూ మాట్లాడి, 'నా కాగితాలు ఏం జేశారు?' అని అడిగాడు; కూల్డ్రింకులు తాగటం అయ్యాక.

'పుటప్‌చేస్తానయ్యా రేపటికి సంతకాలు అవుతాయి' అన్నాడు సుబ్బారావు 'అలా చేయండి. నా నెత్తిన పాలు పోసినట్లే

వంతులుగారూ. మీమేలు మరువను' అని ఎన్ని రకాలుగానో తన కృతజ్ఞతలు తెలుపుకున్నాడు పున్నారావు, సుబ్బారావుకి.

'ఆఫీసుకి టయిమయ్యింది. మరి నేను వెళ్లి వస్తాను.'

'అలాగేనండి. జాగర్తగా వెళ్లిరండి బాబూ?' అని హెచ్చరించాడు పున్నారావు.

ఉలిక్కిపడ్డాడు సుబ్బారావు ఏమిటీ జాగ్రత్తలు? ప్రతివాళ్లూ జాగర్త జాగర్త అని హెచ్చరిస్తారేమిటి?

ఆఫీసు దగ్గర సైకిలు దిగాడు సుబ్బారావు అతని సైకుల్ని అందుకుని స్టాండు వేస్తూ, 'మీకు జాగర్త లేదండీ, గుమాస్తాగారూ.' అన్నాడు అటెండరు ఆనందయ్య నిష్ఠూరంగా.

అవసరం అని వచ్చి, మీద పడితే అతనికి పదీ పరకా అప్పు ఇచ్చి ఆదుకుంటాడు సుబ్బారావు. ఆ కృతజ్ఞత వలన ఆనందయ్య సుబ్బారావుని కంటికి రెప్పలాగ చూసుకుంటాడు. మాటల్లో, చేతలలో ఆత్మీయతని వెలిబుచ్చుతూంటాడు.

'ఒక అర్థ రూపాయ ఇట్లా ఇవ్వండి. ఫ్రంట్ టయర్‌కు పంచరు వేయించుకు వస్తాను. గాలిబోయిన ఈ సైకిల్ని ఎట్లా తొక్కుకు వచ్చారండీ మీరూ?!'

తెల్లబోయి చూసాడు సుబ్బారావు. ఫ్రంటు టయిరు గాలి పూర్తిగా పోయివుంది. ఆనందయ్యకి అర్థరూపాయి ఇచ్చి పంపి ఆఫీసులోకి చొరబడ్డాడు సుబ్బారావు.

'రండి. రండి. అన్నగారూ ! మీ కోసమే చూస్తున్నాను' అంది అనుపమ ఆ అమ్మాయి కొత్తగా పనిలో చేరింది. తెలీని విషయాలు

## జాగ్రత్త

చెప్తూ ఆఫీసు పనిలో ఆమెకి సహాయం చేస్తుంటాడు సుబ్బారావు.

'ఏమిటమ్మా ! ఏమిటీ సంగతి!' అన్నాడు సుబ్బారావు ఆప్యాయంగా.

'అబ్బ! మీరు ఇంత జాగర్తలేని మనుషులేమిటండీ బాబూ! ఇవాళ మేనేజింగ్ డయిరక్టరు వస్తున్నారని జ్ఞాపకం పెట్టుకోలేదూ, మీరూ!? ఇప్పటిదాకా చిందులు త్రొక్కి, ఆఫీసరుగారు, ఈ స్టేట్‌మెంట్‌ని నా మొహానకొట్టి, ఎం డీని రిసీవు చేసుకోవటానికి రైలుస్టేషనుకివెళ్లారు. గంటలోవస్తారట. అప్పటికి ఈ స్టేట్ మెంట్ పూర్తిచేసి, ఫెయిర్ కాపీ టైపు కొట్టించి ఇస్తే తను సంతకం పెట్టి ఎం, డి. కి ఇస్తారట.' అంది అనుపమ కంగారుగా.

'అలాగే, చేద్దాంలే' అన్నాడు సుబ్బారావు. అలాగే, ఆ స్టేట్‌మెంటూ, దానితోపాటు ఎం. డి. కి చూపించవలసిన ఇతర కాగితాలూ తయారుచేసాడు. ఆఫీసులో సుబ్బారావుకి మంచి పేరు వుంది. బుల్‌వర్కు చేస్తాడని అందరూ అభిమానిస్తారు. ఆఫీసరుకు కుడి భుజం లాంటి వాడని అంటారు. అందువలన అతనంటే అందరికీ అభిమానం.

అంతలో ఎం. డి. ని తీసుకుని అడావుడిగా ఆఫీసరు వచ్చాడు. ఆయనసలే కంగారు మనిషి. రాంగానే ఎం.డీ. ని ఏ. సి. రూంలో పెట్టి, ఇవతలకి వచ్చి, చిందులు వేసాడు ఆఫీసర్.

'ఏమయ్యా! సుబ్బారావ్! మీరంతా ఇంత జాగర్తలేని మనుషులేమయ్యా!? ఏమయినయ్యా ఆ స్టేట్మెంటూ?'— అంటూ నెత్తినెక్కి చిందులు తొక్కాడు.

'రడీ, సార్' అన్నాడు సుబ్బారావు నవ్వి.

'మరి— నాలుగు బండ రిఫరెన్సులూ ఏం చేసావ్? నా ప్రాణం తోడాడే ఎం డీ.'

'అవీ పుటప్ చేసానండీ'

'ఫెయిర్ కాపీలు! అవి కొట్టించావా లేదా ?'

'రడీ సార్. ఏం కంగారు లేదు.'

'అలా అని ముందే చెప్పి వుండకూడదా? మంచి పనివాడివేగానీ— నీకు జాగర్త లేదయ్యా సుబ్బారావూ! పైకి రావలసినవాడివి గదా. అలా వుంటే ఎలా చెప్పు' అంటూ గబగబా ఫైల్సుమీద సంతకాలు పెట్టి, వాట్ని చంకలో పెట్టుకుని, సంతృప్తిగా సకిలిస్తూ ఇకిలింపు మొహం పెట్టుకుని, ధైర్యంగా ఎం. డీ దగ్గరికి నడిచాడు ఆఫీసరు.

వుస్సురని నిట్టూర్చి కుర్చీలో వాలిపోయాడు సుబ్బారావు.

అనుపమ నవ్వింది.

'ఏంటిసార్ ! అలా అయిపోయారు?' అంది.

'జాగ్రత్త.'

"అదేంటి అన్నగారూ ?!' అంది ఆశ్చర్యంగా అనుపమ.

'జాగర్త, జాగ్రత్త అని ఇప్పటికి అరడజనుమందయినా ఈ రోజున నన్ను హెచ్చరించడం జరిగింది. ఏమిటా జాగ్రత్త?! ఎనీథింగ్ డేంజరస్?!— అని నా మనసు పీకుతూ వుంది మేడమ్' అన్నాడు సుబ్బారావు నీరసంగా.

'ఏంలేదు. టయిరయిపోయారు గదా. ఒక

కప్పు కాఫీ త్రాగండి. ఆనందయ్యని కాంటీనుకి పంపించాను.'

'అది సరే. ఏమిటీ ఈ జాగ్రత్తలని నా ప్రశ్న గదా !

'ప్రశ్నాలేదు. ఏంలేదు. మనసు సంశయా స్పదమూ, ఆందోళనాయుతమూ అయిన క్షణాలలో ప్రతి మనిషీ అనాలోచితంగా వాడే మాటే జాగ్రత్త. పట్టించుకోనక్కరలేదు.'

'అంతే నంటారా మేడమ్?'

'ఎస్ సర్— లీవ్ ది టాపిక్. కాఫీ వచ్చింది.' అంది అనుపమ. ఆనందయ్య అందించిన కాఫీ కప్పు అందుకుంటూవుండగా వొలికి చొక్కామీద పడింది.

'మీదంతా తొందర సార్ జాగర్త లేదు. నేనిస్తున్నానుగా. చూడండి. మీ చొక్కా పాడయింది' అంటూ విసుగుదలలో ఆప్యాయతని రంగరించి అన్నాడు— ఆనందయ్య.

'ఫర్వాలేదు లేవోయ్. ఇట్సాల్ రయిట్' అని సుబ్బారావు అన్నా, ఆ రోజంతా గొణుగుతూనే వున్నాడు ఆనందయ్య. అతని తీరు అతన్ని.

గంట అయింది.

ఆరు దాటి ఏడూ అయింది.

ఎనిమిదింటికిగాని ఎం, డీ లేచి ఐ. బీ కి వెళ్ళాలేదు. నైట్ హాల్ట్. 'సుబ్బారావ్. మీరంతా ఇక వెళ్ళిరండి. రేపు ఏడింటి కల్లా ఆఫీసులో వుండండి అందరూ, జాగ్రత్త' అంటూ గుసగుసగా సూచనలు ఇచ్చి ఎం. డి. తో పాటు కారెక్కాడు— ఆఫీసరు.

జాగ్రత్త !

జాగర్త ! జాగర్త !!

సైకిలు ఎక్కి ఇంటివయిపుకి సాగిపోతూ వున్న సుబ్బారావు చెవుల్లో ఆ మాట లే మాటి మాటికీ ప్రతిధ్వనిస్తూ వున్నాయి.

బజారు,జనంతో నిండి నేల ఈనినట్లుగా వుంది. సోడియం వేపర్ లాంపులు వెల్తురు ముద్దల్ని గుమ్మరిస్తూ వున్నాయి. హారన్లు మోగిస్తూ జనం మధ్యనుంచి దూసుకు పోతున్నాయి రకరకాల మోటారు శకటాలు. గణ గణ మంటూ గంటలు మోగిస్తూ దూసుకువచ్చి మీద పడినంత పని చేసి తప్పుకుపోతున్నాయి,రిక్షాలూ, బైసైకిళ్ళూ.

అభిమన్యుడిలాగ సైకిలు మీద దూసుకు పోతున్న సుబ్బారావుకి టక్కున ఒక ఆలోచన వచ్చింది ప్రేమతో, అభిమానంతో, ఆదరంతో అతని గుండెలు నిండాయి.

సుజాతకి మల్లెపూలు కొనాలి. బాబుకి చాక్‌లెట్లు తీసుకొనాలి, ముసలాయనకి పొడుం పుచ్చుకొనాలి. మునిరత్నానికి అరటి పండ్లు తీసుకొనాలి.

తటాలున సైకిలు త్రిప్పుకొని రోడ్డు అవతలి వైపుకి పోబోయాడు సుబ్బారావు.

జాగర్త ! జాగర్త ! అని చెవుల్లో ప్రతిధ్వనులు ఇంకా విన్పిస్తూనే వున్నాయి.

సర్రున ఎదుటి నుంచి దూసుకుని వచ్చిన ఎంబాసిడరు కారు కీచుమంటూ బ్రేకులు వేసి ఆగింది కుదుపుతో. కంగారుగా దాన్ని

> **గాలీ, నీరూ**
>
> ఒకప్పుడు అనుకున్నా
> ఈ దేశంలో
> గాలీ నీరూ
> ఉచితం అని.
> పాలల్లో నీళ్ళూ
> టూత్‌పేస్టు ట్యూబుల్లో గాలీ
> చూసిన తర్వాత
> ఇప్పుడనుకుంటున్నా
> ధరల పట్టికలో అగ్రస్థానం
> వాటికి ఇవ్వడం
> ఉచితం అని !
>
> — కాశీనాథ & కాశీనాథ

తప్పుకుని ఎడంవయిపుకి బాణంలాగా సైకిల్ని పరుగెత్తించాడు సుబ్బారావు.

వెనుక వయిపు నుంచి, మదించిన ఏనుగులాగా, కట్టుతప్పిన స్ప్రెయిన్‌బుల్ లాగా, పిచ్చిపట్టిన కుక్కలాగా, అరుస్తూ — ఓవర్ స్పీడుతో వచ్చి పడింది సిటీబస్సు, తప్పుకోవటం శక్యం కాకపోయింది. అయిపోయింది!

అయ్యో ! అయ్యో ! !

పాపం ! ఎంతఘోరం జరిగిపోయింది ! !

అన్యాయమండీ బాబూ.

జాగర్త, నాయన్లారా ! ఎవరి జాగర్తలు వాళ్ళు పడక పోయిన్నాడు మనయొక్క రోడ్ల మీద. మనుషుల ప్రాణాలకి సెక్యూరిటీలేదు. కనుక జాగ్రత్త అవసరం.

సుబ్బారావింట్లో చీకటి గడ్డకట్టిపుంది ఒక గంట తరువాత.

గచ్చు నేలమీద ఆరడుగుల పొడవున తెల్లగా గుడ్డ ఆ బట్టకి ఒక వయిపున గుడ్డిగా వెల్గుతూ వుంది ఆముదపు దీపం. ఆ బట్టక్రింద–పక్షి ఎగిరిపోయిన సుబ్బారావు నిర్జీవ దేహం. ప్రక్కనే మొదలు నరికిన చెట్టులా పడివుంది సుజాత. ఆమెకి కుడి వయిపున దుఃఖసాగరంలో కూలబడి వున్నాడు ముసలాయన.

మునిరత్నం, చంద్రరావు, పున్నారావు, అనుపమ, ఆనందయ్య, ఆఫీసరు, ఆఫీసు స్టాపూ తలలు వాల్చుకుని నిలబడి వున్నారు. ఎవరి మొహంలోనూ కళలేదు. అందరి చూపులలోనూ భయం, వేదనా, దుఃఖం ! ఏదో పోగొట్టుకున్నతనం. వెలితి.

వున్నట్టుండి, ఆర్తనాదంతో ఎలుగెత్తి శోకించింది సుజాత. బావురు మన్నాడు ముసలాయన. గొల్లుమన్నారు మునిరత్నం, ఆనందయ్య. కళ్ళు వత్తుకుంది అనుపమ. పున్నారావు, చంద్రరావూ బిక్కమొహాలు పెట్టారు. ఆఫీసరు కర్చీఫులోకి ముక్కు చీదుకున్నాడు !

నలుగురికీ కావలసిన మనిషి సుబ్బారావు. సహృదయుడు. ప్రేమాస్పదుడు. మంచివాడు, సుబ్బారావు. ఏ ఒక్కరికీ దక్కకుండా పోయాడు. అందుకే శల్య సదృశమయిన బాధ.

అప్పుడు అక్కడికి తప్పటడుగులు వేస్తూ వచ్చాడు బాబు. సుజాత దగ్గరకి వెళ్ళి ఆమె మెడని కావిలించుకుని తన వయిపుకి తిప్పుకున్నాడు. లేత గొంతుకతో, కాతర స్వరంలో 'అమ్మా' అని పిలిచాడు. 'అమ్మా. అమ్మా' అని పిలిచాడు ముద్దు ముద్దుగా, అమ్మని.

'నా సంగతి ఏమిటే అమ్మా ? నా గురించిన జాగ్రత్తలు ఎవరు పడతారు మరి?' అన్న ప్రశ్న ఆ పిలుపులో వున్నట్లనిపించింది, విన్న నలుగురికీ.

కారు చీకటిలో కాంతిరేఖ తొంగి చూసింది. శిధిలాల నుంచి చిరుమొక్క చిగుళ్ళు బయట పడ్డాయి. స్తంభించిన వాతావరణంలోకి సన్నటి గాలి రివట వీచింది.

# షాలాక్షుని డైరి



## సుబ్బారావు సాహసం!

బిట్రగుంట రైల్వే పోలీసు క్వార్టర్స్‌లో మొన్న 19వ తేదీన నెల్లూరుకు చెందిన పూలాసింగ్ హో ముగ్గురమ్మాయిలనుతీసుకువస్తే, యిదేమివిపరీతం అని పక్కవాటాలో వున్న సుబ్బారావు అనే హెడ్‌కానిస్టేబులు అడిగాడట. దానికి ఆ సింగు నాయిష్టం. ఎంతమందిఆడాళ్ళతో నయినా లైతక్కలాడ్తాను అన్నాడట. దాంతో యిద్దరికీ తగువై చేతులు చేతులుకలుపుకున్నారట. పూలాసింగ్ ఆ సుబ్బారావు తలమీద టార్చిలైటుతో శక్తివంచన లేకుండా హోహటిచ్చు కున్నాడట. అయినా సుబ్బారావాఅఘాయిత్యాన్నాపాడట.

## ఎవరి పొరపాటు?

మొన్న 12వ తేదీన మద్రాసు నుండి చీరాల వెళ్తున్న ప్యాసింజరులో అడుక్కుంటున్న వోకుర్రాడిని మూడేళ్ళ క్రితం తప్పిపోయిన తన కొడుకుగా గుర్తించిన మేరీ ఇస్తారాణి, ఆపిల్లాడు నువ్వు నాతల్లివి కావు కావని నిదిలించినా వినక, బిట్రగుంటలో అతనిని స్టేషను పోలీసులకు వప్పగించి, తాను తనభర్తతో, తగిన ఆధారాలతో తిరిగివస్తానని అప్పటివరకూ తన పిల్లవాణ్ణి వారి స్వాధీనంలోఅట్టే పెట్టమని చెప్పి వెళ్ళి తిరిగి వచ్చేసరికి పోలీసులు వుత్త చేతులు చూపారట. మీరు రాడం ఆలస్యమయింది. ఆకుర్రాడు మా అమ్మదగ్గరకెళ్తాను మొర్రోమని ఏడుస్తూంటే ఏమీచెయ్యలేకపోదిలేశాం అన్నారట. మళ్ళి మాకొడుకును కలిసే దెలా అని ఆతలిదండ్రులు వలవలా ఏడ్చారట. పోలీసులంత బాధ్యతా రహితంగా ఎలా ప్రవర్తించగలిగారు?

## అనాథైన ప్రభుత్వ గెస్టుహౌస్

ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గెస్ట్‌హౌస్ హో అనాథై ఆశ్రయ మిస్తోందట. ఆ గెస్ట్‌హౌసులో వున్న ఎవరూ కనీసంహో పైసాకూడాచెల్లించ లేదట. 1961 నుంచి 1981 వరకూ చూసిన లెక్కలలో 2.54 లక్షలుబకాయివున్నట్టు తేలిందట. బిల్లులు చెల్లించనివారిపేర్లలో కాసు బ్రహ్మానంద రెడ్డి, పి. వి. నరసింహారావు, యస్. వెంకట్రావన్, జనార్ధన్ రెడ్డి వెంకట్రావ్, వెంకటస్వామి, రోడా మిస్త్రీ, లచ్చన్న వంటి ప్రముఖులు కూడా వున్నారట. నో కామెంట్స్—

## మేనక అమేథి వెళ్లాలనుకోడంలో ఆంతర్యం!?

మనేకా గాంధి తాను అమేథి వెళ్ళి, అక్కడి ప్రజలను కలుసుకోవాలని వున్నట్టు ప్రకటించారట. స్వర్గీయ సంజయ్ గాంధి అక్కడి నుంచి పార్లమెంటుకు ఎన్నికయినారనీ, ఆయనను ఎన్నుకుని, అభిమానించిన ప్రజలను పరామర్శించి రావాలని తన అభిప్రాయమనీ అన్నారట. అయితే ఇందులో అంతర్గతమైన రాజకీయమున్నదనీ, రాజీవ్ గాంధి కూడా అక్కడనుంచే ఎన్నికయినారనీ, ఆయనకక్కడున్న మంచి పేరును కూకటివేళ్ళతో పెకిలించి వేయ మనేకా బయలుదేరనున్నారనీ, వీలయితే యీమె యీ విషయం అక్కడ బాహాటంగానే ప్రజలకు చెప్పవచ్చునీ రాజకీయ ఇంద్రజాలికులంటున్నారు. ప్రైమినిస్టరిన్ బడ్డింగా యీవిడ!! హహాహోస్!




"తప్పక చూడండి! అమ్మ!

అమ్మ అంటే దైవం. అమ్మ అంటే కనిపించే దేవత అమ్మ అంటే ప్రేమ-

అలాంటి ఉన్నతమైన పాత్రలో మీ అభిమాన నటి భారతీరాణి నటించిన ఉత్తమ కథా చిత్రం అమ్మ!

నేడే ఆఖరి రోజు-తప్పక చూడండి!

తప్పకచూడండి! అమ్మ!" దూరంనుంచీ మైక్ వినిపిస్తోంది. బుజ్జిగాడి చెవులను సోకినయ్యి ఆ మాటలు. అవి వాడిమీద ఎంతో యిదిగా పని చేసినయ్యి.

"ఇవ్వాళ తప్పకుండా చూడాలి. చివరి రోజు కూడా. తను ఆ సినిమా తప్పిపోకూడదు." పట్టుదలగా అనుకున్నాడు మనసులో.

కానీ— కానీ తన దగ్గర డబ్బులు లేవు. తండ్రిని అడుగుదామంటే ఎక్కడవుంటాడో? సిన్నమ్మను అడగాలి. ఇంటికెళ్ళి సిన్నమ్మను డబ్బులు అడగాలి"

చకడకా ఇంటివైపు నడిచాడు బుజ్జిగాడు.

బుజ్జిగాడికి పదేళ్ళు. మూడో క్లాసు చదువుతున్నాడు. వాడికి తల్లి లేదు. తండ్రి ఉన్నాడు వాడి తండ్రికి ఆ పేటలో మహా పేరు. పేరంటే ప్రతిష్ట అనుకోకూడదు. వృద్ధులంతా వాడ్ని 'రంగడు! అంటారు. పిల్లలు 'రంగయ్య మావ' అంటారు. మధ్య వయసు ఇల్లాళ్ళు మాత్రం 'తాగుబోతు రంగడు' అంటారు. అసలు వాడి పేరు పాండురంగయ్య ఈ పాండురంగయ్యకి కల్లుపాకలో వుంటే ఆకలికూడా తెలీదు. వాడికొక్క తాగుడే కాదు. ఇంకా అన్ని వ్యసనాలు వున్నయి.

రంగడి రెండో పెళ్ళాం, అంటే బుజ్జిగాడి మారుతల్లి పేరు లక్ష్మి. అది ఏడో తరగతి వరకు చదివింది. ఆ పేటలో ఆడవాళ్ళకెల్లా తనే ఎక్కువ చదివిందని దానికి గర్వం. లక్ష్మి తెగ సినిమాలు చూస్తుంది. నవలలు చదువుతుంది. తను వెళ్ళేప్పుడు బుజ్జిగాణ్ని మటుకు సినిమాకి వెంట తీసుకెళ్ళదు. ఎప్పుడూ కడిగిన ముత్యంలా వుంటుంది. ఎంతో సోకు చేసుకుంటుంది. అన్నట్టు లక్ష్మికి, తను సినిమా వాళ్ళంత అందమైనదని నమ్మకం.

ఇదీ క్లుప్తంగా బుజ్జిగాడి కుటుంబం గురించి—

ఇంటి కొచ్చేప్పటికి బుజ్జిగాడికి గుమ్మంలోనే ఎదురయ్యింది లక్ష్మి. గుమ్మంలో నిలబడి నాడివంక అదోలా చూసింది.

"సిన్నమ్మా... సిన్నమ్మా సినిమాకెళతా! డబ్బులివ్వవూ?" అడిగాడు లక్ష్మిని.

"చాల్లే! నీకు తోడు సినిమా! దరిద్ర వెధవా!" కసురుకుంది.

భయంగా చూశాడు వాడు ఆమెవంక. అలాగే బయటకు వీధిలోకి పరుగెత్తాడు.

కాసేపు రోడ్డుమీద తిరిగాడు. కానీ వాడికి

అలా తిరగబుద్ధి కాలేదు. మనసంతా సినిమా మీద వుంది.

మళ్లీ యింటికి వచ్చాడు. పిల్లిలా వంటింట్లోకి వచ్చి, దొడ్లోకి తొంగి చూశాడు. అప్పుడు లక్ష్మి తడికలబాత్రూంలో స్నానం చేస్తోంది. అది స్నానం మొదలెట్టిం దంటే ఒక అరగంట పడుతుంది అదయ్యే సరికి. అది బుజ్జిగాడికి తెలుసు

కాసేపు అక్కడే నిలబడి ఆలోచించాడు.

"ఔను! పిన్నమ్మ నిన్న పోపుల డబ్బాలో డబ్బు పెట్టింది. పెట్టడం తను చూశాడు. వాటిని తను తీసుకుంటే?" వాడికి కాళ్లలో సన్నగా వణుకు మొదలయ్యింది.

"దొంగతనం! ఎలా అవుతుంది దొంగ తనం! కాదు." మనసుకి వచ్చచెబుతున్నాడు. ఆ డబ్బుమీద నుంచి మనసును మళ్లించలేక పోతున్నాడు. వాడి చెవుల్లో మైకువాడి మాటలు వినబడుతున్నయ్యి.

ఇహ నిలబడలేకపోయాడు. పరిగెత్తి వట్లుగా పోపులడబ్బాను చేరుకున్నాడు. ఆ డబ్బాలో డబ్బులు తీసుకొని, అంత వేగం లోను బయటికి వచ్చాడు. రోడ్డుమీదకొచ్చి నిలబడ్డాడు.

## అమ్మ

"అమ్మయ్య! పిన్నమ్మ సూడలేదు." తన చేతిలో డబ్బులు లెక్కపెట్టుకుంటూ అనుకున్నాడు. అవి రూపాయి డబ్బులున్నయ్యి. తృప్తిగా వూపిరి పీల్చాడు.

"ఇహ ఈపూట మధ్యాహ్నం యింటికి రాకూడదు. రోడ్లమ్మట్ట తిరిగి, మాట్నీ సినిమా సూసేసి వెళ్లాలి." అనుకుంటూ ముందుకి నడిచాడు బుజ్జిగాడు.

మధ్యాన్నం రెండయ్యేవరకూ తెగతిరిగాడు టౌనంతా. మధ్యాన్నం అన్నం తినలేదు. అయినా వాడికి నీరసం రాలేదు తనకిష్టమైన సినిమా చూస్తున్నానన్న సంబరంలో—

తిరిగి తిరిగి థియేటర్ వద్దకు వచ్చాడు. వాడు అక్కడికి వచ్చేటప్పటికే టిక్కెట్లు ఇస్తున్నారు. టిక్కెట్లు ఇస్తున్నారని తెలియగానే తగని హడావుడి పడిపోయాడు. అట్టాగే టిక్కెట్టు తీసుకుని లోపలికి వెళ్లాడు. తన్నెవరూ చూడకుండా గోడ పక్కగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. వాడు మనసులో పొంగిపోయాడు తన అదృష్టానికి.

సినిమా మొదలు పెట్టారు.

బుజ్జిగాడు తదేకంగా తెరవైపు చూడసాగాడు. భారతీరాణి 'అమ్మ'గా అద్భుతంగా నటిస్తోంది. సినిమాలో ఆవిడ పిల్లలకి అన్నం పెట్టింది. వాళ్లకి కథలు చెప్పింది. పాటలు పాడింది. రాత్రిపూట పక్కన పడుకోబెట్టుకుంది.

బుజ్జిగాడికి మనసు నిలవటంలేదు. ముఖం యింత చేసుకు చూస్తున్నాడు; వాడి కసలు ఈ లోకంలో వున్నట్లు లేదు—

సినిమా అయిపోయింది.

చాలా తొందరగా అయిందనిపించింది బుజ్జిగాడికి. జనం బయటకు వస్తున్నారు. తనూ మెల్లగా బయటకు వచ్చేశాడు.

పార్కువైపు నడక సాగించాడు. సినిమా అవగానే పార్కు కెళదామని ముందే అనుకున్నాడు. చీకటి పడేవరకూ అక్కడే వుండాలనుకున్నాడు.

బుజ్జిగాడు పార్కులో ఒక బెంచీమీద కూర్చున్నాడు. అక్కడ కూర్చున్నాడేగానీ, వాడి కళ్లనిండా సినిమాలో భారతీరాణి కనిపిస్తోంది.

"సినిమాలో అమ్మ బావుంది" మనసులో అనుకున్నాడు.అప్పుడే వాడికి చాలా బాధేసింది

# "మాది ఒక ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్ కుటుంబం"



## రవికి ఎంతో ఇష్టం దీని రుచి
## వాడి నాన్నకు కావాలి గట్టిపళ్లు
## మరి నేను వాడుతా దీన్ని చిగుళ్లకోసం

**ఫోర్‌హెన్స్ చిగుళ్లను రక్షిస్తుంది**

చిగుళ్లు బలహీనంగా, మెత్తగా ఉంటే మీ పళ్లు ఆరోగ్యంగా ఉన్నప్పటికీ అవి వదులై ఊడిపోవచ్చు. ఫోర్‌హెన్స్‌లోని గుణకారక అస్ట్రింజెంట్ చిగుళ్లను గట్టిపరచి చిగుళ్ల బాధలను అరికట్టుతుంది.

**ఫ్లోరైడ్ పళ్లను రక్షిస్తుంది**

పిల్లలలో ఫ్లోరైడ్ పంటి ఎనామెల్ పొరను గట్టిపరచి పుప్పిపళ్లు కాకుండా కాపాడుతుంది. పెద్దలలో, ఫోర్‌హెన్స్‌లోని ఫ్లోరైడ్ ఎనామెల్ పొర నిరోధక శక్తిని పెంచి దంతక్షయాన్ని కల్గించే క్రిముల నుండి పళ్లను కాపాడుతుంది.




# ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్

చిగుళ్లనూ, పళ్లనూ–రెండిటినీ రక్షిస్తుంది

అది నురుగు ఇస్తుంది కూడా!



284 F.203 TEL






అమ్మ

వాడికి అమ్మ లేనందుకు.

"తనకు అమ్మలేదు. సచ్చిపోయింది.

తనకి బాగా గుర్తే!

తన అమ్మ కూడా అన్నం పెట్టేది. కథలు చెప్పేది పక్కన పడుకునేది ఇప్పుడు తనకు అమ్మలేదు.

ఆనాడు—

అమ్మ సచ్చిపోయింది. తను ఎంతో ఏడ్చాడు. నాన్న పెద్దగా ఏడ్వలేదు. ఆ రోజు తను అన్నం కూడా తినలేదు కానీ మర్నాడు ఆకలేస్తే తిన్నాడు.

తరువాత తనకు నాన్న ఇంకో అమ్మని తెచ్చాడు. కొత్త అమ్మ పేరు సిన్నమ్మట. అప్పుడు ఆ మాటే చెప్పాడు నాన్న తనకి.

కానీ సిన్నమ్మ తనకి అన్నం సరిగా పెట్టేది కాదు. ఎప్పుడు కొట్టేది! నాన్నకు తనమీద చాడీలు చెప్పేది.

తన్ని నాన్న కూడా బాగా సూట్టం మానేశాడు అదేమిటో—"

బుజ్జిగాడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

మళ్లీ వాడికి సినిమాలో అమ్మ గుర్తొచ్చింది. చొక్కాతో కళ్లు తుడుచుకున్నాడు.

కాసేపు అక్కడే కూర్చున్నాడు వాడు. తరువాత యింటికి వచ్చేశాడు.

"ఏరా! దొంగ సచ్చినోడా! పోపులడబ్బాలో డబ్బులు ఎత్తుకెళతావ్రటా! ఏం చేశావురా ఆ డబ్బులు— ఏదీ యిట్నాతే! వూఁ!" బుజ్జిగాడివంక కోపంగా చూస్తూ అంది లక్ష్మి, వాడు గుమ్మంలో అడుగు పెట్టగానే,

"సినీమా కెళ్లాను. అమ్మ!" బిక్కు బిక్కుమంటూ చెప్పాడు బుజ్జిగాడు.

"ఓరి— దరిద్రపెదవా! నీకు సినీమా కావాల్సొచ్చిందంట్రా— సినీమా! పొద్దున్న ఎళ్లొద్దని అన్నానా?" ఎడా పెడా వాడి చెంపలు పగలకొట్టింది.

అంతటితో వూరుకోకుండా "నిన్ను— నిన్ను యిట్నా వూరుకుంటే లాభం లేదురా. బుద్ధి సెప్పాలి" అంటూ పక్కనే వున్న చీపురుకట్ట అందుకుని కొట్టసాగింది వాణ్ని.

బుజ్జిగాడు ఏడ్వసాగాడు.

వాడి ఒళ్లంతా వాచి కండెలు కట్టింది—

"ఏడుస్తావా పైగా ఎదవా? నీకిరాత్రి కూడు పెట్టేదిలేదు పస్తుపడుండు ఫో—" వాణ్ని తిట్టుకుంటూ లోపలికెళ్లింది.

ఆ రాత్రి బుజ్జిగాడికి జ్వరం వచ్చింది. చిక్కాగసేపు మేలుకోలేక వాడు పెందలాడే నిద్రపోయాడు.

లక్ష్మి మాత్రం వాడి సంగతి పట్టించుకోకుండా అన్నం తిని పడుకుంది.

రాత్రంతా లక్ష్మి ఒకటే తిట్లు బుజ్జిగాణ్ని, రంగణ్ని కలిపి–

"ఎదవ మూక! నాపాలికొచ్చి పడ్డారు తండ్రికి తగ్గ కొడుకు–కొడుక్కి తగ్గ తండ్రి తలరాతకొద్దీ కట్టుకున్నా రెండో పెళ్లి వాణ్ని–"

కాసేపు తన్ను తాను తిట్టుకుంది.

ఆ రోజు బాగా పొద్దుపోయి వచ్చాడు రంగడు యింటికి మర్నాడు పొద్దునకి బుజ్జిగాడికి జ్వరం బాగా పెరిగింది. రంగడు వాణ్ని తాకనన్నా తాకకుండా; పక్కింటి పిల్లాణ్ని వెంటేసుకెళ్లి మందుల షాపులో రెండు టాబ్లెట్లు కొనిచ్చి పంపాడు.

అవే వేసింది వాడికి లక్ష్మి.

ఆ రాత్రికి యింకా పెరిగింది జ్వరం. మూసిన కన్ను తెరవకుండా పడుకున్నాడు.

## క్ష ణి క ము !

క్షణికోద్రేకము
శాశ్వతమైన
మంచి పనికి
ఆటంకము
కల్గిస్తుంది.
క్షణికానందము
అశాశ్వతమైన
మానవ
జీవితానికి
ఊరట
కల్గిస్తుంది.

– ఆర సి పుల్లయ్య

చిన్నగా కలవరింతలు కూడా మొదలయ్యింది. ఒళ్లెరగకుండ నిద్రపోతున్నాడు.

ఆ నిద్రలో ఒక కల–

ఆ కలలో వాడికి తన అమ్మ కనిపించింది. అమ్మ తన్ని పిలుస్తోంది. దగ్గరకు రమ్మని చేతులు సాచి నవ్వుతోంది–

ఆ పిలుపు వాడికి ఎంతో దగ్గరగా, తియ్యగా వినిపిస్తోంది.

"అమ్మ పిలుస్తోంది – అమ్మ దగ్గర కెళ్లాలి! అమ్మా! వస్తున్నా... వచ్చేస్తున్నా– నీ దగ్గరకు వచ్చేస్తున్నా!" బిగ్గరగా అరవబోయాడు. ఆ మాట గొంతుదాటి రాలేదు.

గొంతులో సుళ్లు తిరుగుతోంది. అమృతం లాంటి ఆ మాట గుండెల్లో మారు మ్రోగుతోంది–

అమ్మ !

అమ్మ ! అమ్మ ! !

"అమ్మా !" ఒక్కసారి గావుకేక పెట్టాడు గొంతు పెగల్చుకొని.

అది వాడు అమ్మ కోసం పెట్టిన చావుకేక !

అంతే–

ఆ తీపి గొంతులో నరం తెగింది.

ఆ పాల గుండెలో రక్తం పొంగింది.

బుజ్జిగాడు వెళ్లిపోయాడు వాడి 'అమ్మ' దగ్గరకి. ★




**సిహెచ్. వి.ఎన్. ఆర్. — సత్తెనపల్లి**

పునర్జన్మపై మీ అభిప్రాయం ఏమిటి ?

నేనుకాదు గాని నా పిల్లలు ఎత్తారనిపిస్తుంది!

సంఘసంస్కర్తలకుండవలసిన లక్షణాలు ఏమిటి ?

మానవత్వం టు ది పవర్ ఆఫ్ఎన్.

కాలచక్రంతో పరుగిడలేని వారికి మీ సలహా?

వూరుకుంటే— అదే మనని లాగేస్తుంది !

ప్రముఖ నటుల రచయితల ఆదర్శప్రేమవివాహాలు అపజయం పొందాయి. ఇది ప్రేమవివాహ వ్యవస్థకి గొడ్డలిపెట్టు. ఇవి ఇలాఅవడానికి కారణం ఏమిటి ?

వ్యామోహం ప్రేమ అనుకోవడం ఒకటిఅయితే అవసరాలు శాశ్వతం అనుకోవడం రెండోవది.

**పి. ఆర్. జి. — కొమ్మూరు గ్రామం**

అక్కగారు! మనిషికి జీవితంపై ఎపుడు విరక్తి పుడుతుంది.

ఎప్పుడేవిటి తమ్ముడూ! పరిస్థితి తనకు అనుకూలించనప్పుడల్లా మనిషికి బ్రతుకు మీద విరక్తి పుడుతూనే వుంటుంది.

**వి. జె. ఆర్. — ఇచ్ఛాపురం**

ఆడది తన ప్రేమను ఎలా వెల్లడిచేస్తుంది ? మగవాడు ఎలా పోల్చకలడు ?

ఇన్నివేలతెలుగు సినిమాలు చూసీ తెలుసుకోలేని వాళ్లు వుంటారంటారా ?

**జి. టి. ఆర్. — హిజిగురి (అస్సాం)**

చిన్నతనం నుండి విడదీయరాని అన్నదమ్ముల అనుబంధం పెళ్లిళ్లు అయ్యాక విడిపోతుంది. దీనికి కారణం ఆడదికాదా ?

కాదు. బ్రహ్మచారి వివాహితుడుఅయినప్పుడు పరిస్థితులు మారితీరితాయి. సంస్కారంగలవాళ్లు మారిన పరిస్థితులనిపట్టి ప్రవర్తిస్తారు. లేనివాళ్లు కొత్తగా వచ్చిన కోడళ్లని ఆడిపోసుకుంటారు.

**జి. జి. — బొంబాయి**

చిన్నతనంలో నా మెడమీద 'బురుతు' వేయించారు. ఆ మచ్చ ప్లాస్టిక్ సర్జరీతో పోగొట్టుకోవచ్చా ?

వచ్చు. కాని మెడమీద మచ్చ మిమ్మల్ని ఏం చేసింది ? అది బాధపెడితే చూడాలిగాని, అందంగా లేదని ఏం చెయ్యనక్కరలేదు దాన్ని మరిచిపోండి.

**పి. హెచ్. ఎల్. — ఖమ్మం**

మీకు తెలిసిన యిళ్లలో పని చేస్తాను. బ్రతకడానికి ఏ ఆధారంలేదు. బాధలు పడలేక మీకు రాస్తున్నాను.

పొట్ట పోషించుకోడానికి పనిపాటలు చేయాలని చూడడంలో తప్పులేదు. కాని ఉన్నవూరును మించిన స్థలం ఎక్కడో వుందనుకోవడం పొరపాటు. స్థానబలాన్ని మించినదిలేదు. యీ పని అక్కడే ధైర్యంగా ప్రారంభించండి. మంచికీ చెడుకీ ఆదుకునే వాళ్లయినా వుంటారు.

**సిహెచ్. ఆర్. — సిర్‌పూరు, కాగజ్‌నగరు**

జీవితంలో ఒక ఆడది చెయ్యరాని నేరం చేస్తే ఈ సమాజం ఒప్పుకోదు. మగవాడు వెయ్యితప్పులు చేసినా సమాజం ఒప్పుకుంటుంది. ఎందుకు?

సమాజంలోని, సాంఘిక నీతిలోని సూత్రావళి పురుషులు సృష్టించుకున్నవి కనుక !

**యి. ఏ. ఆర్. — హుజూరునగరు**

స్వార్థంకోసం తమ కుమార్తెలను తన తమ్ముళ్లకే పెండ్లిచేస్తున్న అక్కయ్యలను ఏమనాలి ?

తెలియని దైవంకంటే తెలిసిన దెయ్యం మేలని నమ్మేవాళ్లు అనాలి.

**కె. వి. ఆర్. — చిలకలూరిపేట**

చదువుకోవాలనివుంది. కాని పరిస్థితులు చదువుకోనివ్వలేదు. ఏమి చేయమంటారు ?

అలా అనేకంటే అప్పుడే చదువుకోవాలనిపించలేదు. ఇప్పుడు చదువుకోలేదే అని బాధగా ఉంది అనండి. ఇప్పుడేనా మించి పోయిందిలేదు. మనసుంటే మార్గంఅదేదొరుకుతుంది. తీరికసమయంలోనే చదువుకోవచ్చును.

**కె. ఎస్. ఆర్. — ఖర్గపూరు**

నేను ఒకఅమ్మాయి మనస్ఫూర్తిగా ప్రేమించుకొన్నాం. లెటర్సుకూడా రాసుకున్నాం. కాని ఇప్పుడా అమ్మాయి సరిగ్గా మాట్లాడం మానేసింది.

ఆమె ఉత్తరాలామెకిచ్చి మీ ఉత్తరాలు మీరు తీసుకుని అంతా మరిచిపొండి. బాధ్యతలేకుండా ఆడపిల్లలు ప్రవర్తించినా మీరూ ప్రవర్తించాలని లేదుగా!

**బి. ఎస్. జి. — మద్రాసు**

నేను రోజూ టి.వి. చూస్తాను. కళ్లకేమైనా ప్రమాదం జరిగే అవకాశం వుందా ?

సరైన దూరంలో కూర్చునిచూస్తే కళ్లకేం ప్రమాదంలేదుగాని, తలాతోకాలేని కార్యక్రమాలు చూస్తుంటే బుర్ర పాడై పోతుందేమోనని నాకు భయమేస్తూంటుంది !

**పి. హెచ్. బిహెచ్. — గర్మకుర్తి**

ఆడవారితో మాట్లాడితే అనుమానించేవారిని ఏమనాలి ?

మీరు మాట్లాడే పద్ధతిపై ఆధారపడి ఉంటుంది— అనుమానించడం.

# దాంపత్య సంగీతం

సీరియల్

## శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

భోజనం చేస్తుండగా "కుమార్. మీ మిసెస్ పాపం..." ఏదో అనబోతుండగా, కుమార్ చప్పున —

"ఇండియాలోనే వుంది తను." అన్నాడు.

"అలాగా. సారీ. అయితే ఆమె మీతో రాలేదేం" అన్నాను,

పాపని వదిలి ఆమె ఇండియాలో ఎలా వుందా అన్న ఆశ్చర్యంతో!

"ఆమె ఇక్కడకు రావటానికి ఇష్టపడలేదు." అన్నాడు అన్నం కెలుకుతు. అతని మొహం ఒక్కసారి గంభీరంగా మారటం చూసి నేను అతన్ని మరేం ప్రశ్నించలేదు.

ఆ తరువాత, అతను ఇండియా వెళ్ళాక మంచి నర్సింగ్‌హోమ్ స్టార్ట్ చేయాలన్నట్లు చెప్పాడు. నేను అంతకుముందే ఇండియాలో వున్న నా స్నేహితుల ద్వార నర్సింగ్ కట్టించటం విషయం అతనికి చెప్పాను. అతని కభ్యంతరం లేకపోతే, 'మనిద్దరం కలిసి నర్సింగ్ నిర్మాణం పూర్తిచేద్దాం' అన్న ఉద్దేశ్యాన్ని అతనికి చెప్పాను. అతను సంతోషంగా తన ఆమోదాన్ని వ్యక్తపరిచాడు. నేను ఇండియా వచ్చాక కుమార్ ప్రతి నెల పంపిస్తున్న డబ్బుతో మంచి మంచి ఎక్విప్‌మెంట్స్ కొని, మంచి స్టాఫ్‌ని ఎంప్లాయ్ చేసి నర్సింగ్‌హోమ్ స్టార్ట్ చేసాను. డాక్టర్ మూర్తి నాకు మెడిసిన్ క్లాస్‌మీట్! ఒకసారి వాళ్ళింట్లో ఏదో ఫంక్షన్‌లో నిన్ను చూడటం తటస్థించింది. మూర్తి ద్వార మీ విషయం తెలుసుకున్నాను. అంతకుముందే కుమార్ దగ్గర నీ ఫొటో చూడటంవలన నిన్ను గుర్తించటానికి ఆట్టే శ్రమ పడలేదు. మూర్తితో నీ జాబ్ సంగతి ప్రస్తావించింది నేనే! ఎందుకో మీ జంటని

(గత సంచిక తరువాయి)

ఏ విధంగానైనా కలపాలని నా మనసులో ఆనాడే ఒక దృఢ నిశ్చయానికి వచ్చాను. ఆ విషయం వెంటనే కుమార్‌కి తెలియచేసాను. అతనెంతో సంతోషంగా సమాధానం వ్రాసాడు. కాని తన విషయం నీకు తెలియపరచద్దని ప్రాధేయపడ్డాడు ఇప్పుడు చెప్తు స్వాతీ! మీ ఇద్దరి విషయంలో ఏవైనా అపార్థాలు వస్తే వాటిని తొలగించుకోటానికి ప్రయత్నించాలికాని, వాటిమీద ఇనపగోడలు కట్టి ఎవరికి వాళ్ళు కూర్చోవచ్చా! భార్యభర్తలన్నాక ఎవరైనా ఒకళ్ళు సర్దుకుపోవటం వుంటుంది. ఒకరి కోసం ఒకరు త్యాగాలు చేసుకోవటం, ఒకరి కోసం ఒకరు కష్టాలు పడటం మహానుభావులకే తప్పలేదు."

"అది కాదు డాక్టర్! మా జీవితం ముందు నుంచి విభిన్నంగానే సాగింది కుమార్, నేను గాఢంగా ప్రేమించి పెళ్ళి చేసుకున్న భార్యాభర్తలం అతను మొదట్లో నాకో బంగారు కల సృష్టించాడు ఎంతగా నేనా తీయటి స్వర్గానికి అతుక్కుపోయానంటే, ఆ కలనుండి నేను వాస్తవానికి రాలేకపోయాను. అలాంటివాడు దివ్య పుట్టగానే ఒక్కసారి నన్ను పక్కకు నెట్టేసాడు. అంతటితో నా అవసరం తీరిపోయిందనుకోవాలా! అతని మోజు తీరిందనుకోవాలా! అతనంతటే అతనే నన్ను కొన్నియోజనాల దూరంలో వుంచాడు."

"మీరిద్దరు ఒక్కసారి కూర్చుని చర్చించుకోకూడదు?"

"అలా చర్చించటం వలన సమస్యలు తీర వచ్చేమోకాని, లేని ప్రేమలు ఎక్కడనుంచి వస్తాయి డాక్టర్! మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను ఏమి అనుకోరు కదూ చాలమంది మీరు అవివాహితులనుకుంటారు. నిజమేనా! మరి వివాహంమీద ఇంత చక్కటి ఉద్దేశ్యాలున్నవాళ్ళు మీరెందుకు పెళ్ళి చేసుకోలేదు డాక్టర్!"

రుక్మిణీదేవి పల్చగా నవ్వారు. ఆమెకిది కొత్త ప్రశ్నకాదు. తలనెరిసి వార్థక్యపు వడిలోకి ఆమె అడుగుపెట్టినా చాలమంది ఆమెను అడుగుతూనే వున్నారు. అయితే స్వాతికి అందరికి బదులుచెప్పినట్లు "వివాహంమీద నాకో నిశ్చయమైన అభిప్రాయం కలగలేదు" అని చెప్పలేకపోయారు

"స్వాతీ! మళ్ళీ జీవితంలో ఇంత ఓపిగ్గా నా కథను ఇంకొకరికి విన్పించే అవకాశం నాకు వుండదేమో! అందుకని వివరంగా చెబుతాను ఓపికవుంటే విను.

నేను చాలా బీద కుటుంబంలో పుట్టాను అదీ నలుగురు అక్కలు ఇద్దరు తమ్ముళ్ళ మధ్యదాన్ని. బీదరికం ఒక్కటే కాదు అప్పుడు మమ్మల్ని బాధించేది— నాన్నగార్కి సంసారం పట్ల ఉన్న నిర్లక్ష్యం, ఆయన పేకాట, అమ్మ అస్తమానం పురుళ్ళు— రోగాలు అన్నీను. అలాంటి పరిస్థితుల్లో అక్కలు పెళ్ళి కెదిగి పదిమంది నోట్లో నానటం, ఇదంతా వూహ తెలుస్తున్న నా మనసులో బీదరికం అంటే భరింపరాని పీడకలలా పడిపోయింది. నాన్నగారు కానీ కట్నం ఇవ్వక్కర్లేదని పెద్దక్కని ఓ మూడుకాళ్ళ ముసలి కిచ్చి పెళ్ళి చేసారు. చిన్న అక్క అలాగైతే నేను పెళ్ళి చేసుకోనని మొండికేయటంతో మాకింత నీడనిచ్చే పాత పెంకుటిల్లు అమ్మి దాని పెళ్ళికాస్త సంపాదించుకొనే యువకుడికే ఇచ్చి పెళ్ళి చేసారు. అయితే పురుళ్ళకని పండుగలకని వాళ్ళ రాకపోకల వలన ఇల్లు గుల్ల అయ్యేది. అమ్మకి మంచి మందులు కూడా ఇప్పించలేక పోయేవాళ్ళం. దానితో అమ్మ ఒకరోజు ఈ బాధల నుండి విముక్తి పొందింది. నాన్నగారు సంసారాన్ని ఈదే చాకచక్యం లేక సన్యాసుల్లో కలిసిపోయారు. మా బంధువులు మమ్మల్ని తలో అనాధ ఆశ్రమంలో చేర్చారు. నా ధ్యేయం అల్లా ఒక్కటే! బాగా చదువుకొని, డబ్బు సంపాదించి ఎలాగైనా బీదలకు సాయపడాలని. నా లాంటి అభాగ్యులకు కొంతమందికైనా చేయూతనిచ్చి, వారికి మంచి భవిష్యత్ కల్పించాలని — ఎవేవో ఊహలతో నా మనసు నిండిపోయేది. కన్నెగా మధురమైన కలలుకనే వయసులో నే నెప్పుడు నా ధ్యేయాల గురించి స్మరిస్తూ వుండేదాన్ని. నాకు మంచి మార్కులు వస్తూ, క్లాసులో మిగిలిన వాళ్ళందరి కంటే మంచి పట్టుదల, చదువుమీద శ్రద్ధ వుండటం చూసి ఆ హోమ్‌వాళ్ళే స్కాలర్‌షిప్ తెప్పించి నన్ను మెడిసిన్‌లో చేర్చారు. అయినా అప్పుడు మెడికల్ సీట్లకై ఇంత కాంపిటీషన్

**జరిగిన కథ — 9 :** స్వాతి, కుమార్ వివాహం చేసుకొని విశాఖపట్నంలో కాపురం పెడ్తారు. స్వాతి ఎం. బి. బి. యస్. ఫస్ట్‌క్లాసులో పాసవుతుంది. అక్కడే హౌస్ సర్జన్ చేస్తుంటుంది. కుమార్ ఇంటి ఓ భాగంలో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు. స్వాతికి మామితో పరిచయం కల్గుతుంది. ఆ బిల్డింగ్‌లోనే అద్దెకుంటున్న శారదకి పెళ్లయి ఇంత కాలమయినా ఇంకా పుట్టింటమంచి ఏవో తేలేదని ఆమెను పుట్టింటికి వెళ్లనీయకుండా ఎప్పుడూ దేనికో ఓదానికి హింసిస్తున్న భర్తనుండి రక్షించి ఆమెకు జీవనాధారం చూపించాలని ప్రయత్నిస్తుంటుంది స్వాతి. భర్తతో తెగతెంపులు చేసుకొని స్వాతి సహకారంతో హైద్రాబాద్ వెళ్లటానికే నిశ్చయించుకొంటుంది శారద. కూతురు పేరు 'దివ్య' అని పెట్టుకుంటాడు కుమార్. దివ్య పుట్టిన తరువాత స్వాతి కుమార్‌ల మధ్య మనస్పర్థలూ, చికాకులూ ఎక్కువవుతాయి. స్వాతి పాప పెంపకంలో నిర్లక్ష్యం చేస్తోందన్న అభిప్రాయంతో దివ్యను వదిన దగ్గిర వదిలి వస్తాడు కుమార్. ఒంటరిగా వున్న తండ్రి ఆరోగ్యం క్షీణించటంతో స్వాతి వెళ్లి ఆయనకు సపర్యలు చేస్తుంటుంది. డబ్బుకోసమే వెళ్లి అక్కడ వుంటోందన్న అపోహతో తనూ డబ్బు సంపాయించడానికి ఇరాక్ వెళ్తున్నట్లు ఉత్తరం ద్వారా తెల్పుతాడు ఆమెకి కుమార్. స్వాతి కుమార్‌ని కలుసుకోలేకపోతుంది. ఆ తరువాత తండ్రి చనిపోతాడు. తన ఆస్తినంతా చెల్లికి రాసేస్తుంది. డాక్టరంకుల్ సహాయంతో తన బాబుని తీసుకొని కుమార్ కొత్తగా కట్టిన నర్సింగ్‌హోమ్‌లో చేరుతుంది. అతనిదని తెలిసాక రిజిగ్నేషన్ ఇస్తుంది. ఈ కథంతా రుక్మిణీదేవికి చెప్తుంది స్వాతి.

లేదులే! ఎలాగో డాక్టర్లై బయటపడ్డాము. నా జీవితంలో పరిచయం వున్న కొద్దిమంది నన్ను పెళ్ళి చేసుకోమని సలహాలిచ్చేవారు. ఒకటి, రెండుసార్లు నన్ను వివాహంచేసుకోవటానికి కొంతమంది ఉత్సాహం చూపినా, నేనే కాదన్నాను. కాని ఇప్పుడు అనిపిస్తూ వుంటుంది. జీవితంలో విజ్ఞానాన్ని, డబ్బుని, పలుకుబడిని ఎన్నిటినో సంపాదించుకున్నాను— కాని ఆనందాన్ని, సంతోషాన్ని సంపాదించుకోలేకపోయాను. రోగుల మధ్య తిరుగుతున్నంతసేపు నాకెంతో తృప్తిగా వుంటుంది. ఇంటికి రాగానే నా ఒంటరితనం నన్ను పరిహసిస్తూ వుంటుంది. చెప్పు స్వాతి నా జీవితం విన్నాక నీకేమనిపిస్తోంది."

"మీ వెనక ఇంత చేదు గతం వుందనుకోలేదు. ఎప్పుడు అందర్నీ నవ్విస్తూ ఉషారుగా తిరిగే మీకు మనసునిండా ఇన్ని కన్నీళ్ళా!"

"నా గురించి నాకేం దిగులులేదు. ఇంకెంత? నా జీవితం సంధ్య ప్రొద్దువాలింది. మరింక ఆ భగవానుని పిలుపు కోసం ఎదురుచూడటమే! భార్య భర్తల మధ్య అనుబంధం తెలిసినదాన్ని కాదు-కాని, నా ఊహలో వున్న ఆలోచనలపట్టి నీకు సలహా ఇస్తున్నాను. కుమార్ ఒకవేళ తప్పు చేసినప్పటికి, అతన్ని క్షమించి, ప్రేమించు అందులో ఎంత ఆనందం వుందో నువ్వే గ్రహిస్తావ్! ముఖ్యంగా మీరు పిల్లల కోసం అయినా రాజీపడక తప్పదు. తల్లి, తండ్రి దగ్గర పిల్లలు విడివిడిగా పెరగటం ఆ పిల్లల భవిష్యత్ కంత మంచిదికాదు. బాగా ఆలోచించుకో"

"థాంక్స్ డాక్టర్! నా గురించి మీరింత ప్రేమగా చెబుతుంటే, నావాళ్ళంతా మీలో కన్పిస్తున్నారు. మా ఇద్దరి మనసుల్లో ఒకళ్ళంటే ఒకరికి ప్రేమ ఇంకా నిలిచివుంటే తప్పకుండా మీరు ఆశించినట్లు సుఖాంతమే అవుతుంది. అతను నన్ను అర్థం చేసుకున్నది చాలా తక్కువ. అందుకే 'నాకు డబ్బుపిచ్చని, అహంకారమని' నన్ను నిందించకలిగాడు. చాలా ఏళ్ళ వియోగంవలన అతనికి నామీద క్షణికమైన ప్రేమ కలగవచ్చుకాని, మెల్లగా అది అంతరించిపోవచ్చు. అతనంతట అతను దగ్గరైయ్యే వరకు నేను దూరంగానే వుండదలిచాను. నేను అతని దగ్గరకెళ్ళి చేయని నేరాలకి క్షమార్పణలు చెప్పకొని వేడుకోవాలని మాత్రం లేదు. ఆదినుండి పురుషుని ఆధిక్యాన్ని ఆడది ఒప్పుకుంటూ పాదాలమీద పడుతూనేవుంది. కాని నన్నుమాత్రం ఆ పనికి ప్రేరేపించకండి ప్లీజ్!"

"సరే. స్వాతి. కాని రిజైన్ చేయవద్దు. నా మాట మన్నించి, ఈ హాస్పిటల్లో నాదికూడ కొంత భాగం వుందిగా. అతని డబ్బు తీసుకుంటున్నా వన్న భావం రానీయకు. అతనితో సంబంధం లేనట్లే ఇక్కడే వుండు."

స్వాతి ముభావంగా తలూపింది.

## 19

స్వాతి మరునాడు నుంచి మామూలుగా డ్యూటీకి రావటం చూసి, రుక్మిణీదేవి సంతోషంగా నిట్టూర్చారు.

స్వాతి ఆ రోజు సాయంకాలం హాస్పటల్ నుండి రాగానే, వరండాలో కుర్చీవేసుకొని బాబుని కూర్చో



పెట్టుకొని బొమ్మలు చూపిస్తోంది. ఇంతలో ఎక్కడనుంచో తప్పిన ఒక బాల్‌వచ్చి ఆమె సమీపంలో పడింది. బాబు వెంటనే బాలు కోసం ఆమె ఒడినుండి జారాడు.

"ఆ అది నా బాలు" అంటూ ఎక్కడినుంచో ఒక పాప చప్పన బాలు లాక్కుంది బాబు చేతినుండి బాలు చేయి జారిపోగానే, బాబు ఏడవటం మొదలు పెట్టాడు.

స్వాతి చేతిలోవున్న బుక్ కుర్చీలో పడేసి బాబుని ఎత్తుకుంది ఆమె దృష్టి బాలునితీసుకొని దూరంగా నిలబడ్డ పాపమీద పడింది. పింక్ బుట్ట చేతుల గౌను వేసుకొని, బాబ్‌చేసిన నల్లని ఒత్తైన జుట్టుతో, చాలా ముద్దుగావున్న ఆ పాప స్వాతి చటుక్కున బాబుని దింపి —

"దివ్య" ఔను దివ్యే కావచ్చు.

"రా దివ్య!" అని చేతులు చాపింది

"ఇది నా బాలే ఆంటి! నేను ఆడుకుంటుంటే మీ ఇంట్లో పడింది" అంది భయంగా.

"అది సరేనమ్మా ! ఒక్కసారి ఇలారా !"

దివ్య భయం భయంగా చూస్తూనే దగ్గర కొచ్చింది.

ఒకసారి దివ్యనెత్తుకొని ముద్దులతో ఆమె మొహాన్ని నింపివేసింది స్వాతి బాబు అది చూసి తల్లి కుచ్చెళ్ళు పట్టుకొని లాగసాగాడు

"బాబు. ఈ అక్కతో ఆడుకుంటావా ! ఏం దివ్య ఈ బాబు నువ్వు కలసి ఆడుకుంటారా !"

అలాగే నన్నట్లు తల వూపింది దివ్య.

ఆ రోజునుంచి రోజు దివ్య స్కూల్ వదలగానే, బాబు కోసం స్వాతి వాళ్ళింటికొచ్చేది. కుమార్‌కి స్టాఫ్ క్వార్టర్స్ వెనక అధునాతనంగా కట్టిన మేడ ఇవ్వబడింది. ఒకే ఆవరణం అవటం వలన దివ్యని ఇంచుమించు రోజు చూస్తుండే అవకాశం స్వాతికి కలిగింది తన కూతుర్ని అంత పరాయిగా చూడటానికి బాధగావున్న ఆ మాత్రపు అదృష్టానికి ఆమె సంతృప్తి పడేది.

బాబుకి, దివ్యకి మంచి స్నేహం ఏర్పడింది. దివ్య అప్పుడప్పుడు బాబుతో కలిసి స్వాతివాళ్ళింట్లోనే భోజనం చేసేది. పిల్లలిద్దర్నీ కూర్చోపెట్టి వాళ్ళ కధలు, కబుర్లు చెబుతూ అన్నం తినిపిస్తుంటే, స్వాతి మనసు ఆనందంతో నిండిపోయేది దివ్య ఇంటికెళ్ళి పోయేటప్పుడు, ఆమె తనని ఆంటీ అని పిలిచేటప్పుడు మాత్రం స్వాతి గుండె ఎవరో పిండిన ట్లనిపించేది. ఏది ఏమైనా కుమార్ దివ్యను తన దగ్గరకు పంపించటానికి అడ్డు చెప్పనందుకు సంతోష పడేది !

*          *          *

శారద పబ్లిక్ గార్డెన్స్ ముందు రిక్షా దిగింది. సాయంకాలం అవుతుండటం వలన జనం చల్లగాలి కోసం బయటపడుతున్నారు శారద గేటులోనే నిలబడి రోడ్డువైపు దృష్టి సారించి చూస్తోంది. ఒక్కసారి ఆమె గుండె దడదడలాడింది. ఇలా రావటం తప్పవని కాదు కదా! మాటి మాటికి మోహన్ అన్న మాటలు గుర్తు వస్తున్నాయి.

అతను పేషెంట్స్ చూస్తుంటే, తన పక్కన హెల్ప్ చేస్తోంది. ఇంచుమించు పేషెంట్స్ వెళ్ళి పోయాక,

"శారదా! నీతో ఒక విషయం మాట్లాడాలి సాయంకాలం అలా పబ్లిక్ గార్డెన్ వైపు రాగలవా!" అని చిన్నగా అడిగాడు. తనకు అర్థంకాక, ఆయోమయంగా అతని వంక చూసింది.

అదే విషయాన్ని మరోసారి రిపీట్ చేశాడు.

శారద ఇష్టం లేకపోయినా, వస్తానన్నట్లు తలూపింది. ఈ హాస్పెటల్లో చేరినప్పటి నుంచి మోహన్‌ను చూస్తూనేవుంది అతను మంచి సర్జన్ అని, బ్రహ్మచారి అయినా ఏ అల్లరి చిల్లర వేషాలు వేయడని నలుగురు అనుకోవటం వింది అలాంటి వాడు నోరు తెరిచి 'ఏదో అడగగానే' నిర్మొహమాటంగా 'రాలేనని' అనలేక పోయింది.

"సారీ, చాలాసేపైందావచ్చి. దారిలో ఫ్రెండ్ కన్పించి బ్రేక్ వేసాడు" అంటూ బైక్ దిగాడు మోహన్.

శారద బదులేం చెప్పలేదు.

ఇద్దరూ లోపలికి నడిచారు జనం కాస్త పలచగా వున్నచోట చూసుకొని కూర్చున్నారు.

"శారదా ! నేను ఒకటి అడుగుతాను. ఇష్టం లేకపోతే నిర్మొహమాటంగా చెప్పేసెయ్యి. కాని తప్పుగా అనుకోవద్దు." అన్నాడతను చాలాసేపు మౌనంగా గడిచాక.

"...... "

"నాకీ మధ్యనే పెళ్ళి చేసుకోవాలన్న సంకల్పం కలిగింది. చాలా రోజులనుంచి మా తల్లిదండ్రులు ఈ విషయంలో నన్ను ఒత్తిడి పెడుతున్నా, 'ఇప్పుడు కాదంటూ' దాటేస్తున్నాను. కాని నిన్ను చూసాక, ఎందుకో నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి ఇలా వుంటే బాగుండనిపించింది. నీ కభ్యంతరం లేకపోతే నీ విషయం మా పేరంట్స్‌కి వ్రాస్తాను "

శారద తల వంచుకొని గడ్డిపరకలు పీకుతోంది. అతని మాటలు వింటుంటే ఆమెకు తన జీవితంలో జరిగిన ఒక సంఘటన గుర్తొచ్చింది. తను నర్స్ ట్రైనింగ్‌లో వున్నప్పుడు ఒక అతను తనవెంట పడేవాడు. అతనూ కొన్నాళ్ళకి పెళ్ళి కబుర్లల్లోకి దిగాడు. శారద తన విషయాలన్ని అతనితో వివరంగా దాచకుండా చెప్పింది. అంతే, మరునాడునుంచి తోక ముడిచాడు ఇప్పుడు ఈ మోహన్ అయినా, అంతే! తనేదో అవివాహిత అనుకొని చొరవ చూపిస్తున్నాడు తన విషయం తెలిస్తే తనవంక చూడడు.

"ఏమిటి శారదా! నేనేమైనా తప్పుగ మాట్లాడానా !"

"లేదు మీరేం తప్పుగా చెప్పలేదు. తప్పు చోట చెప్పారు మీకు తెలియదేమో. నా కిదివరకే పెళ్ళైంది. ఆ భర్త పెట్టే బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకొని చనిపోదామన్న తరుణంలో, ఒక దేవత నాకీ మార్గం చూపించింది. ఆ తరువాత నా భర్త మరొకామెను వివాహం చేసుకున్నాడు నా జీవితం రోగుల సేవకే అంకితం ఇవ్వాలని నేనీ వృత్తి చేపట్టాను నాకేమాత్రం వివాహంమీద కాని, అలాంటి సుఖాలమీద కాని ఆసక్తి లేదు."

మోహన్ ఆమె చెప్పేది పూర్తి అయ్యాక—

"నాకు నీ విషయం ఇంతకుముందే తెలుసు శారదా! స్వాతి దగ్గర ఒకసారి నీ ప్రస్తావన వచ్చినప్పుడు, ఆమె నీ గురించి చెప్పారు."

శారద ఆశ్చర్యంగా అతనివంక చూసింది.

"అంటే ! ఈ విషయాలన్నీ తెలుసుకొనికూడ మీరు నన్ను అడుగుతున్నారా !"

"ఔను. తెలిసాకే, నీమీద ఇంట్రస్ట్ పెరిగింది.

"దేనికి. పతితోద్ధారణ చేయాలని సంకల్పించారా ?"

"అంత గొప్పవాడిని కాదులే !"



ఆర్మూర్‌లోని 'నవత' సాహితీవేదిక ఆధ్వర్యంలో యిటీవల ఆధునిక సాహిత్య సంపుటి 'కొత్త యుగం'ను అంకితం అందుకుంటున్న డా. సి నారాయణరెడ్డి, గ్రంధకర్త, నవత అధ్యక్షులు, రాష్ట్ర సాహిత్య అకాడెమీ సభ్యులు శ్రీ ఎ సూర్యప్రకాశ్‌గార్ని సన్మానిస్తున్న దృశ్యం

మదరాసులోని 'కళాసాగర్'వారు యిటీవల ఏర్పాటుచేసిన 'మ్యూజిమైవ్‌నైట్'లోని "భయస్కోప్" నాటికలోని ఒక దృశ్యం. ప్రముఖ నేపద్యగాయకుడు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం, మంజుల ఆర్ట్స్ అకాడెమీ (కాకినాడ) సభ్యులు పంతం వేణు, మణికుమారి, డా. వై. దివాకరరావు, డా. పి. ఉమామహేశ్వరరావు, డా. వి. వి. సుబ్బారావుగార్లని చిత్రంలో చూడవచ్చు.



## 20

"సారీ డాక్టర్! ఈ విషయంలో మీరు ముందడుగువేసినా, నేను మాత్రం చొరవ చూపించ లేకపోతున్నాను. క్షమించండి. నా కంటే మీకు లక్షణమైన ఆడపిల్లలే దొరుకుతారు."

"నేనందంగా లేనని, బహుశ వెనకాడుతున్నావా శారదా ?"

"మానసికమైన అందం ముందు శారీరక అందం విలువ లేనిదని తెలియందాన్ని కాదు. అయినా నేనేమైన కన్నెపిల్లను కానే, రూపాన్ని చూసి వరించటానికి."

"మరి నీ నిరాకరణకు కారణం ఏమిటి ?"

"ఒకసారి జీవితంలో దెబ్బతిని వున్నదాన్ని. ఇప్పుడు ఏ చీకు చింతా లేకుండా నిశ్చింతగా జీవితాన్ని గడుపుతున్నాను. మీరు నన్ను వివాహం చేసుకున్నందు వలన సంఘంలో మీకు చెడ్డపేరు రావచ్చు దాని మూలంగా ఏవో చికాకులు మన వైవాహిక జీవితం ఆనందంగా వుంటుందని నాకు నమ్మకం లేదు అసలు ఈ పెళ్ళి మీ తల్లిదండ్రులు కూడ ఏం సమ్మతించరు. ఒక వివాహం మూలంగా ఇరువైపుల వాళ్ళు సంతోషించాలి కాని, ఇన్ని సమస్యలతో ఈ పెళ్ళి చేసుకోకపోతే మాత్రం ఏంపోయింది."

"శారదా! నీ మండి ప్రోత్సాహం వుంటే నాకీ సమస్యలు పెద్దలెక్కలోనివికావు ముందు నీ అంగీకారం కావాలి. మిగిలినవన్ని నేను చూసు కుంటాను."

శారద అతని వంక ఒకసారి చూసి దీర్ఘంగా నిట్టూర్చింది.

"నాకు కొన్నాళ్ళు టైమ్ ఇవ్వండి. ఆలోచించి చెబుతాను. ఈలోగా మీ ఉద్దేశ్యం ఉపసంహరించుకుంటే మాత్రం మిక్కిలి సంతోషిస్తాను. ఇక వెళదామా. ఈ రోజు నాకు నైట్ డ్యూటీ వుంది కూడాను."

"నేను నిన్ను హాస్పటల్ దగ్గర డ్రాప్‌చేసి ఇంటికి వెళతాను."

"ప్లీజ్ వద్దు. ఇక్కడే కదా. రిక్షామీద వెళ్ళగలను."

శారద అతనికి నమస్కరించి వచ్చేసింది.

శారద వైఖరి అర్థంగానట్లు అలాగే నిలబడి పోయాడు డాక్టర్ మోహన్ !

కుమార్ వచ్చాక హాస్పెటల్ పూర్తి వ్యవహారాలు అతనిమీద వదిలి రుక్మిణీదేవి నిశ్చింతగా వుంటున్నారు. దీని మూలంగా ఆమె తన విరామ సమయాన్ని భగవధ్యానలోను, స్నేహితులతోను గడప గలుగుతున్నారు. అయితే దీని మూలంగా స్వాతికి చాలా చిక్కు కలిగేది. ఇదివరకులా అన్ని విషయాలు రుక్మిణీదేవితో చర్చించినట్లు, కుమార్‌తో చర్చించా లంటే ఆమెకు మనస్పంగీకరించేదికాదు. రుక్మిణీ దేవిని అడిగినా, "ఇప్పుడా విషయాలన్నీ కుమార్ చూసుకుంటున్నాడు స్వాతి, అతన్నే అడుగు" అని తప్పించుకునేవారు.

ఈ విధంగానైనా భార్య భర్తల మధ్య సామరశ్యం కలిగించాలని ఆమె అభిలాష పడ్డట్లు స్వాతి గ్రహించలేదు.

ఆ రోజు స్వాతి ఒక పేషెంట్ ఆపరేషన్ విషయమై డేట్ ఎప్పుడు నిశ్చయించాలి అన్న దానిపై కుమార్‌ని సంప్రదించటానికి వచ్చింది.

తనతో మాట్లాడ్డానికి ఆమె కేమాత్రం ఇష్టం లేదని కుమార్ గ్రహించకపోలేదు. అందుకని ఆమెతో మాట్లాడేటప్పుడు గంభీరంగానే వుంటాడు.

స్వాతి, కుమార్‌తో మాట్లాడుతుండగా, 'బాబు' ఎలా వచ్చాడో, తల్లిని చుట్టేసుకొని "అమ్మా" అన్నాడు స్వాతి, కుమార్ ఒక్కసారి ఉలిక్కి పడ్డారు.

ఇంతలో పనిపిల్ల ఖంగారుగా పరిగెత్తుకుంటూ వచ్చి బాబుని ఎత్తుకుంది.

"బాబుని ఎందుకొదిలేసావ్ !" అంటూ కోపంగా ప్రశ్నించింది ఆ పిల్లని.

"లేదండమ్మా. నేను చూస్తూనే వున్నాను. ఇంతలో ఎలా తప్పించుకున్నారో మీకాడ కొచ్చేసారు, అమ్మా అమ్మా అంటూ."

"సరే. తీసుకెళ్ళు. ఇంకోసారి ఇలా వదిలెయ్యకు."

కుమార్ బాబువంక వింతగా చూస్తున్నాడు.

పనిపిల్ల బాబుని ఎత్తుకుని వెళ్ళిపోబోతుండగా, కుమార్ చటుక్కున కుర్చిలోంచి లేచి "ఏయ్ పాప, ఆ బాబుని ఇలా తీసుకురా" అంటూ వెనక్కి పిలిచాడు.

పనిపిల్ల భయం భయంగా చూస్తూ కుమార్ దగ్గరకు వచ్చింది.

కుమార్ చేతులు జాపి బాబును ఎత్తుకున్నాడు

"నీ పేరేమిటి ?"

"బాబు" అన్నాడు ముద్దుగా

బాబుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు !

స్వాతి ముభావంగా చూస్తూ నిలబడింది.

బాబు కుమార్ దగ్గరనుండి 'అమ్మా !' అంటూ స్వాతి మీదకు దూకాడు

స్వాతి తీసుకొని పనిపిల్ల కిచ్చేసి "ఊం తీసుకెళ్ళు" అని చెప్పి విసవిస వెళ్ళిపోయింది

*          *          *

దివ్య బాబుని తీసుకెళ్ళి చాలాసేపైంది స్వాతి బాబు కోసం చూస్తూ గేటులోనే నిలబడింది

"నేను కాస్సేపు ఇంటికి తీసుకెళతాను ఆంటీ !" అని దివ్య నోరు తెరిచి అడిగాక, స్వాతి వద్దన లేకపోయింది బాబు కూడ ఉత్సాహంగా దివ్య వెనక బయలుదేరాడు

స్వాతి ఇక చేసేదిలేక, గేటు మాత్రం వేసి, కుమార్ ఇంటి వైపు బయలుదేరింది కుమార్ వాళ్ళిల్లు హాస్పెటల్ స్టాఫ్ క్వార్టర్స్‌కి వెనగ్గా వుంది. అతని ఇంటిచుట్టు పెద్ద తోట, రెండు కుక్కలు, వాచ్‌మెన్ చాలా అట్టహాసంగానే వుంది

స్వాతి గేటు బయట నిలబడి లోపలికి చూసింది. దివ్యని, బాబుని ఒడిలో కూర్చోబెట్టుకొని కుమార్ ఏదో వాళ్ళకు చెబుతున్నాడు

"బాబుకి అప్పుడే అంత చనువు ఎలా వచ్చిందో కుమార్ దగ్గర" అనుకుంది స్వాతి.

ఎందుకో తలెత్తిన కుమార్ స్వాతిని చూసి బాబు కేదో చెప్పాడు. బాబు 'అమ్మా' అంటూ పరిగెత్తుకుంటూ వచ్చాడు అయితే చేతిలో పెద్ద 'టెడ్డీ బేర్' బొమ్మ వుంది.

"బాబు, ఈ బొమ్మ అక్కడ పెట్టేసిరా, ఇలా ఇంకొకళ్ళనుంచి బొమ్మలు తీసుకురాకూడదు. తప్పు" అంది స్వాతి బుజ్జగిస్తూ.

బాబు తల అడ్డంగా వూపి 'ఊఁహూ' అంటూ ఇంకా బొమ్మను గట్టిగా పట్టుకున్నాడు.

స్వాతి కోపంగా బొమ్మని లాక్కుని, దివ్యని తీసుకెళ్ళమంటూ పిలిచింది.









డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## బి. జి. ఆర్. — బెంగుళూరు

పిల్లలు పుట్టకుండా ఆపరేషన్‌కు ఆడవాళ్ళు చేసుకుంటే మంచిదా ? మగవాళ్ళు చేసుకోవటం మంచిదా ? మగవాళ్ళు చేయించుకుంటే సెక్సువల్ వీక్‌నెస్ వస్తుందని చాలామంది అంటున్నారు. ఆడవారికి కడుపు చీల్చకుండా చేయగల ఆపరేషన్ ఏదైనా వున్నదా ? వుంటే అది ఏ సమయంలో చేయించాలి ? వివరంగా తెలుపప్రార్థన.

★ కుటుంబ నియంత్రణ ఆపరేషన్ ఎవరు చేయించుకొన్నా ఒకటే. కుటుంబ నియంత్రణ చేయించుకొన్న మగవారికి సెక్సువల్ వీక్‌నెస్‌రావటం జరుగదు. మానసిక దుర్బలత్వం ఉన్నవారు అలా జరిగిందని అనుకోవటం సహజం.

స్త్రీలకి ప్రస్తుతం లాపరోస్కోప్ ఉపయోగించి స్టెరిలైజేషన్ చేయవచ్చును. చాలాచోట్ల కడుపు భాగానికి సంబంధం లేకుండానే ట్రాన్స్‌వెజైనల్ ట్యూబెక్టమీ చేయటం జరుగుతోంది. ఋతుస్రావం ఆగిపోయిన రెండు రోజుల లోపల ఈ ఆపరేషన్ చేస్తారు.

## ఎమ్. ఎమ్. — మదనపల్లి

మా పాప వయస్సు 4 సంవత్సరములు. రాత్రి నిద్రలో విపరీతంగా పళ్ళు కొరుకుతుంది. తరచు నిద్రలో ఏడ్చుట, మూత్రము విసర్జించుట చేస్తోంది ?

★ ఇవి మానసిక బలహీనతను తెలియచేస్తాయి. పిల్లలను అతిగా గారాబం చేసినా, లేక ఎక్కువ కట్టుదిట్టాలతో పెంచినా, ఇలా జరిగే అవకాశం ఉంటుంది. ఇద్దరు ముగ్గురు పిల్లలు ఉన్నవారు ఒకరిని మాత్రం ముద్దు చేస్తూ ఉంటే కూడా మిగతావారికి ఇలా జరిగే అవకాశం ఉన్నది. కొందరికి కడుపులో క్రిములు ఉన్నా ఇలా జరుగవచ్చును. మీరు పైన చెప్పిన వాటి నివారణకి తగిన ఏర్పాట్లు చేయటం మంచిది

## ఎస్. ఎల్. వి. ఎస్ — చిత్తూరు

నా వయస్సు 19 సంవత్సరములు. నాకు మూడు సంవత్సరముల నుండి దూరంగా వున్న వస్తువులు, మనుష్యుల రూపాలు సరిగ్గా కనిపించటం లేదు. కళ్ళజోడు వాడటం నాకు ఇష్టంలేదు వేరే ఏదైనా మార్గం తెల్పండి.

★ కళ్ళజోడు వాడటం ఇష్టం లేనివారు కాన్‌టాక్ట్ లెన్స్‌లు వాడవచ్చును.

---

దివ్య రాలేదు. కుమార్ లేచి వచ్చాడు

"బాబుకి నేనే ఇచ్చాను స్వాతీ, ఆ బొమ్మ."

"కావచ్చు ఇలా అందరిళ్ళల్లో బొమ్మలు తీసుకురావటం అంత మంచిదికాదు. తీసుకోండి."

"బాబు నాకు పరాయివాడు కాదనుకుంటాను నువ్వు కాదనవుగా."

"ఇప్పుడు నేనా విషయాలు మాట్లాడటానికి రాలేదు."

"కాని ఏదో ఒకరోజు నీ నోటినుంచే ఆ విషయం వస్తుంది."

"అంతవరకు వేచి చూడండి వస్తాను" అంటూ బాబునుఎత్తుకొని గబగబా వచ్చేసింది,స్వాతి.

గేటు తీస్తుండగా వరండాలో ఎవరో నుంచొని వుండటం గమనించి, "ఎవరూ" అంది స్వాతి.

"నేనే అక్కా !" అంది శారద చీకటి మరుగు నుంచి వెలుగులోకి వస్తూ.

"అరే ఎంతసేపైంది వచ్చి. బాబు ఆడుకోటానికి వెళ్ళి ఎంతకు రాకపోతే తీసుకురావటానికి వెళ్ళాను. రా కూర్చో !" అంటూ శారదకు కుర్చీ చూపించింది.

బాబు బొమ్మలతో ఆటల్లోపడ్డాడు.

"ఏమిటక్కా. కుమార్ వచ్చినా, నువ్వు ఇలా ఇక్కడ ఒంటరిగా వుండాల్సిన అవసరం ఏమిటి ?" శారద చాలారోజుల నుంచి స్వాతిని అడుగుదామనుకున్న సందేహం అది.

స్వాతి ముభావంగా వూరుకుంది కొంచెంసేపు.

"దానికి వేరే కారణాలున్నాయి శారదా ! ఈసారెప్పుడైనా చెబుతాను. ఈ మధ్య నువ్వు ఇంటికి రావటంలేదు చాలా బిజీగా వున్నావా ?"

"లేదక్కా ! నాకో సమస్య వచ్చిపడింది. అది

## దాంపత్య సంగీతం

నీ ముందుంచితేకాని మనశ్శాంతి దొరికేలా లేదు."

"మళ్ళీ ఏం సమస్యా ? '

"డాక్టర్ మోహన్ తెలుసుగా, అతను నన్ను వివాహం చేసుకోమని అడుగుతున్నారు "

"ఇంకేం గ్రీన్ సిగ్నల్ ఇవ్వాల్సిందే."

"పో, అక్కా ! మళ్ళీ పెళ్ళా. అది అంత తేలికైన విషయామా ! ఎందుకో నా మనసు దీనికి కంగీకరించటంలేదు" శారద గొంతు లోతుగా పలికింది.

"అసలు మోహన్‌మీద నీ అభిప్రాయం ఏమిటి ?"

"అతనిమీద దురభిప్రాయం ఏమిలేదు. అయితే ..."

"అలాంటప్పుడు ఇంక ఆలోచన ఎందుకు ?"

"నువ్వు చెప్పేది బాగుంది అక్కా ! ఒకసారి పెళ్ళి అయి ఒక వ్యక్తితో కొన్నాళ్ళు కాపురం చేసాక, మళ్ళి మరొక పెళ్ళా! ఇప్పటికే సంఘంలో నాకు మంచి పేరులేదు. భర్తను వదిలేసి లేచివచ్చానంటోంది."

"నీ భర్త పెళ్ళి చేసుకోలేదా !"

"అతను పురుషుడు. ఆడదానికి కొన్ని ధర్మాలు, బాధ్యతలుంటాయి."

"మరి ఆ బాధ్యతలు నిర్వర్తించకుండా నువ్వెందుకు పారిపోయి వచ్చినట్లు ? ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు శారదా !"

"మరి అతనికే నా వునికి నచ్చలేదు నన్ను వదుల్చుకోవాలని చూసాడు. ఒకవేళ నేను అక్కడే వున్నా ఏదో వంకతో నన్ను వదుల్చుకొనేవాడే."

"మరింకేం అతను భర్తగా తన ధర్మాలనేం పాటించలేదు. పైగా నీపట్ల క్రూరంగా ప్రవర్తించాడు. కాబట్టి కొన్ని కట్టుబాట్లను, కొన్ని ధర్మాలను తెంచుకొని పారిపోయి వచ్చావు. ఈనాడు నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలిగావు. నిశ్చింతగా బతుకుతున్నావు. మనం సాహసించినా, సుఖపడాలి మోహన్‌కి నీమీద ఇంట్రస్ట్ వుండటం గమనించి నీ విషయాలన్ని చెప్పింది నేనే. అంతేకాదు శారద మంచివ్యక్తిని చూసి పెళ్ళాడితే బాగుంటుందని అన్నది నేనే. అతను ఉత్తముడు, నీమీద నిజంగా ప్రేమ వున్న వ్యక్తి కాబట్టే నీ సంగతి పూర్తిగా తెలిసినా నిన్ను పెళ్ళి చేసుకుంటానని ఇష్టపడుతున్నాడు. నన్నడిగితే ఇలాంటి అవకాశం వదులుకోవద్దంటాను."

శారద ఎటో చూస్తూ ఆలోచనల్లో పడింది

స్వాతి లోపలికి వెళ్లి బొమ్మల మధ్య పడి నిద్రలోకి జారిన 'బాబు'ని మంచంమీద పడుకోబెట్టి వచ్చింది.

"అతని తల్లిదండ్రులు ఒప్పుకుంటారంటావా! నా మూలంగా వాళ్ళ ఫ్యామిలీలో కలతలు రావటం బాగుంటుందా? ఇప్పుడు నా జీతంలో కొంత మా కుటుంబానికి పంపిస్తున్నాను. ఆర్థికంగా కొంత సహాయం చేస్తున్నానన్న తృప్తి నాకుంది. పెళ్ళి చేసుకున్నాక, నాకా స్వాతంత్ర్యం వుంటుందా ?"

"ఈ విషయాలన్ని మోహన్‌తో ముందే చెప్పు. ఇలాంటి అల్ప విషయాలను అతను పట్టించుకుంటాడని అనుకోను."

"సరే అక్కా ! మరొకసారి ఆలోచించి నా నిర్ణయం తెలియచేస్తాను అతనికి. వస్తాను" అంటూ లేచింది శారద.

'బెస్ట్ ఆఫ్ లక్' విష్ చేసింది స్వాతి.

( ఇంకా వుంది )

ఎంత బహుళ ప్రయోజనమైనదంటే, ఇది లేకుండా ఇన్నాళ్ళు ఎలా వంట చేయగలిగామని మీకే ఆశ్చర్యం కలుగుతుంది.

# ప్రెస్టీజ్ వారి ప్రెషర్ పాన్



| వేపుడు | హెచ్చు వేపుడు | సాట్ | ప్రెషర్ కుక్ |
|---|---|---|---|









మీరు ఇందులో వేపుడు, హెచ్చు వేపుడు వేసుకోవచ్చు. అవసరమైన అన్నిరకాల మేరకు వేపుడు వేసుకోవచ్చు. మూత ఉంచి వండాలి. అంతే, ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ వెంటనే మీకు సిద్ధం చేస్తుంది. బహుళ ప్రయోజనమైనది. మరియు ఎంతో ముచ్చటైనది. మీ కుటుంబానికి నోరూరించే రుచికరమైన వంటకాలు....క్షణాలలో సిద్ధం చేయడంలో మీకు తోడ్పడేందుకు అనువుగా రూపొందించబడింది.

మూత వేయకుంటే దళసరి గేజ్ కలిగిన ఈ పాన్‌పై కొద్ది నూనెతో ఉల్లిపాయలు, కూరగాయలు, మసాలాలు, మాంసాన్ని, కోడి మాంసాన్ని వేపుడు చేసుకోవచ్చు. ప్రెస్టీజ్ మూతతో దీనిని మూస్తే, మీ వంటకాన్ని వెంటనే సిద్ధం చేస్తుంది. కోడి బుర్రా? 20 నిమిషాలు. మటన్ దోపియాజి? 25 నిమిషాలు.

దమ్ ఆలూ? ఇంకా తక్కువ వ్యవధిలో. మంచి పనులకోసం మీ సమయాన్ని ఆదా చేసుకోండి. మరియు మీ ఇంధనం చిరకాలం నిలువడానికి తోడ్పడుతుంది.

ఒక్క వంటకానికి రకరకాల పాకాలు ఉపయోగించి చివరకు కుక్కర్‌లో వండే శ్రమ ఇక మీకు ఉండదు. బహు పాత్రల పనికి అనుకూలమైన ఏకైక పాత్రను ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీకు అందిస్తున్నది.

ప్రెస్టీజ్ వారే ఈ ప్రెషర్ పాన్‌ను ఉత్పత్తి చేస్తున్నారు. మిక్కిలి ప్రజాదరణ కలిగిన ప్రెషర్ కుక్కర్‌ను భారతదేశంలో మొట్టమొదటగా ప్రవేశపెట్టి, అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ప్రెషర్ వంటను నిరపాయకరంగా తీర్చిదిద్దినది ప్రెస్టీజ్ వారే. ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీ వంటగదిలో మీకు ఇతోధికంగా ఉపయోగపడుతుంది.

**దీని ధరలో సగానికంటె తక్కువకే మీరు దీనిని పొందాలంటే ఇదిగో....**

మీకు ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ ఉంటే, మిమ్ము మీరు అభినందించుకోండి; భారీ గేజ్ కలిగిన పాన్ ధరకే ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీదవుతుంది. ఒక్క పెనం కొంటే చాలు. మీ ప్రెస్టీజ్ కుక్కర్ మూత దీనికి సరిగ్గా సరిపోతుంది. అంతే సరసమైన ధరకు ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీకు లభించినట్లే. ఎందుకంటే, మీ కష్టార్జితమైన సొమ్ముకు విలువైన, నాణ్యమైన ఉత్పత్తులను మీకు సమకూర్చడానికి ప్రెస్టీజ్ కంపెనీ కృషి చేస్తున్నది.

**ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ ఇంకా మీవద్ద లేకుంటే....**

ఒకేసారి బహుళ ప్రయోజనాలు పొందడానికి నిజంగా ఇది మీకు మహదవకాశము. వంటగదిలో మీకు భలేగా ఉపయోగపడగల రెండు పాత్రలు ఇప్పుడు మేము మీకు అందిస్తున్నాము—అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగి భారతదేశంలోకెల్ల నిరపాయకరమైన ప్రెషర్ కుక్కర్ మరియు అద్భుతమైన ప్రెషర్ పాన్—ఒకే ధరకు కొంచెం ఎక్కువలో రెండు పాత్రలు లభిస్తాయి.

ఒకే మూత రెండింటికి సరిపోతుంది మరియు మీకు రూ. 150/-లు ఆదా.




తయారీ.

"నీకేమైనా కృతజ్ఞత అన్నది ఉంటేగా ? ఛ ! నా మెడకో గుదిబండలా తగలడ్డావు. ఇంతకీ నేను వెళ్ళాక సింగారించుకొని కిటికీదగ్గర నిలబడకు. ఏ సాని కొంపో అనుకోగలరు" అంటూ తలుపు భళ్ళున వేసుకొని వెళ్ళిన భర్తను చూస్తూ మంచం మీద నిర్వికారంగా కూర్చుండిపోయింది కమల.

పదేళ్ళు అతనితో కాపురం చేశాక అతని మాటలకు బాధపడే శక్తిని కోల్పోయిందామె. పదేళ్ళ క్రితం అయితే, అతనలాటి మాట అంటే తెగబాధ పడిపోయేది. మళ్ళీ అతను చిరునవ్వుతో పలకరించే వరకూ ఏడుస్తూ కూర్చునేది. అతను వచ్చి, "ఎందుకు కమ్మూ ! అలా ఉన్నావేం ? తోటలోకి వెడదామా ?" అనేసరికి చిరునవ్వుతో అతన్ని ఎదుర్కొనేది. అతను నవ్వుతూ, ఆనందంగా, ఆప్యాయంగా పలకరిస్తే ఆమె ఎంతో సుఖంగా నవ్వుతూ ఉండేది. లేకపోతే లేనిపోని ఆలోచనలతో సతమతమయ్యేది.

పదేళ్ళ క్రితం —

కమల అప్పట్లో ఇంటర్ చదువుతుండేది. సూర్యం వాళ్ళ పక్కింటి అబ్బాయి. చిన్నప్పటి నుండి ఒకరి కొకరు బాగా తెలుసు. అతనామెకు మంచి స్నేహితుడు. అప్పట్లో కమలకు ఇంకే విషయంలో కొరత లేకపోయినా ఒక్క విషయం తల్చుకొని చాలా బాధపడేది కమల నురీ కురూపి కాదుగానీ, అందగత్తెమటుకు కాదు. నలుగురిలో ఎత్తికనిపించే వ్యక్తిత్వం ఆసలేకాదు. చిన్నప్పటినుండి తమ అక్కచెల్లెళ్ళ అందర్లో అందంగావున్న చెల్లెలు విమలతో తన్ని పోల్చుకొని బాధపడేది. అందర్లోకి అందంగా వున్న చెల్లెలు తన పాటలతో, మాటలతో అందర్నీ తనచుట్టు తిప్పుకునే విమల్ని, తన్నూ పోల్చుకొని 'నేను అలా లేనే' అని కుమిలిపోయేది. అందులోనూ ఇంట్లోవాళ్ళు తన పెళ్ళికి ఎంత కట్నం ఇవ్వాలి ? కట్నం యిచ్చినా పెళ్ళి కావటం ఎంత కష్టం అనుకుంటూంటే విని ఓ రకమైన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుని పెంచుకుంది. ఎప్పుడైనా శెలవుల్లో సాయంకాలాల్లో ఇంట్లో వుంటే ఇలాంటి మాటలు వినాలన్న భయంతో పక్కింటికి పారిపోయేది.

అలాంటి సమయంలో చనువుగా, స్నేహ పూర్వకంగా మాటాడే సూర్యం చాలా ఆత్మీయుడుగా కనబడ్డాడు. ఎన్నిరోజులుగానో అణచిపెట్టుకున్న బాధ అంతా ఒకరోజు అతనితో చెప్పింది. ఆ రోజు కమల తల్లి భర్తకు మధ్యాహ్నం కాఫీ ఇస్తూ —

"ఏమండీ కమలకేమయినా సంబంధాలు చూశారా ?" అని కమల పెళ్ళిమాటలు ఎత్తారు.

'లేదు. విమలకు పెళ్ళి చేయమంటే ఈ నెల్లో చేయమన్నా చేసేస్తాను. కమల కంటావా నేనేం చెప్పలేను. దాని అందం చూసీ, మనం ఇవ్వబోయే ముష్టి ఐదు వేలు కట్నం చూసీ ఎవడొస్తాడు చెప్పు ?"

ఇంతవరకూ విన్న కమల ఇహ అక్కడుండలేక పక్కింటికి పారిపోయింది. ఏదో పత్రిక తిరగేస్తున్న సూర్యం కమల్ని చూడగానే —

'అదేమిటి కమలా అలా ఉన్నావ్, ఏమైంది ?' అంటూ లేచి దగ్గరకొచ్చాడు. ఎన్నేళ్ళుగానో ఎవరితోనూ చెప్పకోకుండా దాచుకున్న దుఃఖమంతా ఒక్కమారుగా పొంగివచ్చింది.

'ఈ బాధ నేను పడలేను సూర్యం. నా అనాకారితనం నన్ను మాత్రమే బాధపెట్టేలా అయితే ఫర్వాలేదు సూర్యం. కాని నా గురించి అమ్మా, నాన్న కెంత బాధ చూడు. ఇంకెంత కాలం నాకు చదువు చెప్పించగలరు ? ఈ ఇంటరో, బియ్యేనో అయ్యాక పెళ్ళి చేయక తప్పదు. కాని నాలో ఏముందని ఎవరయినా నన్ను పెళ్ళి చేసుకోవటానికి ఇష్టపడతారు చెప్పు ? నాకున్నపాటి చదువు ఎంతోమంది అమ్మాయిలకుంటుంది. అందమా ? డబ్బా ? నేను చచ్చిపోతే ఎవరికీ ఏ సమస్యా ఉండదు అంటూ కమల చేతుల్లో మొహం దాచుకుని ఏడవ సాగింది.

'అదేం మాట కమలా ? నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను. చావు మాట మరి ఎత్తకు. నువు అందంగా లేవు నీకు డబ్బు లేదు. అంతా నిజమే. అయినా నిన్నే పెళ్ళి చేసుకుంటాను నేను. నీకీ బాధ తప్పించటానికి ఎలాంటి త్యాగమయినా చేస్తాను కమలా' అని సూర్యం అనేసరికి కమల విస్తుబోయింది. ఒక్క నిముషం అది కలా, నిజమా అనిపించింది. రాత్రి చీకట్లో తోవ తప్పిన మనిషికి దూరాన కనిపించే వెలుగు, అది ఏదయినా ఇంటి దీపమన్న నమ్మకం చిక్కనట్టే, కమల అతని మాటల్ని నమ్మలేకపోయింది. ఆ అపనమ్మకంతోనే—

'నిజంగానే అంటున్నావా సూర్యం. నాకోసం అంత త్యాగం చేయటానికి సిద్ధంగా ఉన్నావా ? అయినా ఒక్కమారు ఆలోచించు నేను కాకపోతే నీకు ఎంతో అందమూ, డబ్బూ ఉన్న అమ్మాయి దొరకవచ్చును' అంది.

'నిజమే, కాని నేను నిన్నే పెళ్ళిచేసుకుంటాను అయితే ఇప్పట్నుంచీ ఈ విషయం వూళ్ళో అంతా చాటకు. నా ఎం. ఎస్సీ అయిపోనీ. తర్వాత ఇంట్లో చెబుతాం. మీ ఇంట్లోవాళ్ళెలాగా వద్దనరు. నీకు, ఇంత చదువుకున్న అందమయిన అబ్బాయి దొరికితే అదే తమ పుణ్యం అనుకుంటారు. మా ఇంట్లో వారితో దెబ్బలాడాల్సివస్తే దెబ్బలాడతాను. ఇక ఏడవకు మరి. ఎవరో కొంతమంది అమ్మాయిలే ఏడిస్తే బావుంటారు.'

అలా ప్రారంభమయింది వారి ప్రేమ వ్యవహారం. అతన్ని ఓ రకంగా ఆరాధించేది కమల. కమల కంతవరకు పెద్దగా అబ్బాయిలతో పరిచయం లేదు. పరిచయమున్న సూర్యం ఆమెకు ఆరాధ్య దేవత అయ్యాడు. అతను ఏ లోపమూ లేని దేవుడిలా అగుపించేవాడామెకు.

ఆ తరువాత రెండ్నెల్లవరకూ భూమిమీద నడవలేదామె. అదేదో తెలీని ఉత్సాహం ఆమెను సదా సంతోషంగా ఉండేలా చేసింది. ఆమెలో పొంగి పొరలే ఉత్సాహాన్ని చూసి ఇంట్లో అందరూ విస్తుబోయారు. అది వేసంగి కావటం మూలాన్న తరచు సూర్యాన్ని కలుసుకోగలిగేది ఆమె, ఎన్నో మార్లు.

'నిరాశతో చావాలని ఉన్న నన్ను దేవుడిలా వచ్చి ఆదుకున్నావు సూర్యం' అనేది కృతజ్ఞతతో. అతను ఓ చిరునవ్వు నవ్వి వూరుకునేవాడు.

'అలా నవ్వుతూంటే అచ్చం దేవానంద్‌లా ఉన్నావ్ సూర్యం' అనేది కమల అతన్ని ఆరాధనా భావంతో చూస్తూ.

ఆ సంవత్సరం అతను ఎం. ఎస్సీ చదవటానికి వాల్తేరు వెళ్ళాడు. అతను వెళ్ళాక కమల బాగా బెంగ పెట్టేసుకుంది. అంతవరకూ ఏమీకాని వ్యక్తి ప్రేమ అన్న భావన కలిగేసరికి ఎంత దగ్గరవాడయి పోయాడు — అని ఆశ్చర్యపోయిందామె. రెండు రోజుల కోమారు ఉత్తరం రాసేదతనికి వాటిలో అతన్ని తనెంతలా ఆరాధిస్తోందో, అతను తన దగ్గర లేకపోతే ఎంత బాధగా వుందో రాసేది

'ఇంతకు ముందు జీవితం చాలా నీరసంగా అనిపించేది సూర్యం. కాని దానిలో ఇంత ఉత్సాహాన్ని నింపి, జీవితాన్ని ఆనందదాయక మనిపించేలా చేసి వెళ్ళిపోయావు. నిన్ను చూడకుండా, నీ మాటలు వినకుండా ఎలా ఉండను సూర్యం? ఇంతకీ ఎప్పుడొస్తావు?'

'నీకు సెలవు లెప్పుడొస్తాయో అని ఎదురు చూడటంలోనే నా సమయమంతా గడుస్తోంది ఇప్పుడెవరైనా 'ఏమిటి తల్లీ, ఇంత అసహ్యంగా కనిపిస్తున్నావు' అని అన్నా మునుపటిలా బాధ పడటం లేదు. నా సూర్యానికి నేను బావున్నానని పిస్తేచాలు మిగిలిన వాళ్ళ కళ్ళ కెలా కనిపిస్తేనేం? అయినా ప్రేమకూ, అందానికీ సంబంధ మేమిటి చెప్పు ? ఉట్టి ఆకర్షణే అయితే అప్పుడు అందం ప్రశ్న వస్తుంది. ఇంతవరకూ ఎవరికీ కనిపించని అందం నీకు కనిపించిందంటే దానికి కారణం నీ కళ్ళే అవునా?'

'చిన్నప్పటినుంచీ కని, పెంచిన తల్లీ, అమితంగా ప్రేమించే నాన్నా, అక్కా అక్కా అంటూ దగ్గర కొచ్చే చెల్లీ, తమ్ముడూ అందరూ ఇప్పుడు దూర మయ్యారు. నీ కోసం వీళ్ళ నందర్నీ వదులుకుని వచ్చేయటానికి సిద్ధంగా ఉన్నాను. నువ్వు తోడుగా ఉన్నావంటే ఎలాంటి చీకట్లో నయినా నిర్భయంగా నీ వెంట వచ్చేయగలను '

అలా, అలా ఎన్నో ఉత్తరాలు రాసేది కమల. తన ఉత్తరాల్ని ఎంతో ఆత్రుతగా చదివి గర్వపడే వ్యక్తి ఒకడున్నాడన్న తలంపే ఎంతో సంతృప్తి నిచ్చేదామెకు.

ప్రేమికులకు ప్రపంచమంతా అందంగా కనిపిస్తుందంటారు. కాని కమల విషయంలోమటుకు అది నిజం కాలా. సూర్యం ప్రేమతో ఆమె సుఖి నిజమే. కాని ఆమె దుఃఖినికూడా. అతని ప్రతీ ఉత్తరం చదివేటప్పుడూ కన్నీరు కార్చేదామె. ఇంత ప్రేమిస్తాడు సూర్యం నన్ను. కాని నన్నిలా బాధించటంలో అతనికి కలిగే తృప్తి ఏమిటో.. అనుకొనేది. అతనయి అతనే తను చేసిన పొరపాటును గుర్తించే వరకు ఇక ఉత్తరాలు రాయకూడదు అని గట్టిగా నిర్ధారించుకునేది. కాని ఆమె ఉత్తరం రాయటం ఒక్కరోజు ఆలస్యమయినా "నీ ఉత్తరాల కోసం వేయి కళ్ళతో ఎదురుమాసే ప్రాణి వాల్తేరులో ఉన్నాడన్న విషయం మర్చిపోయావా ? తిరుగు టపాలో నీ ఉత్తరం వస్తుందని ఆశిస్తాను" అన్న అతని ఉత్తరం ఆమె మనసులోని అనుమానాల్నంతా దూదిపింజెల్లా ఎగరగొట్టేసేది. వెంటనే ఓ నాలుగు కాగితాలు ముందేసుకుని ఉత్తరం రాయటానికి కూర్చునేది.

వాల్తేరు వెళ్ళిన కొత్తలో సూర్యం ఓ ఉత్తరంలో —



కడప రచన సాహిత్యవేదిక ఏర్పాటుచేసిన మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రి అవార్డు ప్రదానోత్సవ సభలో ప్రసంగిస్తున్న డా. పుట్టపర్తి నారాయణాచార్యులు, అవార్డు గ్రహీత శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ, అవార్డు ప్రదానం చేసిన డా. మల్లెమాల వేణుగోపాలరెడ్డి, సభాధ్యక్షులు డా. జె. వి. సుబ్బరాయడు, శ్రీ సనగరం పార్థసారథి, శ్రీ వెల్లాల నరహరి శర్మగార్లని చిత్రంలో చూడవచ్చు

*



మానస ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదువారు నిర్వహించిన కవితల పోటీలలో మొదటి బహుమతి పొందిన శ్రీ గుండాన జోగారావుకి మెమెంటో నందజేస్తున్న ప్రముఖ చలనచిత్ర దర్శకుడు శ్రీ కమలాకర కామేశ్వరరావుగారిని చిత్రంలో చూడవచ్చు

# డబ్బా ? అందమా ?

''కమలా,

ఇవాళ ఓ అందమయిన అమ్మాయిని చూశాను. ఎంత బావుందనుకున్నావ్ సన్నగా, పొడుగ్గా, పెద్ద పెద్ద కళ్ళతో బంగారు తీగలావుంది. ఆ అమ్మాయి పేరు లావణ్య నా క్లాసుమేటు. నేను కాలేజీకి వెళ్ళిన రెండో రోజునే ఆ అమ్మాయి నా దగ్గరకు వచ్చి ''మిస్టర్ రావ్. నేను సిలబస్ రాసుకోలేదు మీ దగ్గరుంటే ఇస్తారా? ప్లీజ్'' అంది. ఆమె తియ్యటి కంఠం వింటూంటే అంతా మర్చిపోయా ననుకో కమలా — నిన్ను కూడా ఎంతటి అందం ఆ అమ్మాయిది. సల్వార్, కమీజు వేసుకొని ఆ అమ్మాయి నడుస్తూంటే . హాహ్ ఆ అందాన్ని ఏమని వర్ణించను? ఇంతకీ అబ్బాయిలంతా లావణ్య నన్నే పలకరించినందుకు కంగ్రాచ్యులేట్ చేస్తూ ఏమిటన్నారో తెలుసా? ఇంతమంది అబ్బాయిల్లోంకి నన్నే పలకరించటానికి కారణం నా అందమట నేను గ్రిగర్‌పెక్‌లా ఉంటానని అమ్మాయిలనుకొంటుంటే విన్నారట. మొత్తంమీద నా అందంతో యూనివర్శిటీ లోని అమ్మాయిల్నంతా తిప్పుకోవచ్చని అంటున్నారు. చూడాలి మరి .

వెంటనే ఉత్తరం రాస్తావుకదూ? నీ ఉత్తరం కోసమే ఎదురుచూస్తుంటా!''

అని రాశాడు తన గురించి ఒక్కముక్కయినా లేకుండా అతను రాసిన ఆ ఉత్తరాన్ని చూసి ఆమె హృదయం అసూయతో భగ్గుమంది. మళ్ళీ ఉత్తరంలో కమల —

''నువ్వు లావణ్యని ప్రేమించటం లేదుకదా సూర్యం? అలాగే వుంది నీ వాలకం చూస్తే. అలా మాత్రం చేయకు సూర్యం నా కిప్పుడు ప్రపంచంలో మిగిలింది నువ్వొక్కడివే. మిగిలిన వారేమయినా, నువ్వొక్కడివీ నా వాడివిగా ఉన్నావన్న ఆశతో జీవిస్తు న్నాను నేను. ఇకప్పుడు నువ్వు ఇంకా అందమైన అమ్మాయిని చూసి ఆ అమ్మాయే కావాలి నాకు, నువ్వొద్దు, అంటే నా గతేం కాను. ఎవరు కాదన్నా గోదావరి ఆశ్రయమిస్తుందిలే' అంటూ తన బాధ నంతా వెళ్ళబోస్తూ సూర్యానికి ఉత్తరం రాసింది సూర్యం జవాబుని విప్పి చదవటానికి కూడా భయం వేసిందామెకు దానితో తన జీవితం అటో ఇటో తేల్చేసే ముక్క ఉంటుంది 'నీకు గోదావరే గతి' అంటే...

వణికిపోతూ ఆ ఉత్తరాన్ని విప్పింది దానిలో రెండే పంక్తులున్నాయి

''ఏది ఏమయినా నిన్నే పెళ్ళి చేసుకుంటాను ఆ హామీ చాలుగా. ఇక దేనిగురించీ పట్టించుకోకు.''

అదే ఆమెకు అమితానందాన్ని కలిగించింది ఇక నాకు కావల్సిందేమిటి అని తృప్తిగా నిట్టూర్చింది

కాని ఆ తృప్తి ఎన్నో రోజులు నిలువలేదు అప్పుడప్పుడు సూర్యం ఉత్తరాల్లోని కొన్ని వాక్యాలు ముళ్ళలా గుచ్చుకుంటూనే వున్నాయి అలాంటి ఉత్తరాలు చదివినప్పుడు ఆమెకు 'ఛ, సూర్యం ఇంత నీచంగా ఆలోచిస్తాడేమిటి?' అనిపించేది. అయినా అతనంటే ఉన్న ప్రేమ ఆ భావాన్ని ఆమెలో ఎక్కువ కాలం ఉండేలా చేసేదికాదు ఓ మారతను—

'నువ్వు ఎప్పట్లాగే సింగారించుకొని కాలేజీకి వెడుతున్నావనుకుంటాను అయినా నీకింకా చదువెందుకు, ఎలాగయినా అందంగా కనపడి అబ్బాయిల్ని ఆకర్షించాలన్న తాపత్రయం కాకపోతే? యూనివర్సిటీ అమ్మాయిల హీరోని నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాను కదా, ఇంకా చదువెందుకు చెప్పు?' అని రాశాడు

'అతనికిలాగానే నాకూ చదువు అవసరమని ఎందుకనుకోకూడదు? నాకు కొత్త కొత్త విషయాలు తెలుసుకోవాలన్న కోరికా, నా పరిధిని పెంచుకోవాలన్న ఆకాంక్ష ఉండదని అనుకున్నాడా? లేక నేను ఏమీ తెలుసుకోనక్కర్లేదని అతని అభిప్రాయమా?' అని ఓ రోజంతా బాధపడింది మళ్ళీ, అబ్బే లేదు, నేను ఎండా, వానా అన్నవి లేకుండా ఇలా తిరగటం అతని కిష్టంలేదు, అని తన్నుతానే సమాధానపర్చుకుంది.

సూర్యం ఎదురుగుండా వున్నపుడు ఆమెకు ఇవేవి జ్ఞప్తికి వచ్చేవికావు అతనిమీది ఆరాధనా భావంతో ఆమె హృదయం నిండిపోయేది కా అతను వాల్తేరు వెళ్ళాక ఓ రకమైన అశాంతితో చికాకు పడిపోయేది. ఒక్కోమారు ఆమెకు అనుమానం వచ్చేది 'నిజానికి సూర్యానికి తనంటే అభిమానం ఉందా?' అని అలా అనిపించినపుడే ఓమారతన్ని ఆ ప్రశ్న అడిగింది

'చాలా పిచ్చిగా ఉందే నీ ప్రశ్న' అని నవ్వి వూరుకున్నాడు అతను

'నిజమే అంతా నా పిచ్చిగాని, ఎందుకిలా ఆలోచిస్తున్నాను నేనంటే ఎంత ఇష్టం లేకపో అందర్నీ వదులుకుని అయినా నన్ను పెళ్ళి చేసుకో టానికి సిద్ధపడతాడు! సూర్యం నావాడు, ఇం విషయం గురించీ పట్టించుకోకూడదు' అని సంతృప్తి పడింది కమల

ఆమె ఎంత సరిపుచ్చుకున్నా, ఎందుకో రోజు గడుస్తున్నకొద్దీ— సూర్యం తనకు దూరమవు తున్నాడనిపించింది కమలకు. అతనంటే ఎంతో అభిమానం ఉందామెకు. అతను వూరికి వస్తున్నా డంటే సంతోషమే కాని .

కాని ఇప్పుడు మొదటిలా వారానికి నాలుగు ఉత్తరాలు రాయాలనిగాని లేకపోతే రెండు రోజులు శెలవిచ్చినా సరే అతను వస్తే బావుండునన్న కోరికగానీ లేవామెలో అతని దగ్గర్నుంచి జవాబు రావడం ఆలస్యమైనా మొదటిలా ఆవేదన లేదు కాని అమె మొదటిలా ఉత్తరాలు తరచుగా రాయక పోతే సూర్యానికి చాలా కోపం వచ్చేది. అలా కోపం వచ్చినపుడు అతను రాసే ఉత్తరాలు చాలా బ్రూటల్‌గా ఉండేవి

''నీకు నేనంటే లక్ష్యం లేదు కృతజ్ఞత అసలే లేదు లేకపోతే ఇంకో బాయ్‌ఫ్రెండ్ దొరికాడా? అయినా నీ మోహానికి బాయ్‌ఫ్రెండ్ కూడానా? ఎవడు ప్రేమిస్తాడు నిన్ను? వారానికి రెండు ఉత్తరాల్లా నెలకు రెండు చేశలేం? నీకు తెలుసుగా ఇలాంటి వన్నీ సహించి వూరుకునేవాడిని కానని. ఈ ఉత్తరం అందుకున్న వెంటనే జవాబు రాయాలి

నువ్వు. నీకీ ఉత్తరం బుధవారంనాడు అందుతుంది. శుక్రవారంలోగా నీ ఉత్తరం క్షమాపణలతో సహా నాకందాలి'' అని.

ఆ ఉత్తరంతో కమలకు ఒక్కమారుగా అతనంటే ఏమిటో తెలిసినట్టయింది. అతనంటే ఒక రకమైన భావంతో మూసుకుపోయిన ఆమె కళ్లు ఆకస్మాత్తుగా తెరుచుకున్నాయి. ఏదో సుందర స్వప్నంలో విహరిస్తున్న మనసు, మేలుకున్నాక కనిపించే అసహ్యమయిన వాస్తవికతను చూసి బెదిరి పోయేలాగా ఆమె కూడా కొత్తగా కనిపిస్తున్న అతని రూపాన్ని వ్యక్తిత్వాన్ని చూసి బెదిరిపోయింది. ఆ షాక్ నుండి కొంచెం తేరుకున్నాక నెమ్మదిగా ఆలోచించసాగింది.

'ఇంతకీ అందమూ, ఆకర్షణా లేని తన్ని అతను ప్రేమించలేదు. అతనికి ఎలాంటివారి నయినా సరే ప్రేమించే శక్తి లేదు. అతను తన్ను పెళ్ళి చేసుకుంటానని అనటం ఒక్క కారణాని కోసమే— తన ఆరాధనా, అభిమానం అతనిలోని ఓ దాహాన్ని తృప్తిపరుస్తున్నాయి. దుఃఖంలోపడి చనిపోయినా ఫర్వాలేదనుకుంటున్న ఓ ప్రాణికి జీవదానం చేశానన్న భావనతో గర్వపడుతున్నాడు. అదీగాక అతన్ని ఎవరయినా ప్రాణమిచ్చేంతగా ప్రేమిస్తున్నారన్న ఆలోచన అతనికి సంతృప్తినిస్తోంది. అతను సెల్ఫ్— సెంటర్డ్ మనిషి. అతనికి తన్నుతప్ప మరెవర్నయినా ప్రేమించే శక్తిలేదు. కాని తన్ను మరెవరయినా గాఢంగా ప్రేమించాలన్న కోరిక మటుకు ఉంది

ఒక్కమారుగా ఇదంతా అర్థమయ్యేసరికి కమల తల తిరిగిపోయింది. అయితే అతని ఇంట్లో అతని బానిసలా ఉండటానికి ఓ ప్రాణి కావాలి. మనిషి అతన్ని ఆరాధించగలిగితే మరీ మంచిది ఎవర్నీ ఆకర్షించలేని వ్యక్తి అయితే ఎలాంటి భయమూ అక్కర్లేదు గనుక తన్ని ఎంచుకున్నాడు. పైగా కట్నం తీసుకోలేదన్న అభిమానంతో అతని మాటకు తను ఎదురు చెప్పలేనని అతని నమ్మకం.

'ఇంతకన్నా కట్నం పుచ్చుకుని పెళ్ళాడేవాడే నయం. ముందెంత బేరాలు చేసినా ఆ తరువాత భార్య అన్న గౌరవంతో నయినా చూస్తాడు. అలా కాకపోయినా కారుచీకట్లో చూడకుండా గోతిలో పడవచ్చు. కాని తెలిసీ తెలిసీ ఇలాంటి మనిషిని పెళ్ళి చేసుకొని ఆ బందిఖానాలో ఎలా ఇరుక్కోనూ' అనుకుంది కమల. 'అందుకనే వెంటనే అతనికి ఓ ఉత్తరం రాసింది.

''సూర్యం,

నీకు నా కన్నా అందమైన అమ్మాయ ఓ ఇరవైవేల కట్నంతో దొరుకుతుంది. నువ్వలాంటి అమ్మాయిని పెళ్ళి చేసుకోవటమే ఉత్తమ మనిపిస్తోంది. అవునా? నాకు ఆలోచించేశక్తి, అభిమానించే హృదయం తప్ప మరేమున్నాయి చెప్పు? ఇలా ఏ ప్రత్యేకతాలేని నాతో నీకేం ఆనందం కలుగుతుందో నాకే తెలీటంలేదు. ఇక నా గురించి ఆలోచించటం మానేసి మరో అందమయిన లావణ్యనో, జయనో, అరుణనో, శోభనో పెళ్ళిచేసుకో. నీ సుఖమే నాకు కావలసింది. కమల.''

వెంటనే అతని దగ్గరనుండి ముచ్చటగా నాల్గు వాక్యాలతో కూడిన ఓ ఉత్తరం వచ్చింది.

''నీ ఉత్తరాలన్నీ నా దగ్గర ఉన్నాయన్న విషయం మర్చిపోయినట్టున్నావు. నువ్వు మరెవర్నయినా పెళ్ళి చేసుకోవటానికి ప్రయత్నిస్తే ఏం జరుగుతుందో తెలుసుగా. మా నాన్నగారితో మాట్లాడతాను. వచ్చే వేసంగిలో మన పెళ్ళి అవుతుంది.''

ఆ ఉత్తరం చదివిన కమల నిర్ఘాంతపోయింది. ''నువ్వు అక్కర్లేదు బాబోయ్'' అంటున్న మనిషే కావాలంటాడు. ఇదేం పట్టుదల? పెళ్ళి కాకముందే ఇలా ఉన్న తను పెళ్ళయ్యాక అతన్ని ప్రాణప్రదంగా అభిమానించగలదని భావిస్తున్నాడా అతను? కాని ఇక తను చేయగలిగిందేముంటుంది? అతను నాన్నగారికి ఆ ఉత్తరాల్లో ఏ ఒక్కదాన్ని చూపినా నాన్నగారు ఉగ్రస్వరూపులయిపోతారు. అమ్మ 'నీ మీద ఉంచిన నమ్మకాన్ని వమ్ముచేశావే' అని బాధపడుతుంది. మొత్తానికి తన మాట వినకుండా ఏడుపులూ—పెడ బొబ్బలుమధ్య పెళ్ళికానిచ్చేస్తారు. ఈ ఆలోచనలమధ్య పాగలమధ్య చిక్కుకున్న మనిషిలా ఉక్కిరిబిక్కిరై పోయింది కమల. కాని ఆ పెళ్ళినుండి తప్పించుకునే మార్గమేదీ కనబడలేదామెకు — ఒక్క ఆత్మహత్య తప్ప. ఓ రెండేళ్ళ క్రితం అయితే బహుశా ఆ పనే చేసేదేమో. కాని అయ్యేదేదోకానీ అన్న మొండి ధైర్యంతో అలాగే నిర్లిప్తంగా ఉండిపోయింది కమల.

అతనన్నట్టుగానే వారి పెళ్ళి ఆ వేసంగిలో అయిపోయింది. సూర్యం తల్లిదండ్రులు మొదట్లో ఏమాత్రం కట్నం లేని ఈ సంబంధం వద్దని పట్టుబట్టినా ఎదిగిన కొడుకు మాట కెదురు చెప్పలేక ఒప్పుకున్నారు. అనుకోకుండా కమల పెళ్ళి సమస్య ఇంత తేలిగ్గా తీరిపోవటంతో మహా సంతోష పడిపోయారు కమల తల్లిదండ్రులు.

సూర్యం పెళ్ళికి అతని స్నేహితులు చాలామంది వచ్చారు పెళ్ళి అయిన మరుసటి రోజున సూర్యం ఉన్న గది ముందుగా వెడుతున్న కమలకు ఎవరో సూర్యాన్ని —

''ఇంత అందమూ చందమూలేని అమ్మాయిని ప్రేమించి — పెళ్ళి చేసుకుంటానంటున్నావ్ కనీసం డబ్బయినా ఉందా?'' అనడగటం వినిపించింది అతనేం జవాబు చెబుతాడోనని అక్కడే ఆగి వినసాగింది.

''డబ్బా లేదూ, పాడూ లేదు. నేనంటే పిచ్చి అభిమానం ఆ అమ్మాయికి. ఆ అమ్మాయి రాసిన ఓ ఉత్తరం చూశావుగా, నేనంటే పడిచస్తుంది. కాబట్టి నేనేం చేసినా అడ్డు చెప్పదు. నాకు లావణ్య, జయ, శోభ, పార్వతి, రాగిణి, సరోజినీ లాంటి స్నేహితులున్నారని తెలిసినా ఏమీ చెయ్యలేదు అదే కట్నం తెచ్చిన అమ్మాయైతే నామీద అధికారం చెలాయించటానికి చూస్తుంది కమల నన్ను అలా దబాయించగలదా? ఇంట్లో కుక్కలా పడివుంటుంది!

సూర్యం మాటలు వింటూంటే కాళ్ళక్రింద భూమి కదలిపోతున్నట్టుగా అనిపించింది కష్టపడి వెనక్కితిరిగి తన గదికెళ్ళి పడుకుంది సూర్యానికి తనగురించి ఉన్న 'అభిప్రాయం ఖచ్చితంగా తెలిపోయినది ఇక ఎప్పటికయినా అతను తన్ను అభిమానించగలడన్న ఆశ మొలకెత్తకుండానే చచ్చిపోయింది

ఆ తరువాత ఆమె జీవితం అలాగే అతనన్నట్టుగానే కుక్క జీవితంలాగా గడిచిపోయింది. అతని తిరుగుళ్ళూ, తిట్లూ ఏవీ ఆమెమీద పనిచేసేవికావు అతని మాటలన్నింటినీ ఓ కర్రముక్కలా, నిర్లిప్తంగా, ఉదాసీనంగా వింటూ నిలబడేది. అతను ఎప్పుడయినా ఆమెని కొట్టటానికి చేయెత్తగా, అలాగే అదే ధిక్కారంతో, సంస్కారంతో నువ్వు నాకన్నా తక్కువ అన్న భావంతో అతని మొహంలోకి చూసేది ఆ తిరస్కారం అతని చేతిని ఇకముందుకు వచ్చేలా చేసేదికాదు

ఎప్పుడయినా, ఎవరికయినా ఆమెను పరిచయం చేస్తూ ''మాది ప్రేమ వివాహం'' అని అతను అన్నప్పుడు మాత్రం ఆమె శరీరం కోపంతో భగ్గుమని మండేది. 'ప్రేమ అంటే ఏమిటో ఇతనికి తెలీదు నన్ను మరో దారి లేకుండా ట్రాప్ చేసి పెళ్ళి చేసుకున్నాడు' అని చాటి చెప్పాలనిపించేది

కాని ఆమె చేయగలిగిన దేమున్నది?

* * *

తలుపు దబాలున తోసిన చప్పుడు కావడంతో ఉలిక్కిపడింది కమల

'ఇంకా అలాగే కూర్చున్నావేం? మొగుడు ఇంటి కొచ్చేసరికి కాస్త శుభ్రంగా తయారై ఎదురు రావాలన్న జ్ఞానం కూడా లేదేం? ఇంకెవత్తెనయినా పెళ్ళి చేసుకుంటే డబ్బుకు డబ్బు వచ్చేది ఇలాంటి జిడ్డు మొహాన్ని కాకుండా కొంచెం అందంగా వున్న పిల్లనయినా కట్టుకుంటే సుఖపడుదును నా ఖర్మ కాలి తగలడ్డావు' అంటూ గాలి దుమారంలా లోపలి కొచ్చాడు సూర్యం. అప్పటికే తలుపు దగ్గర కెళ్ళిన కమల ఒక్క క్షణం ఆగి, ''భోజనానికి కంచం పెడుతున్నా'' అంది. ●



## సీరియల్

# కాలం కరిగాక

## వలివేటి నాగచంద్రావతి

*(గత సంచిక తరువాయి)*

వసంత మెల్లగా లేచి గది దాటి హాల్లోకి వచ్చింది.

శవం లేచినప్పటిలా ఇల్లు నీరసంగా నిశ్శబ్దంగా వుంది.

తల్లి గది తలుపులు బిడాయించి వున్నాయి. తండ్రి ఇంట్లో వున్నట్టు లేదు

మురళి గదిలోనించి అస్పష్టంగా భార్యాభర్తలు పడే ఘర్షణ వినిపిస్తోంది.

వంట ఇంట్లో ఓ మూలగా పిల్లలకు గప్‌చిప్‌గా అన్నాలు తినిపించేస్తూ మధ్యమధ్య తానూ ఓ ముద్ద ఎగరేస్తోంది కోకిలాంబ.

కడుపులో కాకులూ ఎలుకలూ గెంతుతూంటే, ఆకలికి ఆగనూలేక ఇంటికి చెందినవాళ్లు ఒక్కళ్లన్నా భోంచెయ్యకుండా తను తినమూలేక, "వీళ్లు చూస్తే ఒక్కళ్లూ లేచేటట్టు లేరు. ఈ పూటకిక ఉపవాసమే ప్రాప్తమేమో. '' అనుకుంటూ కోకిలాంబ వంక ఈసుగా చూస్తోంది సుబ్బాయమ్మ.

ఎవరి ధోరణిలో వాళ్లున్నారు వసంత మెత్తగా నడుస్తూ ఫోను దగ్గరకు చేరింది. తటపటాయిస్తూనే రిసీవర్ ఎత్తి నెంబరు డయల్ చేసింది

అటునించి పలికింది ఆశించినవారు కాదు. "ఎవరు? ఎవరికోసం?'' రామయ్యగారి గంభీర స్వరమది.

గుండె దడదడలాడి చటుక్కున రిసీవర్ క్రెడిల్‌మీద ఉంచేసింది.

పది నిమిషాలు వ్యవధి ఇచ్చి బెదురుతూనే మళ్లీ ఎత్తింది. అదృష్టమే "హలో ఎవరండీ?'' అన్నది గోపీకృష్ణ గొంతు

ఒక్కమాటూ అతనితో మాటాడి వుండని వసంతలో త్రొటుపాటు .. సన్నగా వణుకు.

"నేను. నేను... వసంత. .!''

"వసంత...?'' గోపీకృష్ణ స్వరంలో విస్మయం

"ఊ... నేనే. . మీతో మాట్లాడాలి. ఎక్కడ కలుసుకుందాం?'' తొందర తొందరగా అడిగింది

గోపీకృష్ణ కొంచెం సేపు మౌనంగా ఉండిపోయాడు. బహుశా ఎక్కడికని చెప్పటమా అని ఆలోచిస్తూ గావును— లేదా ఆశ్చర్యాన్నించి తేరుకుంటున్నాడో—

"మీ పక్క వీధిలో సత్యనారాయణస్వామి గుడి తెలుసుగా? అక్కడకు రా. సరిగ్గా సాయంత్రం ఆరున్నరకల్లా అక్కడుంటాను.''

"ఊ.''

"మరి వుంటాను.''

అతను ఫోను పెట్టేసినట్టు 'టక్' మన్న శబ్దం వినబడేదాకా ఆగి రిసీవర్ దించింది వసంత.

అప్రయత్నంగా చేతులు గుండెలమీదికి వెళ్లాయి

'తనేనా ఇంత ధైర్యం చేసింది ?

అవసరం మనిషి భయం మాపి, సంకోచాన్ని వెనక్కి నెట్టేసి ముందుకు తోస్తుంది

పరిస్థితులు మనిషికి జీవిత పాఠాలు నేర్పుతాయి.

సమస్యలు మనసును రాటు తేలుస్తాయి.

చెప్పిన టైముకి కొంచెం ముందరగానే తయారయింది వసంత

"ఎక్కడికే ?'' అన్నది సుబ్బాయమ్మ.

ఈ ప్రశ్న ఎవరి నోటంటానో వస్తుందని తెలుసును.

అందుకే ముందు జాగ్రత్తకి వైరుబుట్టలో కొబ్బరికాయ, పూదొత్తులూ సర్దేవుంచింది.

"గుడికి'' అన్నది అది చూపించి.

ఇంకేమీ అడగలేదు సుబ్బాయమ్మ.

'పాపం పిచ్చిపిల్ల. అనుకున్న పెళ్లిఆగిపోవటం, తల్లీ తండ్రీ అట్లా రెక్కలు తెగినట్టుపడివుంటం- పిల్ల బెగిలిపోయింది. దేవుణ్ణే మొక్కుకుంటే చిక్కులు తీరతాయనుకుంటోంది వెర్రిబాగుల్ది. ఆ రామయ్యని మార్చటం ఆ దేవుడికి మాత్రం తరమా — ? హు !'' అనుకున్నది.

*   *   *

సత్యనారాయణస్వామి ఆలయం —

కొత్తగా కట్టిన కోవెల అది. దాపునే వైభవం పుంజుకున్న ఏడుకొండలవాడి గుడి వుంటంచేత ఎప్పుడో ప్రత్యేక పర్వదినాలు మినహాయించి ఈ ఆలయానికి జనప్రవాహపు వత్తిడి అల్పమే.

భక్తుల అనవసర ఆడంబర పటాటోపాలు లేక ఆలయం అతిప్రశాంతంలో శాంతిని వెలయిస్తూ వుంటుంది

ఆడంబర నిరాడంబరాలకూ, ఆదర నిరాదరణలకూ అతీతమైన ఆ స్వామి చిద్విలాసంగా చిరునవ్వులు రువ్వుతూ చల్లని చూపులు చూస్తుంటాడు.

వసంత ప్రదక్షిణంచేసి దైవ దరిశనం చేసింది ఆందోళనతో కలిగిపోతున్న మనస్సును క్షణం నిశ్చలం చేసి కర్పూర హారతి వెలుగులో మెరిసిపోతున్న జగ్రదక్షకుని మూర్తిని కనులు మూసి మదిలో నిలుపుకో ప్రయత్నించింది.

అప్పటికింకా గోపీకృష్ణ చెప్పిన టైముకి అయిదు నిమిషాలు మిగిలే వున్నయ్

వెళ్లి గుడి వెనకన కోనేటి మెట్లమీద కూర్చున్నది వసంత

చిరుగాలులకే జల్లులుగా రాలుతున్న పొగడపూల సుగంధంతో తులసి వనంమీంచి వచ్చే సువాసనలు కలిసి అక్కడి వాతావరణాన్ని వింత పరిమళంతో నింపుతోంది.

కోనేటి మధ్యగా రాతితో మలిచిన పొన్నచెట్టు మీద చేరిన వెన్నదొంగా, నీళ్లలో సగం మునిగి తమ వస్త్రాల నిమ్మని చేతులెత్తి వేడుకుంటున్న గోపికలూ కళ్లకు విందులు చేస్తున్నారు

సేద దీర్చే సంధ్య పవనాలూ, నాగమల్లి చెట్టు మీద గూళ్లలో సద్దుకుంటున్న కొంగల గడబిడా, లీలగా వినిపిస్తోన్న పూజారి చదివే అష్టోత్తరం, దాగుడుమూతలాడే పిల్లల కిలకిలలూ, కోనేటి నీటిలో గిరికీలుకొట్టే చేపపిల్లలూ, తెలితెలి వెలుగులో రామా—వద్దా అని మొహమాటపడుతూ తళుక్కుమంటున్న తారకలూ, ఆహ్లాదకరమైన ఆ ప్రకృతీ, ఆ పరిసరాలూ వసంతకేమాత్రం ఉల్లాసం కలిగించలేకపోతున్నాయి.

ఏ అందాలు ఆస్వాదించాలన్నా మనస్సు సహకరించాలి గద ! కాకపోతే కాస్త తాత్కాలికోపశమనం

ఆమె దృష్టంతా గోపీకృష్ణ రాకపైన ఆలోచనంతా వచ్చాక ఏమి మాట్లాడటమా అని.

అపురూపంగా గుండెల్లో పదిలపరుచుకోవ

---

**జరిగిన కథ—20 :** కేశవరావ్, చిదంబరం ఇద్దరూ కలిసి 'ప్లాస్టిక్ అండ్ కేన్' ఫ్యాక్టరీ పెట్టి బాగా అభివృద్ధి చేస్తారు. చిదంబరంగారి అబ్బాయి గోపీకృష్ణకి తమ అమ్మాయి వసంతని ఇచ్చి పెళ్లి చేయాలన్న ఆశ కామేశ్వరమ్మ పడగా కేశవరావ్ తమ వంశానికి మురళి వేసిన మచ్చను గుర్తు చేస్తాడు అదీగాక చిదంబరం తండ్రి పరమ చాదస్తుడు. కానీ చిదంబరం గారింట్లోని వాళ్లే వసంతని కోడలిని చేసుకోవటానికి సుముఖత చూపటంతో పెళ్లి ఖాయమవుతుంది. అసలే తమ గుట్టు ఎక్కడ రట్టు అవుతుందోనని లోలోపల మధనపడుతున్న కామేశ్వరమ్మ మురళి భార్యాపిల్లలతో రావడంతో షాక్ తింటుంది. ఏదో విధంగా వీళ్లని ఇక్కడి నుండి పంపేయటానికి ప్రయత్నించినా సోఫియా అంతంత మాత్రానికే లొంగే ఘటంలా లేదు. ఈ విషయాన్ని ఎంత గుంభనగా వుంచినా రామయ్యగార్కి నిజం తెలిసిపోతుంది. కేశవరావ్‌గారు ఆయన్ని ఎంత ప్రాధేయపడినా లాభం లేకపోతుంది. వసంత, గోపీకృష్ణ పెళ్లి ఆగిపోతుంది. ఎన్నో కలలు, మరెన్నో కోరికలు గోపీకృష్ణ సాహచర్యంలో తీర్చుకుందామనుకున్న వసంతకి ఈ వార్త గొప్ప షాక్ !

---

అనుకున్న తొలి సమాగమం ఎలాటి సిగ్గుమాలిన స్థితిలో సంభవిస్తోందీ!

సాహసించి అతన్ని కలుసుకుంటున్నదే కానీ తీరా అతను వచ్చాక గొంతు విడుతుందా తనకి?

తనని చేపట్టవలసిందిగా అభ్యర్థించగలదా?

కన్నెపిల్ల అభిమానం విడిచి అడిగినందుకైనా అతడు తన మాట మన్నిస్తాడా?

ఏమో — అతని ప్రవృత్తి వాళ్ల పెద్దల్ని అనుసరించేదేనేమో? వాళ్ల మాట జవదాటలేని అశక్తుణ్ణి అనేస్తాడేమో — ?

చుట్టు ముట్టిన ఆలోచనలు చెల్లా చెదురయ్యాయి.

ఎదురుగా గోపీకృష్ణ వచ్చి నిలిచేడు

వసంత దిగ్గున లేచి నించుంది

ఇరువురి కనులూ కలిశాయి; క్షణంలో విడిపోయాయి.

మరికొన్ని క్షణాలు మౌనంలో దొర్లాయి

"కూర్చో వసంతా" అన్నాడు గోపీకృష్ణ.

వసంత కూర్చుంది కొంచెం దూరంలో చేతిరుమాలు పరుచుకుని అతనుకూడా కూర్చున్నాడు

"ఏమిటి మాట్లాడాలన్నావు?" నెమ్మదిగా అడిగాడు.

తలవంచుకున్నది వసంత. ఏదో తెలియని ఉద్వేగమామెలో. నోరు విప్పితే మాటకంటే దుఃఖం ముందు దూకేలావుంది.

"మీకు తెలీదా... మన పెళ్లి ఆగిందని... ఊహు... కాదు... ఇక జరగదని" గాద్గదికంగా అన్నది.

తెలీకేం? తెలుసును రాత్రిరి నించీ ఆ విషయమై ఇంట్లో వాళ్లతో వాదిస్తూ వున్నాడు, చీవాట్లు తింటూ వున్నాడు; ఓడిపోతూ వున్నాడు.

ఆ చికాకులోనే వసంత పిలుపు. ఈ సమావేశం. ఒక చిక్కు విప్పుతియ్యనే లేదు— ఏమీ పాలుపోని ఆ స్థితిలోనే మళ్లీ ఈ వత్తిడి.

అతనికి తిక్క తిక్కగా అనిపించింది.

"ఎలా జరుగుతుంది? నీతీ జాతీ అందరూ అంత తేలిగ్గా మంటగలుపుకోలేరుగా—" అన్నాడు దూకుడుగా.

రోషంతో తలెత్తింది వసంత.

"నీతీ జాతీ తప్పామనటానికి ఏం చేశామండీ మేము? మా అన్న తన కిష్టమైన పిల్లని పెళ్లాడాడు. అది నీతి తప్పటమా? చాటు మాటుగా కాకుండా తన వారితో కలిసి బ్రతకాలనుకోడం జాతి తప్పటమా? ఎక్కడో బూజు పట్టిన ఆచారాలు పట్టుకు పాకులాడే ముసలితరం అలా అన్నారంటే అర్థం చేసుకోవచ్చు. కానీ మురిగిపోయిన నిలవ నీళ్లని త్రోసుకుంటూ వెల్లువలా వచ్చే కొత్త నీరు లాంటి ఆరోగ్యవంతమైన మీలాంటి యువకులు కూడా ఆ పాత మాటలే వల్లె వేస్తుంటే ఏమనుకోవాలి?" ఆవేశంతో ఆమె ముక్కు పుటాలు అదురుతున్నాయి.

'నోట్లో వెన్న పెడితే మింగలేదనుకుంటూంటే ఈ అమ్మాయేనా ఇలా పదును పెట్టిన బాకుల్లాంటి మాటలు విసిరింది?' గోపీకృష్ణ చకితుడయ్యాడు. తన తొందరపాటుకు నొచ్చుకున్నాడు.

"ఎక్స్క్యూజ్ మీ వసంతా! ఏదో చికాకులో మతి తప్పి మాట్లాడాను. ఇరుకుదై ఇబ్బంది పెడుతున్నా క్రొత్త త్రోవ త్రొక్కే ధైర్యం లేక పెద్దలు మలిగిన దారిలోనే మూలుగుతూ నడిచే పిరికివాడు కాదు మీ అన్న. అతని ఆదర్శం నిజంగా అభినంద నీయమే. కానీ మా జుట్టు తమ చేతుల్లో ఇరికించుకుని మమ్మల్ని కదలనీకుండా బంధించి తమ మార్గం గుండానే ఈడ్చుకుపోయే మాతాతగారిలాంటి పెద్దలు మారనంత వరకూ మనసెటు లాగినా వారి ఆజ్ఞాబద్ధులంకాక తప్పదు" అని నిట్టూర్చాడు

పాపం అతను మురళిది ఆదర్శ వివాహం అనుకుంటున్నాడు గానీ బలవంతప్పెళ్లని తెలీదు. ఆ అందమైన ముసుగు తొలగించి వసంత అన్నగార్ని తేలిక చెయ్యనూ లేదు.

"ఎదిరించలేరా?" అని తడి కళ్లతో ఆశగా అడిగింది.

"లాభంలేదు వసంతా— అదీ అయింది ఆయన మాట మీరిన మరుక్షణం నించీ నాకా ఇంట్లో నూకలు పుట్టవన్నాడు. నా వరకూ అయితే పైమీది తువ్వాలుతో బయటపడగలను. కానీ నాతోపాటు నా వాళ్లందర్నీ కూడా బయటకు నెట్టి తలుపులు వేసుకుంటానని శపథం చేశాడాయన. నీ కాయన పట్టుదల సంగతి చెప్పక్కరలేదుగదా! అన్నంత పని

చేసే తిరుతాడు. ఉహూ — నా కోసం వాళ్లందర్నీ వీధిపాలు చేయలేను. వసంతా నన్ను మన్నించు'' అన్నాడు దీనంగా.

'ఇంకేమని బలవంతం చెయ్యగలదు?' నిర్వేదంగా ఎటో చూస్తూండిపోయింది వసంత.

కొంచెం సేపయిన తర్వాత, ''పద వసంతా నిన్ను మీ వీధిదాకా దిగబెడతాను'' అన్నాడు గోపీకృష్ణ.

*   *   *

ఎలా నడిచిందో, ఇంటికెలా చేరుకుందో వసంతకి తెలీదు.

ఇంటికి రావటమేమిటి — వెళ్లి వెంటనే తన మంచంమీద వాలిపోయింది.

వసంత రావటం చూసి, ''రావే అమ్మడూ అన్నం వడ్డిస్తానూ — '' అని కేకేసిన సుబ్బాయమ్మకి ''ఆకలిలేదు'' అని ముక్తసరిగా చెప్పి ముఖమటు తిప్పేసుకున్నది.

ఆమెకు దుఃఖం రావటంలేదు. అంతకు మించిన విషాదం అలుముకుంటోంది లోపల ఏదీ తీరకపోయినా అన్నీ తీరిపోయిన విరాగభావన.

కనురెప్పలు మూసివున్నా మనచ్ఛక్షువులకు ఏవేవో దృశ్యాలు ఒక్కటొక్కటిగా గోచరిస్తున్నాయి.

ప్రదానం రోజున పద్మావతమ్మ తన వ్రేలికి ఉంగరం తొడిగేటప్పుడు అదాటున తలఎత్తిన తన చూపుతో కలిసిన గోపీకృష్ణ చూపు — ''పెళ్లిలో తెరసెల్లాతీసి శుభవీక్షణం చేస్తున్నప్పటిలా లేదూ'' అంటున్నట్లనిపించి చిత్రంగా స్పందించిన తన హృదయం.

అన్నగారి పర్సులో తన ఫోటో వున్నదనీ, లేస్తూనే దాన్ని చూస్తాడనీ చెపుతూ అతని చెల్లెళ్లు తనని ఆటలు పట్టిస్తూంటే సిగ్గుగా వున్నా అతని ఆరాధనకు పొంగిపోయిన తన అంతరంగం;

తన పుట్టినరోజునాడు తన కిష్టమని కష్టపడి లిల్లీపువ్వుల బుకే కట్టించుకువచ్చి, తీరా తల్లి ఎదురయ్యేసరికి తత్తరలాడి ఆమె చేతిలో దాన్ని పెట్టేసి వెళ్లిపోయిన గోపీకృష్ణ మొహమాటం;

తను వస్తుందని ముందు తెలిస్తే కాలేజీకి వెళ్లినవాడే ఏదో వంకన మధ్యలో వచ్చి తనను దర్శించి వెళ్లే అతని అనురాగం,

సంక్రాంతినాడు కొత్తచీర సింగారంలో వున్న తన పక్కంటే హడావిడిగా వెడుతూ చటుక్కున తన చెవిలో ''నాదేవి ఈ రోజు పూచిన గులాబి రెమ్మే'' అని వూదిన అతని చిలిపి గుసగుస...ఏవో...ఏవేవో... ఒకనాడు తడిమి తడిమి ఆనందించిన జ్ఞాపకాలే ఇప్పుడు గుండెను ఉక్కు పిడికిట్లో బిగించి నొక్కేసి నలిబిలి చేస్తున్నట్టుగా అనిపించి బాధతో గిలగిల్లాడింది వసంత.

''ఓర్చుకోలేను... ఉహూ... ఓర్చుకోలేను'' అనుకుంటూ దిగ్గున లేచి కూర్చుంది. ఏదో తెగింపు మొండితనంతో తలుపులు తెరుచుకు బయటకు వచ్చేసింది.

అడిగిన వాళ్లకి వడ్డించి మిగతా వాట్లమీద పళ్లెలు బోర్లించి, వంటింటి నడాన కొంగుపరుచుకు పడుకున్నది సుబ్బాయమ్మ.

మాగన్ను నిద్రలో వసంత వంటింట్లోంచి తలుపులు తెరిచి పెరట్లోకి వెళ్లటం లీలగా తెలుస్తూనే వున్నది. అవసరానికనుకున్నది.

ఇంతలో భావిలో గభేలుమన్న చప్పుడు; గుండె గుభేలు మనగా ఎక్కడి నిద్ర అక్కడే పటాపంచ లయిపోయి,

''కొంప ముంచిద్రో. ఓరి కేశవా—కామేశ్వరీ లేవండే— వసంత బావిలోకి గెంతేసిందేవ్'' అంటో వెర్రి కేకలు పెట్టేసింది.

పది నిమిషాల్లో ఇంట్లో జనం బయటి జనంతో కేశవరావుగారి పెరడు మొత్తం నిండిపోయింది.

ఏడ్పులు; ఆహాకారాలు;

కామేశ్వరమ్మయితే గుండెలు బాదుకుంటో బావికేసి పరిగెట్టి తానూ దూకెయ్య బోయింది. బలవంతానా నలుగురామెను కూలేసి పట్టుకు కూర్చున్నారు.

కర్తవ్య విమూఢులై త్రాణ లేనట్టు కూర్చుండిపోయారు కేశవరావుగారు.

వచ్చిన వాళ్లలోనే ఒకరి నొకరు హెచ్చరించుకుంటూ ఒకళ్లు తాళ్లూ తంకర్లూ తెచ్చేరు. బావిలోకి దిగే మనుషుల కొరకు వేరొకరు పరుగులు పెట్టేరు.

పావుగంట తర్వాత కొన వూపిరితో వున్న వసంతను పైకి తెచ్చి పడేశారు.

నీళ్లు కక్కించేరు. కృత్రిమ శ్వాస కల్పించేరు అయినా వసంతలో చలనం కనిపించలేదు.

నిద్రలేపి బలవంతానా తీసుకువచ్చిన డాక్టర్ పల్స్ చూసి పెదవి విరిచేడు.

''డాక్టర్ నా బిడ్డ...'' కేశవరావుగారి స్వరం మితిమీరిన దుఃఖంతో బొంగురు పోయింది.

డాక్టరాయన వంక జాలిగా చూశాడు ''ధైర్యంగా వుండండి. నా ప్రయత్నం నేను చేస్తాను. ఆపైన దైవాధీనం.''

''భగవాన్'' అప్రయత్నంగా కామేశ్వరమ్మ నోటివెంట వెలువడిందామాట.

కామేశ్వరమ్మ రూపం అప్పుడెలా వుందంటే— జుట్టుముడి వూడిపోయి వెంట్రుకలు వీపునా భుజానా మొహానా చిందరవందరగా పడ్డాయి. కొంగుజారిపోయింది. కన్నీళ్లతోనూ కూతుర్ని బయటకు తీసిన వెంటనే కౌగలించుకుని ఏడ్వటం మూలానా జాకెట్టంతా తడిసిపోయింది. కరిగిన కుంకుమ మొహమంతా అలుముకునిపోయింది. ఏడ్చి ఏడ్చి కళ్లు ఉబ్బిపోయాయి. ముక్కు ఎర్రబడిపోయింది

శోకానికి మారుపేరులా వున్న కామేశ్వరమ్మ అంతగా ఆశలేనట్టుగా చెప్పే డాక్టరు మాటలు వింటూనే ''భగవాన్'' అంటూ చిన్నగా కేకపెట్టి పరుగెడుతున్నట్టుగా పూజగదిలోకి వెళ్లి పడ్డది.

దేవతా పీఠం ఎదరగా బోర్లగిలపడి, ''తండ్రుల్లారా నా బిడ్డని కాపాడండి. తల్లుల్లారా నా బిడ్డని బ్రతికించండి'' అంటో పిచ్చిగా నుదురు నేలకేసి కొట్టుకోసాగింది.

తలంతా దిమ్మెక్కిపోతోంది ఆమెకి. చెవిలోంచి ఏకహోరు. ఏదో మైకం కమ్ముకొచ్చేస్తోంది.

ఆ పోతూ పోతూన్న స్పృహలో ''ఏ తల్లి తండ్రుల కడుపు కాలిన ఉసురో మనకు తగిలి వుంటుంది'' అంటున్న భర్త నిష్ఠుర రూపు.

ఆ మాటల వెంటే మసగ మసగ్గా కనిపిస్తూ ''నా బిడ్డని మింగావు నా కడుపుకు చిచ్చుపెట్టావు. నీకూ కూతురు వుంది నా ఉసురు నీకు తగలక పోదు'' అంటోన్న వేరొక కంఠ స్వరం.

కడుపుకోతతో కృశించిన దేహం, అదురు తోండగా ప్రతీకారంతో ప్రజ్వరిల్లే క్రోధారుణ నేత్రాలతో కొరకొర చూస్తున్న ఆ ఆకారమెవరిది? ఆవిడ రాజ్యలక్ష్మమ్మ కదూ —!

భయ విహ్వలురాలయింది కామేశ్వరమ్మ పడకూడని కంట పడినట్టు గజగజలాడింది.

అమెబ్బే మోకరిల్లిపోయి, పొడవ వచ్చిన వారినే శరణు వేడినట్టు "వద్దు వద్దు రాజ్యలక్ష్మమ్మా నీ బిడ్డ చావుకి కారణం నేను. నన్నేమన్నా చెయ్యి. ఏ పాపమెరుగని నా బిడ్డని మాత్రం నీ శాపానికి ఎరవెయ్యకు నీకు నమస్కారం చేస్తాను తల్లీ నా మాట మన్నించు. నన్ను కరుణించు" అని రోదిస్తూ నేలమీద పొర్లిగింతలు పెట్టసాగింది.

ఆమెకు తెలివి తప్పుతోంది మళ్లీ వస్తోంది. తిరిగి కన్నీళ్ల కారుస్తూ చేతులెత్తి వేడుకుంటోంది. ఆ వెంటనే స్పృహ కోల్పోతోంది

* * *

వసంత ఉన్న గదిలో నిండుగా మనుషులు ఉన్నా నిశ్శబ్దానికెవరూ భంగం కలిగించటంలేదు

గడియారం టిక్కుటిక్కు మంటూ కాలాన్ని కరిగిస్తూంది

డాక్టర్ తన ప్రయత్నం సాగిస్తున్నాడు.

ఆయన మోహంలో వెలిగే ఆశాభావం కొరకు, కళలు తప్పిన వసంతలో చేతనం కొరకు ఆతృతగా ఎదురు చూడడంలో అది నిద్రా సమయమనిగానీ

## కాలం కరిచాక

అర్ధాంతరంగా నిద్రలేచి ఇప్పటికి కొన్ని గంటలయిందనిగానీ, తెల్లవారవస్తోందనిగానీ ఎవరికీ తెలీటం లేదు

హటాత్తుగా తలుపు చప్పుడయింది. మొహం మీద వుంచుకున్న చేతులు తీసి కేశవరావుగారు లేచి వెళ్లారు.

తెరిచిన తలుపులలోంచి తుఫానులా దూసుకు వచ్చాడు గోపీకృష్ణ.

"వచ్చేశా నంకుల్— ఆ బంధిఖానా నించి విడుదలయి వచ్చేశాను. అంతే కాదంకుల్—నా రెక్కల కష్టంతో నా వాళ్లని పోషించుకోగలనని ధీమాగా చెప్పేసి వచ్చేశాను. నేనిప్పుడు స్వతంత్రుణ్ణి. కానీ నిరాధారుణ్ణి బాధ్యతలే తప్ప ఆస్తీ పాస్తీ పూజ్యమైన వాణ్ణి ఇప్పుడు చెప్పండంకుల్— నా స్వశక్తిమీద నమ్మకముంచి మీ కుమార్తెని ఇవ్వగలరా— చెప్పండి అంకుల్" గోపీకృష్ణ ఊగిపోతున్నాడు.

ఎద నీరవుతోండగా, "గోపీ!" కేశవరావుగారతన్ని దగ్గరగా తీసుకున్నారు.

ఆయన గొంతు గద్గదమయింది. "ఆ అదృష్టం నా బిడ్డ అందుకోగలదో లేదో నాయనా"

గోపీకృష్ణ తెల్లబోయి చూశాడు.

కేశవరావుగారతన్ని రెక్క పుచ్చుకుని నెమ్మదిగా వసంత వున్న గదిలోకి తీసుకువెళ్లారు.

రెపరెపలాడుతోంది వసంత జీవనజ్యోతి

నిశ్చేష్టుడయాడు గోపీకృష్ణ

'తనకోసం ప్రాణాలు త్యజించ బూనుకున్నదా ఈ ప్రేమిక!'

అతనికి చుట్టూ అంతమంది ఉన్నారన్న స్పృహ పోయింది. నెమ్మదిగా నడుస్తూ వచ్చి వసంత మంచంమీద కూర్చున్నాడు ఆ పిల్ల చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు

"వసంతా— వసంతా" అన్నాడు ఆర్ద్రంగా, ఆరాటంగా

పొన్న చెట్టుమీద కోకిలొకటి జతపక్షి కోసం 'కో' — 'కో' మని ఆక్రోశిస్తూ పిలుస్తోంది

కొద్ది దుర్భర క్షణాలు గడిచాయి.

సుదూరాన్నించి లీలగా 'కో—కో' అనే మారు పిలుపు వినిపించింది.

గోపీకృష్ణ స్పర్శలోని వేడిమి వసంత శరీరంలోని చైతన్యాన్ని జాగృతం చేస్తోంది

మూసిన రెప్పలు విప్పింది వసంత.

ఉషోదయం అవుతోంది.

తెరిచి ఉన్న కిటికీలోంచి బాలభానుడి నులివెచ్చటి కిరణాలు దూసుకువచ్చాయి

అందరి హృదయాల్లోనూ వెలుగులు పరుచుకున్నాయి.

(అయిపోయింది)



# అందానికి మెరుగులు దిద్దే బ్యూటీ క్లినిక్!

గుంటూరులోని ఈవ్స్ బ్యూటీ క్లినిక్‌లో అతివలని అలంకరిస్తున్న శ్రీమతి జ్యోతిభాస్కర్, శ్రీమతి లక్ష్మీకృష్ణ

పెళ్ళికూతురుగా ముస్తాబయి పెళ్ళిపీటలమీదకు రావడం ప్రతి యువతి మదిలో గూడా మధుర క్షణమే కాని ఆ క్షణంలో ఆమె అభిరుచులను పట్టించుకోకుండా పదిమందీ చేరి అలంకరించడం వివాహాలలో పరిపాటి అయితే ఇప్పుడా సమస్య ఉత్పన్నం కానవసరంలేదు ముహూర్తానికి ముందు ఒక "బ్యూటీ క్లినిక్"కు వెడితే ఆమె అభిరుచుల మేరకు, రూపురేఖలకు అనుగుణంగా, ఆధునిక నాగరికతా ప్రపంచానికి దగ్గరగా అలంకరిస్తారని గుంటూరులో "ఈవ్స్ బ్యూటీ క్లినిక్" ప్రారంభించిన శ్రీమతి జ్యోతీభాస్కర్, శ్రీమతి లక్ష్మీకృష్ణ అన్నారు

బొంబాయి, మద్రాసు వంటి మహానగరాలలో అయిదు నక్షత్రాల హోటళ్ళలోని యాత్రికులకు, గొప్ప ధనవంతులకు మాత్రమే పరిమితమవుతున్న బ్యూటీ క్లినిక్‌లు హైదరాబాద్, విజయవాడ వంటి పట్టణాలకు వ్యాపించి ఇప్పుడిప్పుడే గుంటూరుకు వస్తున్నాయి అయితే తాము మధ్యతరగతి మహిళలకు అందుబాటులో వుండే విధంగా నిర్వహిస్తున్నట్లు శ్రీమతి లక్ష్మి చెప్పారు

బొంబాయిలో 600,- మద్రాసులో 250, హైదరాబాదులో 30 వరకూ ఉన్నాయి విజయవాడలో మూడు ఉండగా, గుంటూరులో ఇది రెండొవది బ్యూటీ పార్లర్‌లలో కేవలం అందంగా అలంకరించడమే చేస్తారు కానీ క్లినిక్‌లలో అందంగా అలంకరించడంతోపాటు శరీర లావణ్యాన్ని ఆరోగ్యంగా తీర్చిదిద్దుకోవడానికి కూడా శిక్షణ ఇస్తారు

ఇప్పుడిప్పుడే గుంటూరులో నారీలోకాన్ని ఆకర్షిస్తున్న "ఈవ్స్ బ్యూటీ క్లినిక్" నిర్వాహకులు శ్రీమతి జ్యోతి, శ్రీమతి లక్ష్మి — ఇద్దరూ పట్టభద్రులే శ్రీమతి జ్యోతి మద్రాసులోని అకాడమీ ఆఫ్ బ్యూటీ అండ్ హెయిర్ డ్రెసింగ్‌లో శిక్షణ గూడా పొందారు

బ్యూటీ క్లినిక్‌లు ఉన్న అందానికి మెరుగులను దిద్ది లావణ్యంగా రూపొందిస్తాయి తప్ప నల్ల చర్మాన్ని తెల్ల చర్మంగా చేయలేవు నేడాపేరుతో చాలామంది హైడ్రోజన్ పెరాక్సైడ్ కలిపిన కెమికల్ బ్లీచ్‌లు ఉపయోగించుతున్నారని, అందువల్ల చర్మం తెల్లపడకపోగా కళావిహీనంగా తయారయ్యే ప్రమాదం ఉందని శ్రీమతి జ్యోతి హెచ్చరించారు ప్రకృతి సిద్ధమయిన మూలికలతో ముఖానికి మర్దన చేయడంవల్ల సహజసిద్ధమైన లావణ్యం రూపు దిద్దుకొంటుందని ఆమె చెప్పారు

అందంగా సింగారించుకోవడంతో పాటు ఆరోగ్యాన్ని,లావణ్యాన్నిపెంపొందించుకొని క్రమబద్ధం చేయడానికి అవసరమయిన సలహాలు, సూచనలు గూడా బ్యూటీ క్లినిక్‌లు ఇస్తాయి సంవత్సరానికి 120 రూపాయలకు మించని "బ్యూటీ బడ్జెట్"ను, ఆహార నియమాలను, వివరించే "డైట్ షీట్"ను గూడా అవి తయారు చేస్తాయి

మితిమీరి లావుగా ఉన్నవారు పది కిలోల బరువు తగ్గితే ఆయుః పరిమాణం 10 సంవత్సరాలు పెరుగుతుందని వైద్యశాస్త్ర నమ్మకం అందుకనే శరీర బరువును తగ్గించి, నడుము సన్నబడుటకు స్టీమ్‌బాత్, వ్యాయామం, స్వీడిష్ మసాజస్‌ల ద్వారా బ్యూటీ క్లినిక్‌లు చికిత్స చేస్తాయని శ్రీమతి లక్ష్మి వివరించారు

వివిధ సాంప్రదాయ పద్ధతులలో పెళ్ళి కూతురును అలంకరించడం, పెళ్ళి చూపులలో, ఇంటర్వ్యూలలో పాల్గొనే అమ్మాయిలను సింగారించడం, ఉత్సవాలకు హాజరయ్యేటప్పుడు అలంకరించడం గూడా వీరు చేస్తారు

ముఖంలోని కండరాల పటుత్వం పెంచి, రక్త ప్రసరణం అధికం చేయడం ద్వారా ముఖసౌందర్యాన్ని పెంపొదించవచ్చు అందుకై ఫ్రెంచ్, అమెరికన్, స్వీడిష్, వియన్నీస్ పద్ధతులలో ముఖాన్ని మర్ధన చేస్తారు కనుబొమ్మలను అందంగా తీర్చిదిద్దుతారు తద్వారా 50 సంవత్సరాల మహిళ గూడా 35 సంవత్సరాల యువతిగా దర్శన మిస్తుందట

ఆధునిక నాగరికతకు, ఫ్యాషన్ల ప్రపంచానికి అనువుగా 116 భంగిమలలో, నవీన పద్ధతులలో కేశాలంకరణను చేస్తారు కేశ సంపద పెరుగుటకు, తరుగుటను నివారించుటకు ప్రత్యేక చికిత్సలను చేస్తారు

కాళ్ళ పగుళ్ళు, చుండ్రు, వాతపు నెప్పులు, ముఖంమీద — శరీరంమీద వెంట్రుకలను తొలగించుటకు శాస్త్రీయ పద్ధతులలో చికిత్స చేస్తారు మసాజ్ థెరఫీలను ఇస్తారు ముఖంమీద మొటిమలను తొలగించడానికి హై ఫ్రీక్వెన్సి సాధనం ద్వారా చికిత్స చేస్తారు

అలసట, హృద్రోగ ప్రమాదం నివారణకు శరీరంలో కొవ్వు తగ్గించి ఎత్తుకు తగ్గ బరువును, అంతకు తగిన శరీరాన్ని రూపొందించడానికి "స్టీమ్ బాత్" గూడా చేయిస్తారు

కేవలం ఖరీదయిన వస్త్రాలతో, విలువైన నగలతో మాత్రమే కాకుండా సామాన్యులు గూడా అందంగా, ఆకర్షణీయంగా నఖశిఖ పర్యంతం అలంకరించుకోవడానికి తగిన శిక్షణను గూడా ఇస్తామని శ్రీమతి జ్యోతి చెప్పారు

— చలసాని నరేంద్ర



**బుద్ధరాజు సన్యాసిరాజు**

అనంతకోటి జీవరాశిని సుషుప్తినుంచి చేతనావస్థకి తెచ్చే బాలభానుని పసిడి కిరణాలు ధరాతలాన్ని తాకి పరుగులు పెడుతున్నాయి

విద్యుత్తరంగాలు సోకి కదలిన యంత్రాల్లా, సౌర తాకిడికి జాగృతికొస్తోంది, జీవకోటి

క్రమంగా ఆకాశంలో మబ్బుక్రమ్మి, దట్టమైంది

పసిమి సూర్యుడు పరువానికి రాకముందే మాయమైనాడు, కుట్రవల్ల

మిధ్య, ఐహికాలమధ్య మానవుడు పొందే అనుభూతిలా – రాత్రి, పగలు కాని సంకీర్ణాన్ని ప్రకృతి అనుభవిస్తోంది

క్షణకాలం తుంపరపడి, ఆగింది

మబ్బు విడలేదు

పరిణామక్రమాన్ని జీర్ణించుకొన్న ప్రాణికోటి, ఈ కుటిలాన్ని పట్టించుకోలేదు

అంగుళం పొట్టకై అనంతాన్ని సర్వే చేసే పక్షులు రెక్కలు విదిల్చి, తమ కార్యక్రమానికి నాందీ పలికాయి

ప్రకృతి ధర్మాన్ని పాటిస్తూ 'ఆ' పల్లెకూడా మేల్కొంది

పల్లెకు అల్లంత దూరాన ఉన్న 'మాలపల్లె' (క్షమించాలి, పల్లెల్లో 'హరిజనవాడ'లను ఇప్పటికీ ఇలాగే పిలుస్తారు) కూడా మేల్కొంది

నాయకుల అవసరార్థం దానికి స్వతంత్ర పాలనా ప్రతిపత్తి ఇవ్వకపోవటంచేత అది ఆ పల్లె అంతర్భాగమే

ధర్మ విరుద్ధమైనా, అందులో నివసించే వాళ్లంతా 'అస్పృశ్యులు' (వాళ్లదృష్టిలో) కాబట్టి, వాళ్లని ఆ మాత్రం దూరం వుంచుతారు

దాన్లో నివసించేవాళ్ళు చాలామంది వెట్టిచాకిరీ చేత తాళి కట్టించుకున్నవాళ్లు

ఆ మాలపల్లె పెద్దపైడియ్య, ముసలివాడు – 'పైడియ తాత' అంటారు అక్కడివాళ్లు

* * *

వీధిలో గోళీలాడుకుంటున్న పిల్లలు దూరంగా ఏదో శబ్దాన్ని గ్రహించి, 'కారొత్తంది, కారొత్తంది' అని అరుస్తూ, దాన్ని చూసే ఆత్రతలో పరుగెత్తారు

సరిగ్గా ఈ ఘడియల కోసమే వీధి చావడిలో కాపేసిన ప్రెసిడెంటు గాబరాగా లేచి, కండువా కోసం కేకేసి, భజన జనం వెంటరాగా, చప్పున వీధిలోపడి, కారు కెదురెళ్లాడు

అనివార్య కారణాల వల్ల అనధికారులయిన మంత్రిగారు మరో నలుగురితో వచ్చి, రావిచెట్టు దగ్గరే కారు ఆపమని డ్రైవర్‌తో చెప్పి, రాజ లాంఛనాలతో కారులోంచి దిగకుండా, ఆగిందే తడవుగా 'డోరు' తోసుకొని బాహ్య ప్రపంచంలోకి ఛంగున గెంతి, మాలపల్లె వేపు పరుగు లాంటి నడకతో నిష్క్రమించారు—

ఊహించని పరిణామానికి బురద గుంటలో ఆడుకుంటున్న పందికూన 'కుంయ్'మని, బురద జల్లుకుంటూ ప్రాణ భీతితో పరుగెత్తింది—

రావిచెట్టు నీడన కుచ్చిటప్పాలాడుతున్న యువత అయోమయంగా చెట్టుకోపిట్టగా జారుకున్నారు

'పనిగట్టుకుని తనవద్దకే వస్తున్నాడనుకున్న మంత్రిగారు తనని కనీసం కన్నెత్తి చూడకుండా, అటు పరుగు లంకించుకోవడమేమి చెప్మా!' అని ప్రెసడెంటు ఆశ్చర్యపోయి, తేరుకుని 'చంచలముల్ శ్రీవార్ల చిత్తముల్' అని సర్దిచెప్పుకున్నాడు

శ్రీవారితోపాటు కారులో వచ్చినవాళ్లకిది దినచర్య గాబట్టి వాళ్ల మొహాల్లో ఏ 'ఎక్స్‌ప్రెషనూ' ఎక్స్‌పోజు కాలేదు

* * *

వగరుస్తూ మాలపల్లె చేరిన మంత్రిగారికి 'వెదకంబోయిన తీవ కాలికే తగి'ల్నట్టు, పైడియ తాత కుంకుడుచెట్టు వేళ్లమీద కూర్చుని 'పలక్ర' (పళ్లు తోముకోవటం) చేస్తూ కనిపించాడు

ఖద్దరు బట్టల శాల్తీని అల్లంత దూరంలో చూస్తూనే 'మళ్లీ ఎలచ్చన్లొత్తన్నాయి గావాల' అని మనసులోనే అనుకొని, లేచి నిలబడ్డారు – తాత చుట్టూ వున్న జనం

శ్రీవారు వస్తూనే, వెనుదిరిగున్న తాత భుజం తట్టి —

"ఏం పైడియ మాఁవా, కులాసాగున్నావా ?"  అని పలకరించారు

'ఏదో నిన్ను నిలబెట్టిన దౌర్భాగ్యానికి' అని స్వగతంగా అనుకుని —

" యిలాగున్నాం" అన్నాడు తాత

"లచ్చప్ప ఏది మాఁవా ? దాన్ని సూసి సాలాకాలఁవైపోయింది "

"అది సచ్చి ఏడాది దాటింది మీ ధర్మమా అని, ఈ వూళ్లో ఆస్పత్రి కూడా లేదుగాదా మరీ "

"ఓసీ ఎంత పనయిపోయిందీ దాన్ని నీ ప్రేణంలాగ సూసుకున్నావు విన్నొక్కన్నిసేసి ఎల్లిపోయింది బగమంతుడికి నీలాటోల్లమీదే గురి " అని,

" ఏరోయ్, అప్పిగా, పిల్లలు బాగున్నారా?" అని పరామర్శించాడు ప్రక్కనే ఉన్న అప్పన్నని

'నాకు పెళ్లిగానేపోయిందేటి సెప్మా !' అని కాసేపు తికమకపడ్డాడు, సదరు అప్పన్న

ప్రక్కనుంచే వెళ్తున్న వీరమ్మను చూసి –

"ఏఁవే యారీ ! ఓసోస్ అప్పుడే మేం కానోల్లమైపోయామే సూసీ సూడనట్టు ఎల్లిపోతన్నావు " అని బాధ నటించారు శ్రీవారు

కుంకుడుచెట్టు వేరుకి కట్టిన కోడెదూడ ఆకలికి 'అంబే' అని అరిచింది

తన పరామర్శలకి దూడ 'గేలి' చేస్తోందేమోనని సిగ్గుపడబోయి, 'దానికేటి తెలుస్తదిలే' అనుకుని, తమాయించుకున్నారు

వెనకాలే వున్న చిన్నయ్యను చూసి –

"ఒరే సిన్నా ! కొంచెం కాఫీ పట్రారా' అనబోయి నాలిక్కొరుచుకొని –

"సిన్నా కాసిన్ని మజ్జిగనీల్లుంటే పట్రారా మహా దాహఁవేస్తంది యదవబతుకు కాలీసు లేదు తెల్లారిందగ్గర్నించీ " అని, పైడియ తాత ప్రక్కనే వేరుమీద కూలబడ్డారు

విధిలేక లేచాడు పైడియతాత 'తుపు'క్కున ఉమ్మి

మజ్జిగెప్పుడూ చూడని చిన్నయ్య 'అదేం'టని అడగడానికి జంగాడు

ఇలా పరామర్శలూ, చమత్కారాలూ ముగించుకొని పన్లోకొచ్చారు శ్రీవారు

లేచి, పైడియ్యను పక్కకి తీసుకెళ్లి—

"మాఁవా నీతో కొంచెం సీక్రేటుగా మాటాడాల, పన్జూసుకోనొకసారి, పెసిడెంటు గోరింటికి రాగలవెటి ?"

రాజకీయాల్లో పండకపోయినా, పండిపోయిన పైడియ తాతకు రాజకీయాల స్వరూపం, నాయకుల భాషా ప్రావీణ్యం తెల్సు– పంచాయితీ ఎలక్షన్లతో కలిపి ఓ పది పదిహేను చూసాడు గాబట్టి

"వొత్తాలే" అన్నాడు ముక్తసరిగా

* * *

ప్రెసిడెంటు గారింటి కెళ్లాడు తాత పన్జూసుకుని

ప్రెసిడెంటుగారు, మంత్రిగారు తననోగదిలోకి తీసుకెళ్లారు

కుర్చీలో కూర్చోమన్నారుగాని, తాత నేలమీదే కూర్చున్నాడు

మంత్రిగారొచ్చిన విషయం వివరించబోయాడు ప్రెసిడెంటు

"నాకు తెలు"సన్నాడు తాత

'ఎలా తెలు'సని ఎవరూ ప్రశ్నించలేదు

" మరి నీకంతా తెలుసుగదా మన మాల పల్లంతా నీ మాటమీద నిలబడతారు నువ్వు సెప్తే ఒక్క వోటు కూడా బయటికి పోదు " అన్నాడు ప్రెసిడెంటు

"గాని, నేను సెప్పను" మొండిగా తాత

"నువ్వొత్తివున్నేనికే సెప్పక్కర్లెద్దులేరా శ్రీవారు మహానుబావులు నీ కష్టం వుంచుకోరు నువ్వు 'ఊఁ' అంటే ఇప్పుడే సెల్లిత్తారు "

ఒళ్లు మండింది తాతకు

'నేను ఊఁ అనను' అనలేదు కాని,

"ఎయ్యమని సెప్పడానికి కట్టమెందుకూ – ఎయ్యొద్దని సెప్పడానికి కట్టపడాలగాని " అన్నాడు

సూక్ష్మబుద్ధి అయిన శ్రీవారు పరిస్థితి గ్రహించారు పైడియ్యను 'లైను'లోకి తేవడానికి

ప్రయత్నిస్తూ హరిజనోద్ధరణ గురించి ఏకరువు పెట్టాడు. 'మన కులం బాగుపడాలంటే మనమే ఉండా'లన్నాడు... లాభం లేకపోయింది

చివరి ప్రయత్నంగా —

"నీ గడ్డమేదీ ?" అన్నారు.

"నిన్ననే గీయించేసినాను. సేతికి దొరకదు"

"సేతులేవీ ?"

"సల్ది గెంజి తాగి సరీగా కడుక్కోకుండా వొచ్చేసినాను."

"కాళ్లో ?"

"సెప్పుల్లేక దుమ్ము కప్పేసినాది"

వాళ్ళు బయటికి పొమ్మనక పోయినా, గుడిసె కెళ్ళడానికి బయటికే రావాలి గాబట్టి వచ్చేసాడు పైడియతాత.

తాతను తన వాక్చాతుర్యంతో లోబరుచుకో

భవిష్యత్తును కొంతవరకు ఊహించగలరు జ్ఞానులు...

'ఈ రోజేదో అనర్థం జరిగేలా వుంది నా కళ్లతో చూడటమెందుకూ' అని శెలవు పెట్టాడు చంద్రుడు

'ఈ రోజు నాకేదైనా అనర్థం జరుగుతాది' అని కీడు శంకించి, రోజూ బయట చెట్టుక్రింద పడుకుంటున్న పైడియ తాత ఆ రోజు గుడిశెలో దూరి, తలుపుకు గడియ పెట్టుకున్నాడు

నిద్ర రాకుండా ప్రయత్నించాడుగాని, ఉదయం నుంచీ అలసిపోయిన బుర్ర విశ్రాంతి కోసం పైడియ తాతను లొంగదీసుకుని నిద్రాదేవిని ఆహ్వానించింది

దాదాపు పల్లె అంతా గాఢనిద్రలో వుంది ఆ రాత్రి రెండు గంటలవేళ — ఒక్క ప్రెసిడెంటు యిల్లు తప్ప.

కళా విహీనమైన విధవ మొహంలా కప్పులు వేడికి నల్లబడ్డ గోడలతో మాలపల్లె బోసిపోయింది

దారీ తెన్నూ తోచని ప్రజల భవిష్యత్తును తల్చుకుని గోల పెడుతున్నారు

ప్రెసిడెంటుగారొచ్చారు

ప్రగాఢ సంతాపం వెలిబుచ్చి-

"బాధ పడకండి, జరిగిందేదో జరిగిపోయింది నేనున్నా' నన్నాడు..

సొంత ఖర్చులతో ( ) భోజనా లేర్పాటు చేసాడు

ప్రభుత్వం వాళ్లు ఇంటికి రెండేసి వందల చొప్పున ఇచ్చేటట్టు ఏర్పాటు చేస్తానన్నాడు.

ఆ సమయంలో దేముడిలా కనిపించాడు వాళ్లకి

* * *

ఓటువేసే రోజొచ్చింది...



లేకపోయినందుకు బాధపడుతూ కూర్చున్నారు మంత్రిగారు.

పథకమాలోచిస్తున్న ప్రెసిడెంటు; నిశ్చయంగా, నిశ్చలంగా అన్నాడు —

"దీని గురించి మీరేం యిదయిపోకండి...అన్ని వోట్లూ మీకేయేయించే పూసీనాది...ఒక్కటి తప్ప."

"మీదా ?" అన్నాడు తెల్లబోయి, మంత్రిగారు.

"కాదు — ఆ ముసిలాడిది" సందేహనివృత్తి చేసాడు ప్రెసిడెంటు. అంతకంటె వివరాలు మంత్రి గారడగలేదు, ప్రెసిడెంటు చెప్పనూలేదు.

కారెక్కి తుర్రుమన్నాడు మంత్రిగారు. శ్రీవారిని సాగనంపి ఇంట్లోకొచ్చిన ప్రెసిడెంటు, కుర్చీలో లావుపాటి పర్సుచూసి, 'అరె మర్చిపోయినట్టున్నా'డని అనుకోలేదు.

* * *

అదే వేళ...

జ్ఞానులు ఊహించిన అనర్థం, మాలపల్లెలో మంటల రూపంలో బయటికొచ్చింది.

వాడ ప్రజలు మేలుకొని పరిస్థితి గ్రహించే సరికే చాలా యిళ్లు దగ్ధమైనాయి.

వాయువు సహాయంతో వీరవిహారం చేసిన మంటలు ప్రజల ప్రయత్నాలపై విజయం సాధించాయి.

పైడియ తాత కోసం వెదికారు కొంతమంది.

తాత కనిపించలేదు.

తాత ఉండే పాక కూడా లేదు!

* * *

తెల్లవారింది...

భస్మపోయిన శోకంతో మ్లానమై బొట్టులేక

ఏ గుర్తుమీద 'ముద్ర' ఎలా వెయ్యాలో వివరించాడు ప్రెసిడెంటు— మాలపల్లె ప్రజలకి.

పోలింగు ముగిసింది...

ఫలితాలొచ్చాయి...

చర్విత చర్వణమైన చరిత్ర తత్వానికి చిర్నవ్వు నవ్వుకున్నాడు ప్రెసిడెంటు.

ఈ 'చర్విత చర్వణం' కథా రచనకు కొన్ని సలహాలనిచ్చిన మిత్రుడు, ప్రముఖ నవలా రచయిత — శ్రీ జి. సత్యమూర్తికి నా 'అభిమాన పుష్పం'గా అందజేస్తున్నాను.

— రచయిత



# సినిమా

## యమకింకరుడులో భయంకరుడు

కిశోర్, విజయ్ — అసిస్టెంట్ కమీషనర్ ఆఫీసు కారిడార్‌లో నడుస్తున్నారు. విజయ్ భుజం తట్టి కిశోర్, "కంగ్రాట్యులేషన్స్‌రా... ఏరా, రాస్కెల్! నాకన్నా ముందుగా ప్రమోషన్ కొట్టేద్దామని గొప్పగా వెళ్ళి ఆ బాంకు దోపిడీ కేసు నువ్వు పట్టేస్తావా? నీ లక్కు బాగుంది. నిన్ను ఇంటలిజెన్స్‌లో పడేశారు. అసలీ తప్పు నీది కాదురా! నీ ఇంటలిజెన్స్‌ను గుర్తించిన ఆయన ఇంటలిజెన్స్‌ను డౌట్ చెయ్యాలిరా!" అంటూండగా ఎ. సి. తన గదిలోంచి బయటకు వచ్చాడు. అది గమనించి విజయ్ కంగారుగా "ఎ. సి... ఎ. సి..." అంటూ తడబడ్డాడు. అది బోధపడని కిశోర్ "ఏం? ఏమిటి పెద్ద ఎ. సి? ఆ... ఆయనేం చేస్తాడురా? ఎ. సి. రూమ్‌లో కూర్చుంటాడు. ఏమీ తోచకపోతే, 'మిస్టర్ కిశోర్! వాట్ హేపెన్డ్ టు ద బాంక్ రాబరీస్' అని అడుగుతాడు. అంతేకదా ఆయన చేసే పని?" అంటూ వాగసాగాడు.

ఎ. సి. కోపంతో "మిస్టర్! వాటీజ్ దిస్ నాన్సెన్స్!" అన్నాడు.

కిశోర్ గాభరాతో "నో, సర్... యస్, సార్! ఐ టోల్డ్ హిమ్, సార్... డ్యూటీ చేసేచోట డిసిప్లిన్ ఉండాలని చెప్పాను, సార్. ఎస్, సార్! ఐ టోల్డ్ హిమ్, సార్!" అన్నాడు.

ఎ. సి. తీక్షణంగా చూస్తూ, విజయ్‌ను తన గదిలోకి రమ్మని, "కమాన్, సిడ్డౌన్!" అన్నాడు.

విజయ్ కూర్చుంటూ, "సార్! ఆ బాంకు రాబరీకి సంబంధించిన వివరాలు — ఎఫ్. ఐ. ఆర్‌తో మీకు సాయంత్రంకల్లా అందజేస్తాను," అన్నాడు.

"అది సరే... ఆ నేరాలు ఆ టైమ్‌లో అలాగే జరుగుతాయని నువ్వెలా ఊహించగలిగావ్?"

"నాకు మొదటినుంచీ వాళ్ళమీద అనుమానమే. వాళ్ళు పెద్ద హోటళ్ళలో దిగుతూ, డబ్బును

'కుంకుమ తిలకం'లో జయసుధ, మురళీమోహన్

విచ్చలవిడిగా ఖర్చు చేస్తున్నారు. ఆమధ్య అనకాపల్లి బాంక్ రాబరీలో పోయిన కరెన్సీ నెంబర్లు కొన్ని వీళ్ళు నైట్ క్లబ్బుల్లో పే చేసిన నెంబర్లతో టాలీ అయ్యాయి. ఆ క్లూతోనే వీళ్ళను వాచ్ చేసి పట్టుకున్నాను."

"వెల్.. దట్స్ వై ఐ పుట్ యు ఇన్ క్రయిమ్ బ్రాంచ్. ఐ అప్రీషియేట్ యువర్ ష్రూడ్‌నెస్, మై బాయ్! నౌ యు కెన్ గో!" అన్నాడు ఎ. సి.



'యమకింకరుడు'లో రాధిక, చిరంజీవి

"థాంక్యూ, సర్!" అంటూ విజయ్ బయట పడ్డాడు.

చిరంజీవి, శరత్ బాబు, సత్యనారాయణ పాల్గొన్న పై సన్నివేశం రాజ్‌భరత్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అల్లు అరవింద్ నిర్మించిన గీతా క్రియేటివ్ ఆర్ట్స్ "యమకింకరుడు" చిత్రంలోనిది.

## రెండు జెళ్ళ సీత

"అక్టోబర్ 1 నుండి విశాఖపట్నంలో షూటింగ్," అన్నారు జంధ్యాల. ఈయన దర్శకత్వంలో కె. కేశవరావు నిర్మించే శ్రీ భ్రమరాంబిక ఫిలిమ్స్ "రెండు జెళ్ళ సీత" చిత్రానికి సెప్టెంబర్ 13న తొలి గీతం ధ్వనిముద్రితమైంది. రమేష్‌నాయుడు స్వరకల్పనలో వేటూరి గీతాలు రాస్తున్నారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, తరణి శిల్పం, యు. ఎస్. ఎ. పాణి సహదర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో నిర్మాణ నేతృత్వం వహించే జయకృష్ణ "ఈ చిత్రంలో నరేష్, ప్రదీప్, రాజేష్, సుధాకర్‌లు హీరోలు. నాయికగా కొత్త తారను పరిచయం చేస్తున్నాం," అన్నారు.

## నటన చిత్రం హిందీలో

త్వరలో విడుదలయ్యే నమస్తే మూవీస్ "నటన" చిత్రం ఫస్ట్ కాపీని చూసి అంజాద్ అలీఖాన్ అనే హిందీ చిత్ర నిర్మాత నూతన తారాగణంతో "నాటక్"గా హిందీలో డిసెంబర్ 27 నుంచి షూటింగ్ ప్రారంభిస్తున్నారు. మరో నిర్మాత బషీర్ అహమ్మద్‌ఖాన్. తెలుగు చిత్రానికి పని చేసిన సాంకేతిక నిపుణులే ఈ హిందీ చిత్ర నిర్మాణంలోనూ పాల్గొంటారు.



'పెళ్ళిచూపులు'లో చంద్రమోహన్, విజయశాంతి

# రిశేషాలు

**-జి. వి. జి.**

## వినూత్నమైన ప్రయోగం "రంగుల కల"

''కళ కళ కోసమో, ఆత్మ సంతృప్తి కోసమో కాదు. కళ ప్రజా ప్రయోజనం కోసం ఆర్టిస్టులు అర్థంలేని కళాఖండాల్ని చిత్రించడంకన్నా – ప్రజలను ఉత్తేజితుల్ని చేసే చిత్రాలను రచించడం అవసరం'' అన్నారు సుచిత్ర ఇంటర్నేషనల్ వారి ''రంగుల కల'' చిత్రానికి దర్శకత్వం వహించే బి. నరసింగరావు ఈయన చిత్రకారుడే కాదు; చక్కని ఛాయా గ్రాహకుడు; మంచి రచయిత కూడా. అందుకే కాగితాలమీది తన కథను మరింత అందంగా దేవిప్రియ, ఎస్. ఎం. ప్రాణ్ రావు, ఉప్పల నరసింహంతో కలిపి స్క్రీన్‌ప్లే సమకూర్చి, వేణుగోపాల్ కె. ధక్కర్ ఛాయతో సెల్యులాయిడ్‌పై మలచగలిగారు. ఈయనతోపాటు నారాయణరావు, సాయిచంద్, కాకరాల, వి. బి. శంకరరావు, వెంకట రెడ్డి, షరీఫుద్దీన్, శేషంరాజా, మల్లిక్, యాదగిరి, కృష్ణ, మోహన్‌రావు, పి. డి. నాయుడు, సంగీతా బెహల్, శకుంతల, మద్దూరి విజయలక్ష్మి, హరిత, బృంద, హిమబిందు, హేమలతారాయ్, ప్రముఖ చిత్రకారులు చంద్ర, అమర్ మోహన్‌లు పాల్గొన్నారు. దేవిప్రియ రాసిన ఎనిమిది నిమిషాల పాట ఈ చిత్రంలో మరో ఆకర్షణ. ఆయనతోపాటు జానపద కవులు జాను తెనుగులో రచించిన పాటలను గద్దర్ మధురంగా గానం చేశారు. ''ఒక కళాకారుడి జీవితం ద్వారా నగర జీవన సజీవ దృశ్యాల్ని, కళాకారుడి లోలోపల జరిగే అంతర్మథనాన్ని, సంఘర్షణనూ, కళా ప్రయోజనాన్ని గుర్తించి ఉన్న భిన్నమైన అభిప్రాయాలనూ ప్రపంచానికి ఎందుకు చెప్పకూడదనిపించింది. చిత్రకారుడి దృక్పథం నుంచైతే ఇది మరింత శక్తివంతంగా చెప్పగలమనిపించింది,'' అన్నారు ఈ చిత్ర నిర్మాత కె. వెంకటేశ్వర రావు. మంచి సినిమాయే తమ ఆశయంగా, ప్రేక్షక జన ప్రయోజనమే మంచి సినిమాకు మహదాశయంగా పవిత్ర లక్ష్యంతో ఈ చిత్ర నిర్మాణంలో పాల్గొన్న వారందరికీ ప్రేక్షకుల అభినందనలు తథ్యం.

## మురళీమోహన్ సమర్పించే పిచ్చి పంతులు

''ఏలూరు దగ్గరున్న పెదపాడు గ్రామంలో సెప్టెంబర్ 22న షూటింగ్ మొదలైంది. అక్టోబర్ 16కు ఒకే షెడ్యూల్లో పూర్తిగా ఔట్‌డోర్‌లో ముగుస్తుంది,'' అన్నారు కిశోర్ ఈయన నేతృత్వంలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించే జయభేరీ ఆర్ట్స్ ''పిచ్చి పంతులు'' చిత్రంలో మురళీమోహన్ ప్రధాన పాత్రధారి మాధవి నాయిక సత్యనారాయణ, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, రావి కొండలరావు, హేమసుందర్, చిట్టిబాబు, కవిత, కృష్ణవేణి, రాజ్యలక్ష్మి తక్కిన పాత్రధారులు. బాలమురుగన్ కథకు పూసల సంభాషణలకర్త. ఆత్రేయ గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. పి. రవీంద్రబాబు సహ దర్శకత్వం, బి. ఎ. బేగ్ ఛాయ, రంగారావు శిల్పం, రాజగోపాల్ కూర్పు, తార నృత్యాలతో రాజాచంద్ర స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## విశ్వచిత్ర కంబైన్స్

''అక్టోబర్ 7 నుంచి నవంబర్ 14 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది,'' అన్నారు జి ఆర్. కె. రాజా. ఈయన సమర్పించే చిత్రానికి కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. మోహన్‌బాబు, సుమలత, సుమన్, పూర్ణిమ, రాళ్ళపల్లి, పి. ఎల్. నారాయణ, ఓ సరికొత్త పాత్రలో గొల్లపూడి మారుతీరావు పాత్రధారులు. గొల్లపూడి సంభాషణల కర్త. చక్రవర్తి, డి. ప్రసాద్‌బాబు, కుదరవల్లి, డి. వెంకట రత్నం, కపిల నాగేశ్వరరావు, సూర్యనారాయణ తెర వెనుక కృషి చేస్తారు.

'ఓ ఆడది ఓ మగాడు'లో అలేఖ్య



## సినిమా

### యువతరం మారాలిలో మారని పెద్దలు

దయానిధి ఇంటికి భగత్ వచ్చి, తనను తాను పరిచయం చేసుకున్నాడు "నా పేరు ."

"నీ పేరు, నీ క్వాలిఫికేషన్స్ అన్నీ నాకు బాగా తెలుసు .. ఇంతకీ, నువ్వొచ్చింది ఉద్యోగం కోసమే కదా ?" అన్నాడు దయానిధి గంభీరంగా

"కాదు, మీ దశావతారాలు జనానికి చూపిద్దామని మీ దుర్మార్గాల్ని, రాక్షసత్వాన్ని జనానికి తెలియపరుద్దామని మీ స్వార్థపు కోరల్లో చిక్కిన యువతరానికి విడుదల ప్రసాదిద్దామని . అందుకే మీ కథకు క్లైమాక్స్ రాద్దామని వచ్చాను."

"ఉద్యోగం దొరక్క, తింటానికి తిండి లేక — నాలుగు ముక్కలు పేపర్లో రాసి, ఆళ్ళనీ యీళ్ళనీ కాకాలు పట్టి — కాకిలా యెంగిలి మెతుకులు తిని బ్రతికే నువ్వు నా కథకు క్లయిమాక్స్ హహ్హాహ్హా!"

"కాకిని కాను శంఖారావం — విప్లవ పత్రిక విలేఖర్ని. నీతిగా, నిజాయితీగా, నిస్వార్థంగా, స్వతంత్రంగా బ్రతుకుతూ, సంఘంలోని నీలాంటి ముసుగు మనుషుల కుళ్ళును బయటపెట్టడమే ధ్యేయంగా పెట్టుకొని బ్రతుకుతున్న భగత్‌ని"

"నీతీ న్యాయం కావాలంటావ్ మా బతుకుల్ని పేపర్లో యెక్కించేత్తానంటావ్ ఆఁ అయితే, నీ కథకి ఆ భగత్‌సింగ్ క్లయిమాక్స్ రాయాల్సిందే మా నిజాలు తెలుసుకుని, మమ్మల్ని ఎదిరించిన వాడెవ్వడూ—" అన్న దయానిధి వాక్యాన్ని "బ్రతికి బట్టకట్టలేదు. ప్రాణాలతో బయటపడలేదు," అంటూ అతని అనుచరుడు బుడే పూర్తి చేశాడు.

భగత్ వికటాట్టహాసం చేశాడు "ప్రాణం... హహ్హాహ్హా! దయానిధీ! ఎందరో ప్రాణాలర్పిస్తేనే మనకు స్వరాజ్యం వచ్చింది నీ అంతం కోసం నేను అంతం అయినా ఫర్వాలేదు కాని, మిమ్మల్ని ఉరికంబం ఎక్కించందే ఈ భగత్—" అంటూ తల పంకించి, ఆవేశంతో వెళ్ళిపోయాడు

దయానిధిగా టెక్కం సూర్యనారాయణ, భగత్‌గా డాక్టర్ కె. వి. ఎం రెడ్డి. బుడేగా బుడేఖాన్ పాల్గొన్న సుగుణా ఆర్ట్స "యువతరం మారాలి" చిత్రాన్ని విజయప్రకాష్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. ఆంజనేయులు, ఎ ఆంజనేయులు నిర్మించారు జి. కె వెంకటేశ్ సంగీత దర్శకుడు నిర్మాణత కొలిచెర్ల శేషు.

"హీరోయిన్ బద్ధకంగా ఉంది షూటింగ్ కి రాలేనంటోందా? బద్ధకవుసీనే తీస్తున్నాం, సహజంగా వుంటుంది, వెంటనే రమ్మని చెప్పు!"





రంజిత్ ఆర్ట్స్ కొత్త చిత్రం షూటింగ్ ప్రారంభోత్సవ సందర్భంలో డైరెక్టర్ విజయనిర్మల, హీరో కృష్ణ, కె. యస్. ప్రకాశరావు, డి. వి. ఎస్. రాజు, ఎం. ఎస్. రెడ్డి, నిర్మాత కానూరి రంజిత్‌కుమార్‌గార్లని చిత్రంలో చూడవచ్చు.

# సినిమా

## రంజిత్ ఆర్ట్స్ 3వ చిత్రం

"కృష్ణగారిది డ్యుయెల్ రోల్. జయసుధ ఒక హీరోయిన్, మాధవి మరో హీరోయిన్ కృష్ణగారి పక్కన మాధవి నటించే తొలి చిత్రమిదే," అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పై సంస్థ నిర్మించే 3వ చిత్రం సెప్టెంబర్ 19న సెట్స్‌కు వెళ్లింది. ఇంకా రావు గోపాలరావు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, జ్యోతిలక్ష్మి వగైరా తారాగణం. పరుచూరి సోదరులు, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, తోట తరణి, ఆదుర్తి హరనాథ్ ప్రభృత సాంకేతిక బృందంతో ఈ చిత్రాన్ని నిర్మించే కానూరి రంజిత్‌కుమార్ "ఫస్ట్ షెడ్యూల్ సెప్టెంబర్ 25న ముగిసింది. సెకెండ్ షెడ్యూల్ అక్టోబర్ 6 నుంచి 10 వరకు జరుగుతుంది," అన్నారు.

## రాజలక్ష్మీ ఆర్ట్ మూవీస్

"సెంటిమెంట్ మిళితమైన ఏక్షన్ పాక్డ్ చిత్రం," అన్నారు నిర్మాత మిద్దె రామారావు. ఎస్. ఎ. చంద్రశేఖర్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో దామిశెట్టి నళినీ నిరంజనరావు సమర్పించే చిత్రం తొలి షెడ్యూల్ సెప్టెంబర్ 16 నుంచి 20 వరకు జరిగింది. చిరంజీవి, రాధిక, గొల్లపూడి మారుతీరావు, సాక్షి రంగారావు, సుత్తి వీరభద్రరావు, సుత్తివేలు, నెలవంక ప్రసాద్, కాకినాడ శ్యామల, అత్తిలి లక్ష్మి పాల్గొంటున్నారు. శోభ కథకు సత్యానంద్ సంభాషణల కర్త. చక్రవర్తి, వెంకట్, సాయికుమార్, డి. వెంకటరత్నం, తరణి, పుల్లారావు, కె. ఎల్. ఎస్. శాస్త్రి, వెంకటేశ్వరరావు ప్రభృత సాంకేతిక వర్గం డిసెంబర్ 22 కు షూటింగ్ పూర్తవుతుంది.

## ఆడదాని సవాల్‌లో అసత్యపు గోడ

మురళి (మురళీమోహన్) రావడం చూసి ప్రభాకరం (ప్రభాకరరెడ్డి) "మురళీ! నాకు ఒక సందేహం వచ్చింది. నిన్ను అడగాలని పిల్చాను కాలవలో చేపలుపట్టే సాధారణమైన గేలంతో సముద్రంలో తిమింగలాన్ని పట్టుకోవచ్చా ?" అడిగాడు.

"ఇంపాసిబుల్ కుదరదు, సార్!" జవాబిచ్చాడు మురళి.

"అలా పట్టుకోవాలని ప్రయత్నించడం దురాశే కదూ ? అదే విధంగా ఒక మామూలు జీవితాన్ని గడిపే మనిషి, లక్షాధికారి కూతురుకోసం ప్రయత్నం చేయడం దురాశే అనిపించుకుంటుందేమో !"

మురళి అయోమయంగా చూశాడు "ఎవరి గురించి, సార్, మీరు మాట్లాడేది ?"

"నీ గురించే. నా దగ్గర పనిచేస్తూ, నా కూతుర్ని — "

"మనసులేని క్రూర గేలానికి — మనసున్న మనిషికి పోలికతెచ్చి మీరు చాలా పొరబాటు చేశారు నేను శాంతిని ప్రేమించింది — ఒక పేదపిల్లగా చూసినప్పుడే. అంతేగాని, మీ కూతురని తెలుసుకుని మాత్రం కాదు."

"పోనీ—కూతురని తెలిసింతర్వాత ప్రేమించడం మానెయ్యొచ్చుగా ?"

"మనసనేది మన చేతిలో ఉన్న మిషన్స్‌కావు-కావాలనుకున్నప్పుడు స్విచ్ నొక్కి ఆపు చెయ్యడానికి నా ప్రాణం పోయినా సరే — శాంతిని ప్రేమించడం మానలేను."

"వెరీ గుడ్ ! తనను ఇంతగా ప్రేమించిన నీకు — వెంటనే ఆమెనిచ్చి పెళ్ళి చెయ్యొచ్చు. కాని, నేను అభిమానించే నీకు అన్యాయం చెయ్యడం నా కిష్టంలేదు."

మురళి నొసలు చిట్లించాడు. "అంటే ?"

"శాంతిని చేసుకుంటే నీ బ్రతుకు నాశనమవుతుంది. కారణం — శాంతి పిచ్చిది."

"ఏమిటి! ఏమిటి మీరనేది ?" మురళి కళ్ళెదుట అగ్నిపర్వతం బద్దలయినట్లయింది

కె. ఎస్. ఆర్. దాస్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయలలిత ప్రధాన పాత్ర ధరిస్తూ, సమర్పించే రాజా ఆర్ట్ క్రియేషన్స్ చిత్రానికి "ఆడదాని సవాల్" అనే పేరును ఖాయం చేసినట్లు నిర్వహణ బాధ్యతలు వహించే డి. రాజా తెలియజేశారు. సత్యానంద్, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, కొండపనేని రామలింగేశ్వరరావు, మోహన్, పూనాటి సుబ్బారావు ప్రభృత సాంకేతికవర్గంతో వి. ఆర్ మోహనరావు నిర్మాత.

# తలనొప్పి కోసం ఎన్నో వాడిచూశాను,
# అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!

**సారిడన్**

ట్రేడ్ మార్కు 'రోష్'

శక్తివంతమైనది. సురక్షితమైనది.
ఒక్కటి వేసుకుంటే చాలు.




HTB-RPL-7798

## పట్నంవచ్చిన పతివ్రతలు లో పతులుపడే పాట్లు

చాప, తలగడతో అబ్బులు (మోహన్‌బాబు) గోపీ (చిరంజీవి) వస్తూంటే, బామ్మ (నిర్మల) ముక్కుమీద వేలేసుకుంది "ఏయ్, చంకలో చాప పెట్టుకుని ఎక్కడకెళ్లి వస్తున్నార్రా ?" అంది.

"అదే. ఈ తలగడ నిండా చీమలూ, దోమలూ, ఏనుగులూ. ఏనుగులు కాదు; ఈగలు ఉంటే—" అని గోపీ తడబడేసరికి "అవి దులప టానికి ఏట్లోకి వెళ్లాం, బామ్మా!" అని సర్ది చెప్పేశాడు అబ్బులు.

"ఈగల్ని, దోమల్ని దులపడానికి ఏట్లోకెళ్లారా! అవునూ — కొత్త దిండులో ఈ జంతువులన్నీ ఎక్కడివిరా ?"

"ఉండవని అక్కడికెళ్లాక తెలిసింది," అన్నాడు గోపి

బామ్మ ముసిముసి నవ్వులతో "ఒరేయ్! నా మనవళ్ళు అబద్ధాలుకూడా చెప్పగలరని నాకిప్పుడు తెలిసింది ఇంట్లో పెళ్ళాల్ని వదిలేసి మీరు వెళ్లి


'కాంతయ్య—కనకయ్య'లో జ్యోతిలక్ష్మి

## సినిమా

వీధిలో పడుకుంటే — ఊరూ వాడా చెవులు కొరుక్కుంటార్రా! నా పెళ్ళయిన కొత్తలో మీ తాతగారు ఏడాది వరకూ కాలికి చెప్పులేసుకుని వీధి గుమ్మం దాటలేదంటే ఒట్టు!" అంది.

గోపి గొంతు సవరించుకుని, "బామ్మా, నిజం చెప్పేస్తాను, బామ్మా! అసలు సంగతేమిటంటే — మా పెళ్ళిళ్ళుగాని సవ్యంగా జరిగితే, మూడు శుక్రవారాలు గుళ్ళో పడుకుంటామని దేవుడికి మొక్కుకున్నాం, బామ్మా! అంతేకాదు; రాత్రంతా ఉపవాసం కూడా ఉన్నాం," అన్నాడు.

బామ్మ మురిసిపోయింది "మా నాయనే—మా నాయనే... ఉపవాసం ఉన్నారా ? నేను మీ ఇద్దరికీ మీ తాతగారి మొండితనం వచ్చిందనుకున్నాను. కాని నా భక్తికూడా అబ్బిందనుకోలేదు" అంటూ, రాధిక — గీత వంకచూసి, "ఇదిగో అమ్మాయిలూ! నా పిల్లలు రాత్రంతా ఉపవాసం కూడా ఉన్నారంటే, కాస్త ఫలహారాలు ఏర్పాటు చేయండి వెళ్లండి, నాన్నా!" అంది.

అబ్బులు, గోపి నవ్వుకుంటూ వెళ్లిపోతూంటే, వాళ్ళ భార్యల ముఖాలు కోపంతో జేవురించాయి.

విజయ బాపినీడు నిర్మాణతలో అట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించిన శ్రీనివాస ప్రొడక్షన్స్ "పట్నం వచ్చిన పతివ్రతలు" చిత్రానికి మౌళి దర్శకుడు. ✱

## హిందీ చిత్ర స్థితిగతులు

★ పాకిస్థాన్‌లో తయారయ్యే చిత్రాల వ్యయం మన దేశంలో నిర్మితమయ్యే చిత్రాల వ్యయంకన్నా 5 శాతం తక్కువట మొత్తం మీద ఒక చిత్రానికి 10 – 20 లక్షలకు మించి ఖర్చు కాదట. కాని, అంత మొత్తం మన దేశంలో హీరోకే ఇవ్వబడుతోంది. పాకిస్థాన్ అధ్యక్షుడు జియా వుల్‌హక్ విధించిన ఆంక్షల ప్రకారం — ఇదివరకు కొన్ని చిత్రాలు నిర్మించి, చిత్ర నిర్మాణంలో క్షుణ్ణంగా అనుభవం గడించి, తగు ఆర్థిక స్థోమత కలిగి, ప్రభుత్వం వద్ద రిజిస్టర్ చేయించుకున్న నిర్మాతే చిత్ర నిర్మాణానికి అర్హుడు. కాని, మన దేశంలో ఎవరైనా చిత్ర నిర్మాణానికి పూనుకోవచ్చు ఓ వంక విడుదలైన చిత్రాలు అపజయం పాలవుతూంటే — మరోవంక చిత్రాలు నిర్మించడానికి రంగంలోకి దూకే కొత్తవారి సంఖ్య పెరిగిపోతోంది. అందుకే మన చిత్ర పరిశ్రమ ఎటు పయనిస్తూందో ఎవరూ చెప్పలేక పోతున్నారు.

★ శశికపూర్, షర్మిలాటాగూర్, పర్వీన్‌బాబీ, రాజ్ బబ్బర్, పాకిస్థాన్ సూపర్‌స్టార్ నదీమ్ నటించిన "దూర్‌దేశ్" చిత్రానికి ఇంతవరకు కొనుగోలుదారు లెవరూ రాలేదు. ఋషికపూర్, టినామునీమ్, ప్రాణ్, అమ్జద్‌ఖాన్ పాల్గొన్న "బడే దిల్‌వాలా"కు ఇంతవరకు బిజినెస్ కాలేదు. దేవ్ ఆనంద్ చిత్రం "స్వామీ దాదా", జితేంద్ర, రాజేష్‌ఖన్నా, రేఖ, పూనమ్‌ధిల్లాన్ పాల్గొన్న "నిషాన్" చిత్రాన్ని కొనే నాధుడెవరూ ఇంతవరకు కనబడలేదట. "ఆర్తి, దవేదార్, ప్యాస్" చిత్రాలకు కూడా ఇదే గతి పట్టింది. ఈ ఏడు పూర్వార్ధంలో విడుదలైన 66 హిందీ చిత్రాలలో "నమక్ హలాల్" ఒక్కటే గొప్ప హిట్ చిత్రం. "అంగూర్, షౌకీన్" ఓ మాదిరి హిట్ అయిన చిత్రాలు. "సత్తే పే సత్తే, సనమ్ తేరీ కసమ్, జీవన్‌ధారా, తేరీ కసమ్, గజబ్" విజయవంతమైన చిత్రాల కిందే లెక్క. ఓ 13 చిత్రాలు నిర్మాత పెట్టుబడికి ధోకా లేని చిత్రాలు. మరో 15 చిత్రాలకు ఆలస్యంగా మూలధనం రావచ్చు. మిగతా 30 ఫ్లాప్ చిత్రాలు.

# వారఫలం

22-10-1982 శుక్రవారం మొదలు
28-10-1982 గురువారం వరకు

మేషం: గ్రహగతిలో మీకు సంబంధించి నంతవరకు చాలా మార్పులు వచ్చాయి. అందుచేత వ్యాపార వ్యవహార ఉద్యోగ వృత్తులందు ఎలాగైనా లాభించే మార్గం ఉన్నది స్త్రీలకు ఆనందం లబ్ధి, ఆదాయం, అధికారుల ఆదరణ గలవారం.

వృషభం వారం వారం యింతేనా! అని అనుకోవద్దు. కళా సాహిత్య రంగాంలో నూతన విధాన ఆదాయం సమకూరుతుంది. నీతి నిజాయితీ ఒకమాదిరి ప్రకాశిస్తుంది. ఉద్యోగంలో కొందరు 'ప్రమోషన్' ఆశించే మార్గం గలవారం స్త్రీలకు ముందటికన్నా అనుకూల దినాలుగా గమనించే వారం ఆరోగ్య లోపం లేనివారం

మిథునం సులభంగా ఒకానొక విషయంలో మీకు మేలు సమకూరగలదు నిశ్చయంగా ఉద్యోగ వృత్తులందు చెప్పదగిన అభివృద్ధిగల వారమే కొందరకు అనుకోకుండా ప్రయాణం చేయగల అవకాశాలు ఉంటాయి స్త్రీలకు వృత్తిలో అభివృద్ధి అధికారుల వలన మేలు, ఉద్యోగరీత్యా అభివృద్ధి సూచక వారం

కర్కాటకం చాల దినాలుగా చిక్కని అవకాశాలకు నిలచిన పనులకు ప్రగతి కనిపిస్తుంది. నూతన వస్తు సేకరణకు, నూతన మార్గాన ధనలబ్ధికి, నూతన మార్గాన వ్యాపార నుకూలతకు అవకాశం గలవారం. స్త్రీలకు శుభ కార్యాలోచనకు నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారం.

సింహం 'మబ్బువిడచిన సూర్యుని లాగా' అన్ని రంగాలలో మీకు, నైర్మల్యత స్వచ్ఛత కనిపిస్తుంది వారమంతా ఆనందదాయకంగా ధనాదాయంతో జరిగిపోతుంది స్త్రీలకు వ్యవహార జయం ఉద్యోగంలో పైయంతస్తుకు వెళ్లేమార్గం కనిపిస్తుంది.

కన్య ఆరోగ్యలోపం లేదుగాన బాగా విజృంభించి వృత్తియందు ప్రగతి సాధించవచ్చు నూతన పద్ధతిలో అన్ని రంగాలలో ప్రగతి సాధించుకోవచ్చు సాహితీ రంగంలో, కొందరకు క్రీడా రంగంలో అనుకూలత చేకూరనున్నది స్త్రీలకు: వృత్తియందు పెంపు, ఉద్యోగమందు అభివృద్ధి, కించిత్తు ధనలబ్ధి గలవారమని గ్రహించాలి

తుల. మీ ఆరోగ్యం బాగా చూచుకోవలసిన సమయం. వస్తువులు పోగొట్టుకోకుండా చూచుకోవాలి. అయినవారితోనో మిత్రులతోనో సంభాషించే వేళల్లో జాగ్రత్త వహించాలి. స్త్రీలకు ఆనందం ఆదాయం, అభిమానుల ఆదరణ లభించినా ఆరోగ్యం అనుకూలంగా అమరియుండదు

వృశ్చికం: ఏవో వస్తువులు పోగొట్టుకొన్నట్లు చికాకు పడుతారు. కాని నిజంగా మీకు జరిగే అపకారంగాని అన్యాయంగాని లేదు. వ్యాపారం యథాతథంగా జరిగే అవకాశ మున్నది. స్త్రీలకు: శుభ కార్యములతో సతమతం కావటం, పుణ్య కార్యానుకూలతకు అవకాశం గల వారమే.

ధనుస్సు: దేవాదాయ ధర్మాదాయ శాఖలకు సంబంధించిన వారికి, గనులందు పని పాటలు చేసికొనే వారికి బ్యాంకు ఉద్యోగులకు, అవకాశం ఏర్పడ గల వారమే. స్త్రీలకు: ఉత్సాహవంతమైన వారం. చాలమందికి నూతనోద్యోగాలకు, సభా గౌరవానికి అవకాశం గలవారం.

మకరం ధనలబ్ధికి, పదవియందు అభివృద్ధికి, వృత్తియందు పెంపునకు వ్యాపారంలో లాభదాయక మార్గానికి అనుకూల వారం భాగస్వాములతో చేసే వ్యాపారంలో ఎంతో జాగ్రత్త పడవలసిన వారం. స్త్రీలకు. ధన విషయంలో వస్తు సేకరణ విషయంలో మీకు అనుకూలత గలవారం.

కుంభం చాందినాలుగా జరుగని పనులు ఈవారంలో నెరవేర నున్నవి. చాలమందికి గౌరవ పదవులు ఏదో మార్గాన లభించే అవకాశం ఉన్నది. వ్యాపారంలో సదవకాశా లుండగలవు స్త్రీలకు: ఉద్యోగావకాశాలు, రాజకీయ రంగంలో ప్రతిష్ఠ అతిశయించే మార్గం గలవారం

మీనం శ్రద్ధతో, ఓర్పుతో, శాంతంగా మీ పనులు నెరవేరగలవు, రాజకీయ రంగంలో చాలమందికి సదవకాశా లుండగలవు. వ్యాపారంలో కొందరకు అనుకూలత చేకూరగల అవకాశం గలవారం సుఖశాంతులకు లోపం రాదు ఒకానొక విషయంలో మీ ఆలోచనలు ఫలించే అవకాశం గల వారం. స్త్రీలకు ధనలబ్ధి సుఖశాంతులు, శుభ కార్యానుకూలత కు అవకాశం గల వారమే

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి *

సీరియల్

# ధర్మో రక్షతి రక్షితః

## ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ

4

*(గత సంచిక తరువాయి)*

ఊయలమీద కూర్చుని పరమేశ్వరుడు చెప్పిన దంతా విన్న యజ్ఞన్న దీక్షితులుగారి నోటి వెంట చాలాసేపు ఏ మాట వెలువడలేదు. ఆయన అంతరంగంలో ఎంత అలజడి రేగిందో చెప్పటం కష్టం. వారి ముఖంలో, ఏ భావం ప్రస్ఫుటం కావటంలేదు. పెదిమ బిగించి పరమేశ్వరుడు చెప్పిన దంతా విని, మాన్పడిపోయినట్లు కొన్ని నిముషాలు అలాగే ఉండిపోయేరు.

ఆలయంనించి అప్పుడే మోటారుసైకిల్ దిగి లోపలికి వచ్చిన శ్రీరామ్... మొదటినించి పరమేశ్వరుడు చెప్పినదంతా విన్నాడు. నిలబడటానికి శక్తి లేనట్లు... గోడకి చేర్లబడి చతికిలపడ్డాడు.

ఊయల వెనకగా నిలబడిన లలితాంబ, సుబ్బలక్ష్మి పిచ్చిచూపులు చూస్తూ నిలబడిపోయేరు కొన్ని నిమిషాలు... కాదు... కొన్ని యుగాల భయంకర నిశ్శబ్దం...

ఎవరి ఆలోచన వారిది... కాని అందరి ప్రశ్నా ఒక్కటే. ఇప్పుడేమి కానున్నది ?

దీక్షితులుగారు నిట్టూర్చి వేళ్ళమీద శిరస్సు వాల్చుకుని,

"శివ శివా..." అన్నారు.

అంతా ఉలిక్కిపడ్డారు: ఆయనకేసి చూశారు. మళ్ళా నిశబ్దం...

టిక్...టిక్... మంటోంది గోడ గడియారం పన్నెండున్నర అయింది.

తండ్రి 'శివ శివా' అనటంలోనే తండ్రి మనో భావాల్ని అర్థం చేసుకోగలిగేడు శ్రీరామ్.

'తండ్రి ధర్మహానికి అంగీకరించడు. గౌతముడు ఆకతాయితనంగా... ఈ వేషం వేసినట్లు లేదు వాడు ఎంతో కట్టుదిట్టంగా చేశాడు ఎన్నో అవస్థలు పడి ఉండాలి ఇంత చేశాడు. ఆలయం, సంస్కృత పాఠశాల, వేద పాఠశాల, అనాథ శరణాలయం...ఇలా ఎన్నో ఇప్పుడు గౌతముని మీద ఆధారపడి ఉన్నాయి కాదు. . ఇప్పుడీ రహస్యం మీద ఆధారపడి ఉన్నాయి.

ఇప్పుడు తండ్రి ఏం చేయబోతాడు. నిజం ఒప్పుకోమని పదిమందిలో నిలదీసి గౌతముని యాగీ చేస్తాడా ?...ఈ ముసలాయన ఆదినించి చాదస్తానికి తన బ్రతుకును బలి చెయ్యడమే కాకుండా ఆయన కడుపున బుట్టిన నేరానికి. అందరి జీవితాల్ని బలి చేస్తున్నాడు. ఇప్పుడు గౌతమునీ బలి ఇస్తాడా ?

ఇప్పుడిప్పుడే కాస్త కడుపునిండా తిండి, ఒంటి నిండా బట్ట, కంటినిండా కునుకు అనుభవిస్తుంట ఇప్పుడీయన అవన్ని కూలదోయడు కదా?' ఇది శ్రీరామ్ ఆలోచన...

పరమేశ్వరుడులో ఇందాకటి ఆవేశం లేదు తండ్రికి చెప్పిన తర్వాత తన గుండెలమీద బరువుని దింపుకున్నట్లు అనిపించింది. ఇప్పుడతని ఆలోచనల్లో ఆవేశం లేదు... అది కేవలం ఆలోచన మాత్రమే.

**జరిగిన కథ—11** యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు. ఆయన భార్య లలితాంబ వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు,గౌతమ శాస్త్రి, మీనాక్షిలు. పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు. పరమేశ్వరశాస్త్రికి, సుబ్బలక్ష్మికి బాల్య వివాహం జరిపిస్తారు. తన చదువు అయ్యేవరకూ పెళ్లిచేసుకోనని తండ్రితో ఖచ్చితంగా చెప్పేస్తాడు శ్రీరామ్. శ్రీరామ్ చదువు పూర్తయినా రికమెండేషన్, డబ్బూ లేకపోవడంతో పాటు కులం పెద్దదవడంవలన వుద్యోగం రాదు. కృష్ణశాస్త్రి కూతురు వివాహ విషయమై దీక్షితులు తమ ఇంటిని భైరవమూర్తికి స్వాధీనవు తనఖా ఇచ్చి శర్మగారింట్లో అద్దె కుంటుంటారు. చాలాకాలం తర్వాత గౌతమశాస్త్రి కృష్ణానందులవారితో ఆ వూరు వస్తాడు. అక్కడ ప్రసంగాలు అయిపోయిన తరువాత కృష్ణానందులవారితోపాటుగా వెళ్లిపోకుండా వూరి చివరనున్న మర్రిచెట్టు కింద జపం ప్రారంభిస్తాడు గౌతమ్. గౌతమ్ తపస్సు ఫలించి శివరాత్రినాడు శివలింగోద్భవం గావడంతో అతనికి మంచి ప్రచారం జరుగుతుంది. దానితో భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగిపోతుంది. దాతలు ఇచ్చిన విరాళాలు, చందాలతో శివాలయ నిర్మాణం జరుగుతుంటుంది. మరోపక్క వేదపాఠశాల, అనాథ శరణాలయం, సంస్కృత పాఠశాలలను కొత్తగా వెలసిన ఆ వూరి కమిటీ, గౌతమానందులవారి ఆశ్రమానికి వచ్చిన స్థిరచరాస్తులతో నిర్వహిస్తుంటుంది. కానీ ఇదంతా గౌతమ్ సుబ్బరాజుతో కలసి ఆడుతున్న నాటకమనీ, గౌతమ్‌లో ఎటువంటి మహిమలు లేవనీ కళ్లారా జూసిన పరమేశ్వరశాస్త్రి అగ్నిహోత్రుడవుతాడు.

గౌతము డింతకాలం ప్రజల్ని ఎలా మోసగించ గలిగేడూ? మండలంగా అహర్నిశలూ, అవస్థపడి.. వాడెందుకింత పని చేశాడో అర్థం అవుతూనే వుంది తండ్రి. . ఇప్పుడు ఏం చేస్తాడూ? తెలిసి శివ ద్రోహం చేయటం .. జరగనీయటం మహా పాపం

గౌతమునిమీద ఆధారపడి ఎన్నో సంస్థలు నడుస్తున్నాయి. ఇది బయటపడితే అవన్ని మూతబడతాయి దానివల్ల ఎందరికో. నష్టం జరుగుతుంది అందరి మాటా అటుంచితే.. తమకూ జీవనభృతి కరువు కావచ్చు ఇంత జరిగిన తర్వాత.. తమకీ ఊళ్ళో స్థానం లభించకపోవచ్చు

అంతమాత్రంచేత దైవద్రోహానికి ఒడిగడతామా ? ధర్మహానికి తలపడతామా ?

వేళ కింత తిండి ముఖ్యమా ?

ధర్మ రక్షణ ముఖ్యమా ?

ఇహమా ?

పరమా ?

డోలాయమాన పరిస్థితిలో కొట్టుమిట్టులాడు తున్నాడు పరమేశ్వరుడు.

లలితాంబ కంట్లోంచి కన్నీళ్ళు జలజల రాలేయి. దీక్షితులుగారు తలెత్తి ఆమెకేసి చూశారు తిరిగి తల తిప్పుకున్నారు.

భయంకరంగా ఉన్న నిశ్శబ్దం

లలితాంబ మనసులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి

దీక్షితులుగారి ధర్మపత్నిగా ఆయన అర్థాంగిగా... ఆయన మనసు తను అర్థం చేసికో గలదు. ధర్మహాని కీయన అంగీకరించరు దీన్ని నలుగురి దృష్టిలోకి తీసుకువెస్తారు.

గౌతముడు తెలిసి చేసిన నేరం... ఏడాది దాటింది జరగాల్సిన పాపం జరిగిపోయింది లింగోద్భవాన్ని ప్రజలు నమ్మేరు. ఇప్పుడు దేవాలయం గురించి, లింగాన్ని గురించీ ప్రజలకు ఇప్పుడు తెలిస్తే సహించగలరా. . ఉద్రిక్తులైన ప్రజలు... నమ్మితే ఆయన నిజాయతిని మెచ్చుకుని వారిని వదిలితే వదలచ్చుకాని, శేషాద్రిని, బుచ్చిరాజుని, పరమేశ్వరుడ్ని, శ్రీరామ్‌ని అందర్ని వేట కుక్కల్లా వేటాడతారే ముఖ్యంగా గౌతమ్‌ని... భగవాన్ ఇప్పుడేం కాబోతోంది...?

లేత బుగ్గలతో అమాయకంగా తన వడిలో పాలుకుడిచిన గౌతముడు ఎంతలో ఎంతటివాడయ్యేడు? ఎంతటి అఘాయిత్యం చేశాడు. ఇప్పుడు వాడేమి కాబోతున్నాడో... తమ గతి ఏం కాబోతోందో ?

అత్తగారి పక్కన నిలబడిన సుబ్బలక్ష్మికి సగం అర్థం అవుతోంది. సగం కావటం లేదు. భయంకర మైన నిశ్శబ్దం ఆమెకు నచ్చలేదు.

తమ మరిది దొంగ సాధువని మాత్రం ఆమెకు అర్థమయింది. గతం గురించి, భవిష్యత్తు గురించి ఆలోచనలేని... ఆలోచించడం రాని సుబ్బలక్ష్మి... వర్తమానంలో జరిగే విషయాల్ని వింటూ నిలబడింది.

దీక్షితులుగారు లేచి నిలబడ్డారు. ఊయల వెనక్కి ముందుకు ఊగింది. డోలాయమాన పరిస్థితి కాదు వారిది. ఎడంచేత్తో ఊయలని ఆపి... శాలువా ఒంటినిండా కప్పుకుని బయటకు నడవబోయేరు.

'ఎక్కడికి ?' అని ఎవరూ అడగలేదు.

ఎక్కడికో తెల్సు గనుక... 'ఎందుకూ ?' అనే ప్రశ్నని అందరి నేత్రాల్లోను చదువుకున్నారు దీక్షితులుగారు, కాని ఆయన మౌనంగా బయటకు నడవబోయేరు.

లలితాంబ వచ్చి ఆయన చేయి పుచ్చుకుని ఆయనతోపాటు నడవబోయింది. ఆయన చేయి



తప్పించి గుమ్మం దాటి వెనక్కి చూశారు అంతా గుమ్మం దగ్గర నిలబడ్డారు ఆయన ఎఱ్ఱబడిన నేత్రాలతో తీక్షణంగా చూశారు. అంతా బొమ్మల్లా నిలబడిపోయేరు. ఆయన నడుస్తూ వెళ్తున్నారు

## 5

అర్ధరాత్రి ఒంటిగంట దాటింది దీక్షితులుగారు చరచరా అడుగులు వేసుకుంటూ ఆశ్రమం దగ్గర కొచ్చేరు ఎప్పటిలాగే ఆశ్రమం అన్ని ఆవేశాలకు అతీతంగా, ప్రశాంతంగా ఉంది.

లోపలున్న గౌతమశాస్త్రి మనో పరిస్థితిమాట అలా ఉంచితే, బయట కూర్చుని ఉన్న సుబ్బరాజు హృదయం మాత్రం 'తుఫాను ముందరి' స్థితిలా ఉంది

ఆశ్రమ గేటుమీద చేతిని వేసి గేటు తీయగానే దీక్షితులుగారిలో అనిర్వచనీయమైన ప్రశాంతత చోటు చేసుకుంది

''దర్శనం వేళ మించి పోయింది వారు సమాధిలో ఉన్నారు'' దీక్షితులుగారితో ఈ మాటలు అంటుంటే సుబ్బరాజు కంఠం వణికింది. తన ధ్వని తనకే బలహీనంగా ఉన్నట్లు అన్పించింది.

సుబ్బరాజు కళ్లల్లోకి సూటిగా— లోతుగా చూస్తూ చిన్నగా . నవ్వీ... నవ్వనట్లు నవ్వేరు



దీక్షితులుగారు

ఆ చిరునవ్వు సుబ్బరాజు బుకాయింపుని పీక నొక్కి ''రండి, లోపలున్నారు'' అనే మాటను బలవంతాన పైకి లాగించింది.

ఇద్దరూ లోపలికి అడుగుపెట్టి ఆశ్చర్య పోయేరు. ఇద్దరి ఆశ్చర్యాలకు కారణాలు వేరు, వేరు.

'ఇంత స్థైర్యంతో, స్థిత ప్రజ్ఞతతో వంచన సాగించడం అసాధారణం' అని ఆశ్చర్యపడ్డారు దీక్షితులుగారు.

'ఇంత పవిత్రతత, ఇంత ప్రశాంతతే !' ఆశ్చర్య పోయేడు సుబ్బరాజు

గౌతమశాస్త్రి పద్మాసనంలోను, ప్రశాంత గంభీర ముద్రలో ఉన్నాడు.

లోపలికి వాంొచ్చిన శబ్దానికి కనులు తెరిచి 'రండి కూర్చోండి' అన్నట్లుగా కళ్ళతో సంజ్ఞ చేశాడు.

దీక్షితులుగారు కూర్చుంటూ మంద్ర స్వరంలో గంభీరంగా ''నువ్వు మౌనివా ?'' ప్రశ్నించేరు.

''మౌని అంటే ?'' సుమారు అయిదేళ్ళ తర్వాత కొడుకు కంఠంనించి, వినవచ్చిన మొదటి మాట ఓంకారంలా... విని... పులకించిందా పితృ హృదయం క్షణంసేపు.

''మౌని అంటే ? మూగ అనా ?'' మళ్ళీ ప్రశ్న. ప్రశ్నలా లేదు. శూన్యంలో వినవస్తోన్న ఓంకారంలా వుంది.

దీక్షితులుగారికి గొంతు పెగలలేదు.



చాలా క్షణాలా మౌనానంతరం—

''గౌతమా! ఇలా ఎందుకు చేసావు అని అడగటానికి రాలేదు. నాకు తెలుసుగనుక నీ ద్వేషం తిరుగుబాటు, నీ నిరసన నీ కుటుంబానికి జీవనాధరం లేదు. నువ్వెరిగున్నదల్లా అసహాయక ఆకలి. . వీటిమధ్య జనించిన ఆవేశం .తిరుగుబాటు అయితే ఈ తిరుగుబాటు ఎందుకూ ? అన్నది కాదు ప్రశ్న... ఎవరిమీద ? అన్నదే ప్రశ్న ?

ఆకలి తిరగబడితే బ్రాహ్మణ అబ్రాహ్మణ వివక్షత లేదు. అది ప్రాణి ధర్మం నాకు తెల్సు.

కాని నాయనా. నీలాగే ఆకలిగొన్న బ్రహ్మర్షి విశ్వమిత్రుడు జంధ్యాలు తెంపుకుని, బ్రాహ్మణ్యాన్ని, ధర్మపదాన్ని తిరస్కరించలేదు శునక మాంసం భక్షించి 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం' అనే ఆపద్ధర్మాన్ని ఆశ్రయించేడు. నీలా కాదే.

అంటే. నీ ఒక్కడి దుఃఖంవల్ల, నీ ఒక్కడి ఆకలివల్ల. . నీ ఒక్కడి నైరాశ్యంలోను, జ్వలించిన అసహనాగ్నికి మొత్తం సమాజం ఆహుతి కావాలా ?

సకల సృష్టికి ఆధారభూతుడైన దైవాన్ని అపహసించే అధికారం సృష్టిలో అణుమాత్రమైన నీలో ఉందా? దైవ ద్రోహం పాపం!

నరుడవై జన్మించి నారాయణత్వం కోసం నిరీక్షణతో పురోగమించ, నశక్తుడవైతే, పాశవికతాంధకారంలోకి తిరోగమించు, జాలిపడతాను. అంతేకాని సమాజాన్ని తప్పదారి పట్టించిన . నీ మేధోవైపరీత్యాన్ని నేను హర్షించను.

నీ కులాన్ని చుట్టుముట్టిన ఆకలి, అసహాయత అభద్రత నిన్నీ మార్గంలో పయనింపచేస్తే .. ఆ— గమ్యం ఏది? భద్రతా కాదే? మంగళమా? కాదే?

అసత్యం మోసం, దగా, పునాదిగా నిర్మించ బడ్డ ఈ నీ ఆశయసౌధం... కూలిపోయిననాడు... నామమాత్రావశిష్టంగా నిలిచివున్న ధార్మికత నశిస్తుందే .. ఇప్పటికే చరిత్ర నీలాంటి ధర్మ ద్రోహులవల్ల అయోమయాన్ని అసందిగ్ధతనీ పొందుతోంది ఈ చరిత్రలో నీలాంటి మోసకారులు

ఒకటి రెండు అధ్యాయాలు లిఖిస్తే, మొత్తం గతం అంతా కలుషిత మవుతుంది. గత పుటలన్నీ, ఆ పుటల్లోని అక్షరాలన్నీ క్షరమైపోతాయి.

నేనీ ధర్మహానికి... దైవద్రోహాన్ని హర్షించను. రేపే కృష్ణానందుల వారొస్తారు. వారి సమక్షంలో నీ నిజ స్వరూపాన్ని ప్రజలకు విప్పిచెప్పి వారి క్షమాభిక్ష నర్థించు. జనులు కోపోద్రేకులు కావచ్చు. కాని సత్యాన్ని నువ్వే చెబుతున్నావు గనుక క్షమించనూ వచ్చు. క్షమించి విడిచి పెట్టనూ వచ్చు. రేపు సాయంత్రం లోపున నువ్వా విధంగా...నీకుగా నువ్వు వెలుపలికి రానిపక్షంలో... ఆలయ ప్రతిష్ఠకు, సంకల్పానికి ముందే నేనీ.. విషయాన్ని ప్రజలకు విన్నవించాల్సి ఉంటుంది.

అప్పుడు ప్రజలు తీర్పు మరో విధంగా ఉండచ్చు. ఈ విషయం నిన్ను హెచ్చరించటానికి మాత్రమే ఈ అర్థరాత్రి రాలేదు.'

దీక్షితులుగారి కంఠం వణికింది.

'గౌతమస, ఆంగీరస, ఆయాస్యత్రయార్షేయ బులును గౌతమశాస్త్రీ తండ్రిగా... ప్రజలకు... నీకుగా... నువ్వు విప్పిచెప్పమని... నీ మోసం బయట పెట్టాల్సిన దుష్కర్మను... ఈ తండ్రికి కట్టబెట్ట వద్దని అర్థించడానికొచ్చేను.'

ఆఖరి మాటలు పలుకుతుండగానే దీక్షితులుగారు లేచి బయటకు నడిచేరు. చుట్టూ భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది. సుబ్బరాజా ఆందోళనగా... చూశాడు గౌతమునికేసి.

తండ్రి వెళ్ళిన దిక్కుకు చూసిన గౌతముడు తిరిగి పద్మాసనం వేసుకుని... కనులు మూసుకున్నాడు. సుబ్బరాజా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

## 6

దీక్షితులుగారు రాత్రి గౌతముని నించి తిరిగొచ్చిన తర్వాత నిద్రపోలేదు. ఆయనింటికి రాగానే అంతా ఒకేసారి 'ఏమైంది' అడిగేరు.

"ఏమి జరిగేది కాలం నిర్ణయించాల్సిన విషయం. మీరీ విషయాన్ని వదిలి మీమీ పన్లు చూసుకోండి" కటువుగా హెచ్చరించేరు.

"మీరు తొందరపడుతున్నారు నాన్నగారూ..." ఏదో అనబోయేడు శ్రీరామ్.

దీక్షితులుగారు... తీక్షణంగా చూశారు శ్రీరామ్‌కేసి. నిత్యాగ్నిహోత్రంలో ఎర్రబడిన ఆ కళ్ళల్లోంచి నిప్పు లింగాలు శ్రీరామ్‌ని తాకేయి. వాగ్బంధమయినట్లు ఉండిపోయేడు.

మరో గంట కాలం ఊయలమీద గంభీర ముద్రలో కూర్చున్నపిదప కాలకృత్యాలు తీర్చుకుని నిత్య సంధ్యావందన, దేవతార్చన, పితృతర్పణాలు చేసుకుంటూ అగ్నిహోత్రం గదిలో ఉండిపోయేరు.

మిగిలినవాళ్ళు ఎవరి పన్లు వారు చూసుకుంటున్నా, అందరి మనసుల్లోను చెప్పలేని దిగులు. పరమేశ్వరుడు నిత్యకృత్యాలు ముగించుకుని వేద పాఠశాలకి వెళ్ళేడు.

శ్రీరామ్ తన పన్లమీద తను వెళ్ళేడు. కాని అతని మనసుకు ఆందోళనగానే వుంది. అతను ఆలయం దగ్గరుండగానే కారులోంచి కృష్ణానందుల వారు దిగేరు.

# ధర్మో రక్షతి రక్షితః

"మీ నాన్నగారు ఏరి?" శేషాద్రి ప్రశ్నించేడు.

ఏదో ఆలోచనలో ఉన్నట్టు శ్రీరామ్ సమాధానం ఇవ్వలేదు. ఆలయాన్ని పర్యవేక్షించిన వెనుక కృష్ణానందులవారు ఆశ్రమవాటికకేసి వెళ్ళటం గమనించి అనుసరించబోయేడు శ్రీరామ్. కాని కాళ్ళల్లో వణుకు కల్గి, తిరిగొచ్చి తన ఆఫీసు గదిలోనే కూర్చుండిపోయేడు.

ఇంటిదగ్గర లలితాంబ రెండు మూడు సార్లు అగ్నిహోత్రం గది వరకు వెళ్ళింది కాని ఉచ్ఛ స్వరంతో వెలువడుతున్న మంత్రాలు విన్న తర్వాత భర్తను పిలిచే సాహసం చేయలేక పోయింది.

మరో గంటకు అమలాపురం నించి మీనాక్షి, భర్త శర్మ, మర్నాటినించి జరిగే ప్రతిష్ఠ కార్యక్రమానికి వచ్చేరు. వాళ్ళకి... భోజనాదులు పూర్తయ్యేసరికి... కాకినాడనించి కృష్ణశాస్త్రి, తాయారు వచ్చేరు.

ఒకరి తర్వాత ఒకరు వస్తున్న బంధువులను పరామర్శించి, వారికి భోజన సదుపాయాలు చూడటంలో అత్తా కోడలూ తలమునకలవుతున్నా వారి ముఖంలో ఆందోళన కొట్టవచ్చినట్లు తెలుస్తోంది.



దీక్షితులుగారు సాయంత్రం నాలుగు గంటలకు బయటకు వచ్చేరు. అఖండమైన తేజస్సుతో వెలిగే ఆయన ముఖం నల్లగా కమిలినట్లుంది. ఊయలమీద కూర్చుని వచ్చిన బంధువుల్ని పరామర్శ చేశారు.

పరమేశ్వరుడు గబగబా లోపలికొచ్చేడు. తండ్రిని ఎదురుగా చూడగానే అతని నడక వేగం తగ్గింది. దీక్షితులుగారు కళ్ళెత్తి చూశారు.

"కృష్ణానందుల వారొచ్చారు. తమ్ముడి దగ్గరకు వెళ్ళారట..." ఆగిపోయేడు.

"ఊ"

"అంతే..." అనేసి లోపలకు వెళ్ళిపోయేడు.

దీక్షితులుగారి భ్రుకుటి ముడి పడింది.

మరో అరగంట తర్వాత అక్కడనించి కదిలి అగ్నిహోత్రం గదిలోకి నడిచేరు.

అసంఖ్యాకంగా... బంధువులు వస్తూనే ఉన్నారు. దీక్షితులుగారు బయటకు రాలేదు. వేద పఠనం చేస్తూ, అర్థరాత్రి వరకు వారా గదిలోనే ఉన్నారు. బంధువులు అందరు విశ్రమించేరు.

తర్వాత బయట కొచ్చేరు దీక్షితులుగారు.

"ఈ రోజల్లా... మీరేం తీసుకోలేదు" భయపడుతూనే మెల్లగా అంది లలితాంబ.

"ఊ... ఫరవాలేదు" అన్నారాయన. బయట కొచ్చి అరుగుమీద కొచ్చి కూర్చున్నారు.

ఆయన మనసు గంట నుండి ఆందోళనకు లోనవుతోంది.

"కృష్ణశాస్త్రి అన్నయ్య అలా వున్నాడే అని పలుసార్లు ప్రశ్నించేడు" అంది లలితాంబ.

"ఊ..." అన్నారు పరధ్యానంగా..

"శ్రీరామ్ ఇంకా రాలేదు. ఏం గొడవ కాలేదు కదా ?"

"ఇప్పుడింకేం అవనట్లే... తెల్లవారితేకాని అగ్ని రగుల్కోదు" అన్నారు దీక్షితులుగారు

లలితాంబ కేం అర్థంకాలేదు మౌనంగా ఉండిపోయింది.

"అంటే... తనద్వారానే నిజాన్ని బయట పెట్టడాన్ని వాంఛిస్తున్నాడా గౌతముడు ?" ఆవేదనగా నిట్టూర్చేరు దీక్షితులుగారు

లలితాంబ భర్త చేతిని అందుకుని "ఈ ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పి ఈ గుండెకు కాస్త ఊరట కల్గించండి."

"ఏమిటదీ ?"

"ఇప్పుడీ విషయాన్ని బయటపెట్టదల్చుకున్నారా ? గౌతముని ప్రజలు క్షమిస్తారా మీరీ విషయాన్ని బయటపెడితే ?"

"లలితా... నీకిక గౌతముడు లేనట్లే..."

"అవేం మాటలండీ"

"అవును. వాడంతట వాడే ప్రజల క్షమాభిక్ష నర్థిస్తే ప్రజలు క్షమించవచ్చనుకున్నాను. కాని ఇప్పుడా అవకాశం లేకుండా చేసుకున్నాడు."

"అంటే మీరీ విషయాన్ని"

"బయటపెట్టవద్దంటావా ?"

"పుత్ర ప్రేమతో నా హృదయం..." లలితాంబ మాట పూర్తికాలేదు. సుబ్బరాజా గేటు తీసుకుని లోపలకు వచ్చేడు.

లలితాంబ లోపలికి వెళ్ళిపోయింది.

"రా..." పొడిగా అన్నారు దీక్షితులుగారు.

సుబ్బరాజా జేబులోంచి ఒక కవరు తీసి దీక్షితులుగారి కిచ్చేడు.

"ఎవరిచ్చేరు ?"

"అతనే"

"కృష్ణానందుల్ని అతను..."

"అన్ని విషయాలు ఇందులో ఉన్నాయని అన్నాడు. ఈ ఉత్తరం స్వయంగా మీకు చేరవేయమన్నాడు."

"తర్వాత"

"నన్ను ఇంటికెళ్ళి ఉదయమే రమ్మన్నాడు."

"సరే వెళ్ళు..." అన్నారాయన.

సుబ్బరాజు నమస్కరించి వెళ్ళిపోయేడు.

దీక్షితులుగారు అంటించబడిన ఆ కవరుకేసి చూశారు. ఆయన మనసులో ఏదో చెప్పరాని బాధ సుడులు తిరుగుతోంది.

ఏమిటుంది ఉత్తరంలో?

ఆయన లేచి లోపలికెళ్ళి... బయటున్న ఎల్కట్రిక్ స్విచ్‌ని వేసారు.

ఒక్కసారిగా కాంతి పరుచుకుంది.

గోడకి చేర్లబడి ఉత్తరాన్ని తెరిచేరు.

# ఆంధ్రపత్రిక

## ఖర్గపూర్‌లో తెలుగువారికి...

ఇప్పుడు ఖర్గపూర్‌లో ఆంధ్ర సచిత్ర వారపత్రికతోపాటు
ఆంధ్రపత్రిక దినపత్రిక కూడా లభిస్తోంది.
దినపత్రిక కావలసినవారు మా వారపత్రిక అమ్మేచోట అడగండి.
లేదా మా ఏజెంటును సంప్రదించండి.

: మా ఏజెంటు చిరునామా :

**శ్రీ యస్. ఎ నాయుడు**

ఏజంటు : ఆంధ్రపత్రిక, కేరాఫ్ ఆంధ్రా బుక్ ఏజన్సీ, కొత్త వర్క్‌షాప్ గేటుదగ్గర,
ఖర్గపూర్ - 721301 పశ్చిమ బెంగాల్.




ఈ చిత్రంలోని పాత్రల పేర్లు ఎవరినీ ఉద్దేశించినవి కావు

''ఏమిటా ఉత్తరం ?'' బయట కొచ్చింది లలితాంబ.

''కాస్సేపు ఆగిరా . లలితా'' మృదువుగా అన్నారాయన.

ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

దీక్షితులుగారి చేతులు వణుకుతున్నాయి. ఉత్తరం చదవటం మొదలెట్టారు—

పూజ్యులయిన తండ్రిగారికి నమస్కారములు;

మీకు ఎన్నో విషయాలు విన్నవించుకోవాలని నా కోరిక. అయితే... ఏదీ క్రమబద్ధంగా నానుంచి వెలువడకపోవచ్చు. అయినా ఈ ఉత్తరం పూర్తిగా చదవమని కోరుతున్నాను నేను చేసిన పనిని సమర్థించుకుందికి ఈ ఉత్తరం రాసేనని భావించి చింపివేయద్దని నా కోరిక

మండలంపాటు నేను జపంలో మునిగిపోవటం నిజం నేను కృష్ణానందుల ఆశ్రమంలో ఉండగా... ఎన్నడో నిర్జన ప్రదేశంలో గోదావరి ఒడ్డున శివలింగాన్ని చూశాను. దాన్ని సుబ్బరాజు సాయంతో ఊరిచివర మట్టిలో పూడ్చటం నిజం ఇక నా మహాత్యాలంటారా ఉన్నాయో లేదో నాకే తెలియదు. పాము కర్చిన కుర్రాడు నేనేదో మంత్రోచ్ఛారణ చేసి ఉంటాననే ఆత్మ విశ్వాసంతో బ్రతికేడని నా నమ్మకం

నేను ప్రజల్ని మోసం చేసేనని, ధర్మహాని చేసేనని, అదీ ఒక కులానికి ఉపకారం జరుగుతుందని భావించి చేసేనని అసత్యంతో కట్టిన ఆశాసౌధం కూలిపోతుందని మీరు ఆరోపించేరు.

ఇల్లు వదిలిన ఏడాదికి ఎన్నో ఊళ్ళు తిరిగి నేను కృష్ణానందుల నీడను చేరేను. ఏడాది వారి శుశ్రూషలో ఎన్నో విషయాలు గ్రహించేను ధర్మ శాస్త్రాలు పరించి చర్చించేను. తర్వాత మౌనవ్రతం పాటిస్తూ గ్రంథ పఠనంలో కాలం గడుపుతూ.. మనూరు వచ్చేను. మనూరు వచ్చే వేళకు నాలో ఈ ఆలోచన లేదు ఆ సర్వేశ్వరుడే కల్గించేడేమో నాకు తెలియదు మీరనే మోసమే చేశాను.

అసత్యాలతో సౌధాన్ని నిర్మించేనని అన్నారు. నే నెప్పుడు ఈ లింగం ఇక్కడ ఉద్భవించిందని పలుక లేదు! శివలింగం ఎక్కడిదో తెచ్చి నే నిక్కడ ఉంచటం తప్పే కావచ్చు. కాని ప్రజలు . ఇదిగో పులి అనకుండానే తోకదిగో అన్నారు.

మండలంపాటు నిద్రాహారలు మాని కూర్చున్నాను. నా పేరు గౌతముడు కాదన్నారు. గౌతమానందులన్నారు. నాలో దివ్యశక్తులున్నా యన్నారు. ధనరాశులు కుమ్మరించేరు. ఇందులో ఏది . నా సొంతానికి వాడుకోలేదు లేక కుటుంబాని కిమ్మని కోరనూలేదు. మూడు నాలుగు రోజులకు కొన్ని ఫలాలు అంతే నేను భుజించేది. దాన్ని పరిత్యజించే ప్రయత్నంలో ఉన్నాను.

ఇక ధర్మహాని సంభవించిందన్నారు. ధర్మం .. తన రూపు, రేఖ విలాసాల్ని కాలగతిలో మార్చు కుంటూ పోతుంది. అందుకే ధర్మ సూత్రాలు, నిర్దేశించిన మనువుకు... మరొకరికి, మరొకరికి అన్ని భేదాలు ధర్మం జీవన విధానాన్ని నిర్దిష్టంగా నడిపే యంత్రం మాత్రమే. కాలగతిలో యంత్రంలో కొన్ని భాగాలు చెడిపోతాయి. కొత్త భాగాలు చేర్చ

# ధర్మో రక్షతి రక్షితః

బడతాయి. కాని ప్రయోజనం మాత్రం సమాజ శ్రేయస్సు నా చర్యలు సమాజ శ్రేయస్సుకే విధంగా భంగ పరిచేయి ? సకల చరాచర సృష్టికి ఆధార భూతుడైన సర్వేశ్వరునిపట్ల మీ కెంతటి భక్తి విశ్వాసాలున్నాయో, నాకు అంతటి భక్తి విశ్వాసా లున్నాయి.

అయితే మీకున్న భక్తి విశ్వాసాలు, మీ ధార్మికతకు...మీ మోక్షానికే దారి చూపుతున్నాయి అఖండ వేద పండితులైన మీరు ఏ ఒక్కరిని ధార్మికతకేసి మళ్ళించలేదు.

హిందూ ధర్మం నిర్వచించేది వ్యక్తి శీలం, సమాజ శ్రేయస్సు .. వ్యక్తి శీలం భగవంతుని ఉనికిని జ్ఞాపకం చేస్తే బలపడుతుందని భావించేను. సాహసించేను. 'దేవుడనే' బీజ మాత్రంగా వాళ్ళ హృదయాల్లో ఉన్న విశ్వాసాన్ని చేరెడు నీరు పోసి విస్మృతి నెర్పరిచి ప్రజలను ధార్మిక జీవనానికి మళ్ళించేను. సమాజ శ్రేయస్సుకే ప్రయత్నం చేశాను నా కిందులో స్వార్థం లేదు

ఇక ధర్మం సమాజ శ్రేయస్సుకని భావిస్తే నేను ధర్మహాని చేసినట్లు మీరూ భావించరు

ఇకపోతే బ్రాహ్మణత్వం మంటగలుస్తోందని బ్రాహ్మణులు నిరాధారులవుతున్నారని నేనిదంతా చేశానని మీరు భావించేరు.

బ్రాహ్మణుడంటే కులం కాదని మీరే ఎన్నోసార్లు చెప్పేరు అందువల్ల బ్రాహ్మణుడంటే ఎవరో మీకిక్కడ చెప్పాల్సిన పనిలేదు.

ఒక కులం ఒక జీవనసరళి భ్రష్టత్వం అవుతోందని కాదు నా బాధ

ఆ కులం. . ఆ జీవనసరళి ఒక ధార్మిక వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తోంది.

మన హిందూ మతానికే కాదు. మిగిలిన మతాలకు మతాధిపతులు .. గురువులు .. ఉన్నారు. వీరంతా ఆ మతానికి ఆ ధార్మిక వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు

ధర్మానికి వీళ్ళు పునాది. పునాది లేని సౌధాలు నిలబడవు

'ధర్మం రక్షింపబడాలి' అనేదే నా తాపత్రయం. అందుకోసమే ఈ ప్రయత్నం

'ధర్మో రక్షతి రక్షితః' అన్నది మీరే చెప్పేరు. రక్షించబడిన ధర్మం రక్షిస్తుంది. అదే నా విశ్వాసం కూడా. 'ధర్మో రక్షతి రక్షితః' — అదే నా ఆశయానికి ఊపిరి.

అయితే ఫలితాలు మాత్రమేకాదు. సాధించే మార్గాలు ప్రధానమే కావచ్చు. దాని గూర్చి నే నంతగా పట్టించుకోలేదు.

నేను చేసింది తప్పో! ఒప్పో ? అనేది నేను ఆలోచించేందుకు నాకు అవకాశం లేదు. అవసరము లేదు. చాలా దూరం ప్రయాణం చేస్తూ వచ్చేశాను.

ఈ క్షణంలో మీరు నేను నిర్మించిన సౌధాన్ని కూలగొట్టాలనుకుంటే నా అభ్యంతరం లేదు. కాని ఆలోచించండి. మీరు చేయబోయే పని సమాజానికి ఏ విధంగా ఉపయోగపడుతుంది? ఎంతోమంది యువకులు ఉచిత భోజన, వసతి సదుపాయాలతో వేదం, సంస్కృతం నేర్చుకుంటున్నారు వాళ్ళు అనంతపుత్రులవుతారు. ప్రకృతి ఆశ్రమ నిర్మాణం ఉచిత వైద్య సహాయం దుర్లభమవుతాయి పసిపిల్లలు, అనాథలు వీధిపాలవుతారు ఎన్నోకార్యాలు నిలిచిపోతాయి.

నా రహస్యం బయటపడిన తక్షణం నేనీ ఊరు వదిలి పారిపోతే—నా ప్రాణానికొచ్చిన ప్రమాదం ఏం లేదని నాకు తెల్సు. కాని నా కింక బ్రతుకుమీద మమకారం లేదు.

నేను చేద్దామనుకున్న కార్యాన్ని నిర్వర్తించేను మీకీ ఉత్తరం చేరే వేళకు ! నేను పరమపద సోపానానికి చేరుకోగలననే విశ్వాసం నాకుంది నాకు జన్మ నిచ్చిన తండ్రిగా. తొలి గురువుగా మీకు చివరిసారి పాదాభివందనం చేస్తూ

మీ

గౌతమశాస్త్రి

ఉత్తరం పూర్తి చేసిన దీక్షితులుగారి కంటికి నీటిపొర అడ్డం పడింది ఉత్తరాన్ని మడిచి, పై బట్టతో నీటి పొరను అద్దుకున్నారాయన నెమ్మదిగా

మనో ఫలకం మీద మెదిలిన ఒక ఆలోచనా తరంగం ఆనందంతో ఆయన ఒంటిమీద పులకలు రేపింది మరుక్షణం బరువుగా నిట్టూర్చేరాయన

ప్రాతఃకాలమయింది. దూరంగా ఉన్న వేణుగోపాల స్వామి ఆలయంలోంచి భగవద్గీత శ్రీలగా వినబడు తోంది

యదా . యదాహి ధర్మస్య గ్లాని
భవతి భారతః ... .

జన సంచారం ఆరంభమయింది ప్రతిష్ఠా కార్యక్రమానికి వెళ్తున్నారు జనం

కొందరు కంగారుగా చెప్పుకుంటున్నారు

''గౌతమానందులు లింగైక్యం చెందేరుట''

''గౌతమానందులా''

''అవును''

''లింగైక్యం పొందేరు''

దూరంగా ఎక్కడినించో వేద ఘోష వినపడు తోంది.

స్వస్తిన ఇంద్రో వృద్ధ శవాః ।
స్వస్తినః పూషా విశ్వ వేదాః ।
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥
ఓం శాంతి.. శాంతి... శాంతిః

**[ అయిపోయింది ]**

**అంకితం**

ఈ నవల ప్రియమిత్రుడు రైల్వే శ్రీనుకి (డి. శ్రీనివాసశాస్త్రి అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్ - బెంగుళూరు) ప్రేమతో సమర్పిస్తున్నాను.

— రచయిత

తప్పక చూడండి!

శ్రీ దుర్గా మూవీ ఎంటర్ ప్రైజెస్

నిర్మాత:
శ్రీమతి కోనేరు అమ్మాజీ

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
సి. ఉమామహేశ్వరరావు

సంగీతం: ఇళయరాజా
కథ: తోటకూర ఆశాలత
నిర్వహణ: కొల్లి రాఘవేంద్రరావు










SREE PUBS

# మీ జీవితంలో ఎంతో కష్టపడి పైకి వచ్చారు మీరు.

## అందుకే మేము మీ కోసమే డిజైను చేశాం ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటి అతిసులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్ క్రొత్త బిఎస్ఎ డీలక్స్.



బిఎస్ఎ డీలక్స్ యొక్క సొగసైన సన్నటి బ్యారల్డ్ హబ్ ఇవి అత్యంత నాణ్యమైన, దృఢమైన కేస్ కప్స్ కలిగి సైకిల్ మెత్తగా, హాయిగా నడిచేలా చేస్తాయి.



ఎక్కువ సులభంగా తిరగడానికి వీలునిచ్చే చక్కటి గొట్టపు ఫోర్క్. దీనితో బిఎస్ఎ డీలక్స్ తొక్కడం నిజంగా సుఖకరం.



మీ వీపు మరియు పాదాలకు తక్కువ కష్టం కల్గించి ఎక్కువ హాయి నివ్వడానికై బిఎస్ఎ డీలక్స్ ఫ్రేము యొక్క కోణం ప్రత్యేకంగ డిజైను చేయబడినది.



మీరు జీవితంలో ఎంతో దూరం వచ్చారు. ఎంతో కష్టపడి మరీ పైకి వచ్చారు. అందుకే మీకు కావాలి అత్యుత్తమమైనది. అదే బిఎస్ఎ డీలక్స్. మీరు పనికి వెళ్ళడానికోసం ప్రత్యేకంగా డిజైను చేయబడి అతి సులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్. ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటిది. ఇంతకుమునుపు ఎన్నో ఇతర సైకిళ్ళను తొక్కవుంటారు మీరు. అందుకే వ్యత్యాసం స్పష్టంగా అనుభవించగలరు. మీ పాదాలు, మీ చేతులు, మీ వీపు.... మీ శరీరపు ప్రతి భాగం చెపుతుంది....ఇంత సులభమైన, సుఖకరమైన సైకిల్‌ను మీరు ఇదివరకు ఎప్పుడూ తొక్కలేదని.

పచ్చ మరియు నలుపు రంగులలో లభ్యం.



**క్రొత్త బిఎస్ఎ డీలక్స్– సఫలత-మార్గంలో మీకు సుఖతరమైన తోడు.**

Rediffusion-TI-1911 TL








కె.కె.రఘునందన

సంద్రపుటలల్లా విగిసిపడుతున్నాయి డాక్టర్ కిరణ్‌లో ఆలోచనలు. మనసంతా అస్తిమితంగా, గందరగోళంగా ఉంది. రోజూలా అయితే హాస్పిటల్‌లో పేషంట్లతో వేగిపోయి యింటికి వచ్చినందుకు కొంచెం 'రిలీఫ్' ఫీలయ్యేవాడు. కాని ఈరోజు రోజూలా లేదతని మనసు.

అతని ఆలోచనంతా రాబోయే 'రేపు'మీదే ఉంది. రేపటి గురించి చాలామంది ఆలోచిస్తారు. అలా ఆలోచించడంలో కొంతమందిలో భయం. ఆందోళన ముప్పిరిగొంటే — మరి కొంతమందిలో ఆనందం, తృప్తి ముసురుకుంటాయి.

మొదటి వర్గానికి చెందినవాడే డాక్టర్ కిరణ్.

అలా రేపటి గురించి ఆలోచిస్తున్న కిరణ్ మనసు మారుమూలల్లోంచి అనుమానం తొలుస్తోంది ... 'అసలు తనకు డాక్టర్ రాజేంద్ర అప్పు యిస్తాడా? యివ్వడా!'

రాజేంద్ర కిరణ్‌తోపాటే గవర్నమెంటు హాస్పిటల్‌లో పనిచేస్తున్నాడు. సాయంత్రం రాజేంద్ర చెప్పిన మాటలు మరోసారి జ్ఞప్తికి తెచ్చుకుని తనను తాను సముదాయించుకున్నాడు కిరణ్.

"డాక్టర్ కిరణ్! డోంట్ వర్రీ! మీకు కావలసిన పదివేలూ నేనిస్తాను... ఒక మంచి పని చేస్తున్నందుకు అప్పు చేయడంలో తప్పు లేదు... రేపే కదా డొనేషన్ కట్టాలి...రవిని మీ అంతటివాణ్ని చెయ్యడం చాలా మంచిది"

డాక్టర్ కిరణ్‌కు పేరుప్రఖ్యాతులున్నాసరే ఆర్థికంగా అందరికన్నా వెనుకబడ్డాడనే చెప్పాలి! అందుకే ఇంటర్మీడియట్ కాలేజీ ఫస్టుక్లాసులో పాసైన కొడుకు రవిని మెడికల్ కాలేజీలో చేర్పించడానికి డొనేషన్ పాతిక వేలు కట్టడానికి పూనుకున్నా సరే యింకా పదివేలు చాలక రాజేంద్రను అడగ వలసి వచ్చింది.

అతను మొట్టమొదటిసారిగా అప్పు చేయడం అదే!

వీధికో యిద్దరు డాక్టర్స్ వెలిసిన ఈ రోజుల్లో మెడిసిన్ చదివించడం సుతరాము యిష్టం లేకపోయినా తన భార్య సుజన అనునయంగా అభ్యర్థించిన కోరికను కాదనలేకపోయాడు కిరణ్.

"ఏమండీ ! మనకి పుట్టినది వొక్కడే నండీ! వాడు పుట్టినప్పుడే మీ అంతటివాణ్ని చెయ్యాలని ఎన్నో కలలు కన్నాను ! నా కలలన్నీ కల్లలు చెయ్యకండీ !"

బుర్రంతా గిర్రునతిరిగిపోయింది కిరణ్‌కి!

అసలు రాజేంద్ర తనకు ఒక్కసారి పదివేలు అప్పుయిస్తాడా ! యిస్తానని ఎంతో ధైర్యం చెప్పినప్పుడు తనెందుకిలా గాబరా పడిపోవడం!!

ఒకవేళ యివ్వకపోతే ? కొడుకు భవిష్యత్తు భార్య కలలు... కాలి బూడిదైపోతాయి...

కొడుకును చదివించే స్థోమత్తు లేదని చెప్పుకుంటే నవ్విపోతారు ! అయినా తను యింతకన్నా ఎవర్ని అడగ్గలడు?

కిరణ్ ఆలోచనలు పాదరసంలా పట్టు చిక్కకుండా పరిగెడుతున్నాయి. కొంతసేపటికి కలత నిద్రలోకి జారుకున్నాడు కిరణ్.

డాక్టర్ కిరణ్ గవర్నమెంట్ హాస్పిటల్‌లో సర్జన్ ... అతనితోపాటు మొత్తం ఒక యిరవైమందిదాకా పనిచేస్తున్నారు ఉదయం నుంచీ సాయంత్రం వరకూ ఊపిరిసలపనంత పని ఉంటుంది అందరికీ!

కాని రోజూలా కిరణ్ పనిలో నిమగ్నం కాలేకపోతున్నాడు. కారణం అతని కళ్లన్నీ రాజేంద్రకోసం వెతుకుతున్నాయి. ఎప్పుడొస్తాడా! అప్పు అడిగి డొనేషన్ కట్టి సీటు సంపాదించాలి అని ఆలోచించసాగాడు.

ఎంతకీ రాని రాజేంద్ర గురించి వాకబు చేస్తే... సెలవు పెట్టినట్లు తెలిసింది ... కిరణ్ నెత్తిమీద పిడుగు పడినట్లయింది.

వెంటనే రాజేంద్ర యింటికి పరిగెట్టాడు కిరణ్ !

తలుపు తెరచిన ఆవిడ ... "అయ్యో! ఈ రోజుదయమే వ్యాపార నిమిత్తం విశాఖ పట్నం వెళ్ళారు ... ఎప్పుడొస్తారో చెప్పలేం కూడా!" అని చెప్పింది.

తనకేదేనా ఉత్తరం కాని, డబ్బు కాని యిమ్మన్నాడేమోనని ఆత్రంగా అడిగాడు కిరణ్!

లేదండి...

ఆ సమాధానం కిరణ్ మనసును రంపపు కోతకు గురిచేసింది. నీరసంగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

* * *

"నాన్నా! మీలాగే నేను ఓ డాక్టర్‌నవాలని ఎన్నో కలలు కన్నాను. కాని నా కలలన్నీ కాలి పోయాయి నాన్నా! మనకన్నాబీదవాళ్ళు నాకళ్ళ ముందే డొనేషన్ కడ్తూంటే చూస్తూ విల్చున్నాను. నువ్వు ఎప్పటికైనా రావా!డబ్బు కట్టవా! అని ఎదురు చూసాను. 'ఏరా! మీనాన్న యింకా రాడేం?' అని అడుగు తూంటే నువ్వు ఎలాగైనా తెస్తావని చెప్పి వాళ్ళని సమాధాన పరిచినా నాకు హేళనలు, అవమానాలు తప్పలేదు నాన్నా! అయినా నాకు చదువులెందుకు? హాయిగా ఏ కూలిపనో చేసు కుంటాను" మెడికల్ కాలేజీలో తనకెదురైన అవమానాన్ని చెప్పి కళంట నీళ్ళు కారుస్తూ తనని గుమ్మంలోనే నిలబెట్టి ప్రశ్నిస్తున్న రవి వంక దీనంగా చూశాడు డాక్టర్ కిరణ్.

"ఏవండీ! ఎందుకు అలా చేసారండీ! నా కలలు కల్లలుగానే మిగిలిపోతాయనుకో లేదండి!" సుజన బాధకూడా కళ్ళల్లో ప్రతిఫలించింది.

# ఏది స్వార్థం?

డాక్టర్ కిరణ్ హృదయంలో బడబాగ్ని లాంటి దుఃఖం భళ్ళున దుమికింది... కళ్ళు కాంతివిహీనంగా అయిపోయాయి.

ఆ వాతావరణాన్ని తప్పించుకునేందుకు మేడమీదకు వెళ్ళిపోయాడు కిరణ్.

కోణార్క్ ఎక్స్‌ప్రెస్ కన్నా వేగంగా ఆలో చనలు ... కోరమాండల్‌లా మనసు పరిగెడు తున్నాయి.

కొడుకు, భార్య తనని ద్వేషిస్తున్నట్టు, సమాజం పగలబడి నవ్వుతూ తన అసమర్థ తను వేలెత్తి చూపించి వెటకారంచేస్తున్నట్టు అనిపించింది.

'డాక్టర్ రాజేంద్ర!' కసిగా పళ్ళు కొరి కాడు కిరణ్

'ఛీ! డబ్బు యిస్తానని చెపితే తను మరె క్కడా ప్రయత్నించకుండా ఉదాసీనం వహిం చాడు. నమ్మినందుకు గంగలో ముంచాడు... పోనీ తనకి సాధ్యంకాకపోతే ముందైనా చెప్పే యిచ్చు కదా!

మొదట యిస్తానని ఒప్పుకున్నా యింటి కెళ్ళాక అతన్ని స్వార్థం కప్పేసి ఉంటుంది... అందుకే ఆ పదివేలూ కూడా తీసుకెళ్ళి వ్యాపారంలో పెట్టేసాడు...

యిడియట్! రవి చదువుని బూడిదచేసిన స్వార్థపరుడు! ద్రోహి!

రాజేంద్ర స్వార్థపరుడా! ఒక్కసారి అంతరాత్మ దాడి

డాక్టర్ కిరణ్ ముఖంనిండా స్వేదబిందు వులమయం. ఏమిటి తనపై ఈ అంత రాత్మ దండయాత్ర! రాజేంద్ర తనని ఆశ పెట్టి మోసం చేసినవాడు, స్వార్థపరుడు! నమ్మక ద్రోహి కాక ... మరెవరు ?!

'నువ్వు!'—అంతరాత్మ కిరణ్ గుండెను షూట్ చేసింది.

'నేనా' అమితాశ్చర్యంతో నోరు వెళ్ళ బెట్టాడు కిరణ్

"ఔను! ఒక్కసారి నువ్వు మరచిపోయిన గతాన్ని మననం చేసుకుంటే నీకే తెలుస్తుంది నువ్వెంత స్వార్థపరుడివో! ఆ రోజు నీ తోని నీతికి నిప్పపెట్టి, మానవత్వాన్ని మంట గలిపేసి డబ్బుకు దాసోహం పలికిన విషయం నీకు గుర్తులేదు... నీ మూలంగా ఓ నిండు మనిషి ప్రాణం బలి అయిపోయిందన్న సంగతి నీకు జ్ఞప్తికి రాలేదూ ?" కసిరింది ... చాకులాంటి విమర్శతో మనసును కోసింది.

కోత పడిన మనసు పగుళ్ళలోంచి గతం కనిపించింది.

* * *

అవి డాక్టర్ కిరణ్ క్రొత్తగా ఉద్యోగంలో జాయినైన రోజులు ... మేనత్త కూతురు సుజనతో సరదాలు పూయించుకుంటూ, నూత్న జ్యోతులు వెల్గించుకుంటూన్న రోజులు కూడా అవే!

ఆ రోజుల్లోనే ఓ రోజు రాత్రి...

దబ దబ మని తలుపులు బాదిన చప్పుడు ... సుజన వెళ్ళి తలుపు తీసింది ...

"అమ్మా! డాక్టర్‌బాబు ఉన్నారామ్మా!" ఆ వచ్చిన వ్యక్తి గొంతులో ఆత్రత ...

"ఉన్నారు...ఏం ?" అడిగింది సుజన.

"మాది 'అలుగలమ్మా'. మా బిడ్డడు రెండురోజుల కాడ్నించి చలిజ్వరంతో వణికి పోతున్నాడు...ప్రాణాలు మీదికి వచ్చేలాఉంది. వెంటనే డాక్టరు బాబుని రమ్మనండమ్మా! మా ప్రాణాల్ని కాపాడమనండమ్మా! ఆరికీ పుణ్యం ఉంటుంది" — అతనిలో ఆ వేదన పెల్లుబుకుతోంది.

"అలాగేలే తాతా! పిలుస్తానుండు" సుజన లోనికొచ్చి విషయం చెప్పింది భర్తతో.

కర్తవ్య నిర్వహణకోసం ఒక ప్రమాద పరిస్థితిని ఎదుర్కొనేందుకు లేచాడు డాక్టర్ కిరణ్.

బట్టలు తీసుకుంటూండగా ఫోన్ మ్రోగింది.

"హల్లో ఎవరూ!" ఫోనెత్తి అడిగాడు కిరణ్.



బట్టలన్నీ
ఉతికేందుకు
కీ డిటర్జెంట్ పౌడర్ కన్న
మరింత
మంచిదేది?



# కొత్తది! మెరుగు పరచ బడింది!




## కీ

అంతేకాదు,
ఇంకా దీని ధర
యితర ప్రముఖ
డిటర్జెంట్ల కన్న
30% తక్కువే!

ఉచితం!
1 కెజి. కీ తోటి.
50 గ్రా.
సింథాల్
సబ్బు

ఈ మెరుగుదలలు
చూడండి!



ఇప్పుడు కీ మరింత సమృద్ధిగా
మరగ నిస్తుంది.



ఇప్పుడు కీ బట్టలకు మరింత
తెల్లదనాన్ని, తళతళను ఇస్తుంది.

గోద్రెజ్
ఉత్పాదన

**అందరికీ కనిపించే ఆ అదనపు తెల్లదనం. తళతళ–కొత్త, మెరుగు పరచబడిన కీ లో**

CHAITRA-G-151 TEL






బులుసు వేంకటరమణయ్య

## "తత్కురుష్వ మదర్పణం"

భగవానుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేస్తున్నప్పుడు "భోజనం చేసినా, తపస్సు చేసినా, దానం జేసినా ఈ విధంగా ఏ పని చేసినా నాకు అర్పించినట్లయితే—"కృష్ణార్పణం" అంటూ దేనిని చేసినా - అట్టి వారిని నేను ప్రగాఢంగా ప్రేమిస్తాను. నా అనుగ్రహం వారికి ఉంటుంది" అని బోధించి ఉన్నాడు. ఒక కృష్ణ భక్తురాలు, ఈ ఉపదేశాన్ని విని ఏ పని చేసినా "కృష్ణార్పణం" అని అంటూనే పని చేసేది. ఆమె ఉత్త అమాయకురాలు. ఇంటి పాచి పని చేసినా, వంట చేసినా, భర్తకు విస్తరిలో అన్నం వడ్డించినా "కృష్ణార్పణం" అని అంటూ వుండేది చివరకు పేడతో ఉండలు చేసి ఎండబెట్టినా "కృష్ణార్పణం" అంటూ వుండేది. ఆమె ప్రగాఢ భక్తికి భగవానుడు ముగ్ధుడైనాడు. కుమ్మరి తన నివాసంలోనే వుండి మట్టితో పువ్వులు చేసి పూజించగా, అవి తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుని పాదాల పయి పడివున్నట్లు - ఆమె చేసిన పేడ ఉండలు "కృష్ణార్పణం" ఉంచడంవల్ల, అవి ఆ ఊరి దేవాలయంలోని భగవానిని విగ్రహానికి అంటుకొన్నవి పూజారి పూజకు వచ్చి, గుడి తలుపులు తెరిచి చూడగా ఈ దృశ్యం కనబడి అతనికి ఆశ్చర్యం కలిగింది. కారణం తెలియలేదు మరునాడు కూడా ఆ విధంగానే కనబడింది. 'భగవంతుని విగ్రహాన్ని యీ విధంగా వికారంగా చేసిన వారెవ్వరా ?' అని ఆలోచిస్తూ అతడెంతో బాధ పడ్డాడు. ఇలా చేస్తున్న వారెవ్వరో కనుక్కోవాలని, అతడు తీవ్ర ప్రయత్నం చేశాడు. ఒకనాడు ఆ ప్రాంతం పరిశీలిస్తూ ఉండగా ఆ భక్తురాలు పేడవుండలు చేస్తూ "కృష్ణార్పణం" అంటూ వుండడం అతని చెవిన పడింది. ఆ హేయ సంఘటనకు ఆమెయే కారణమని గ్రహించి ఆ పూజారి కోపంతో "దుర్మార్గురాలా! నీ మూలంగా దేవాలయంలోని విగ్రహం పాడయింది" అంటూ ఉద్రేకంతో క్రరతో ఆమె చేతిని విరగగొట్టాడు రక్తం కారసాగింది. ఆమె మొర్రోమని ఏడవసాగింధి తర్వాత ఆ పూజారి దేవాలయానికి వెళ్ళి చూడగా విగ్రహం చెయ్యి విరిగి రక్తం కారడం కనబడింది. అతడు దిగ్భ్రాంతుడైనాడు. "ఓయీ! నీవు చేసిన పనికి నేను శిక్ష అనుభవించవలసి వచ్చింది. భక్తులకు బాధ కలిగితే, అది నాకూ తప్పక కలుగుతుంది. ఈ సంగతి నీవు గ్రహించలేకపోయావు ఆమె పరమ భక్తురాలు!" అంటూ విగ్రహం నోటి నుంచి మాటలు వెలువడ్డాయి. పూజారి చెంపలు వాయించుకుంటూ సాగిలపడి, అపరాధం క్షమించాలని వేడుకొన్నాడు. ఆ భక్తురాలి వద్దకు పోయి క్షమాభిక్ష వేడుకొన్నాడు. భక్తులపై భగవంతునికి ప్రేమ ఎక్కువ. వారు ఏ పని, తన్ను ధ్యానిస్తూ చేసినా ఆయనకు సమ్మతమే! అమాయకులపై అభిమానం మరీ ఎక్కువ.★

---

"నేనండీ వరప్రసాదరావును, మా అమ్మాయి గీతకు కొంచెం జలుబుగా ఉంది. మా ముద్దుల కూతురికి ఏదొచ్చేనా ముందు నాకు జ్వరం వచ్చేస్తుందన్న సంగతి మీకు తెలుసు ... కనుక వెంటనే రావాలి ... ఏమిటలా ఆలోచిస్తున్నారు ... ఫీజు విషయమేగా ... మా లాంటి వాళ్లతో బేరాలేమిటి సార్! మీక్కావలసినంత యిస్తాను...వెంటనే రండి."

"అలాగే!" ఫోన్ పెట్టేసాడు కిరణ్.

ఒక్క క్షణం అతని హృదయం సంఘర్షణకు లోనైంది.

మొదట తను బయలుదేరింది ఒక నిండు ప్రాణాన్ని రక్షించడానికి...కాని యిప్పుడు ఒక పెద్ద తని పిలుపును మన్నించటానికి ...

వరప్రసాదరావు డబ్బులో పుట్టి డబ్బులో పెరిగిన పలుకుబడిగల మనిషి.

## ఏది స్వార్థం?

ఒకవేళ తను ఆ మనిషితో వెళ్లినా పదో పరకో చేతిలో పెడ్తాడు. అందువల్ల తన కొరిగేదేమిటి ?

వరప్రసాదరావుని ఏంతడిగినా కాదనని మనిషి.

డాక్టర్ కిరణ్‌లో స్వార్థం చీకటిలా కట్టేసింది.

అందుకే నిశ్చయంగా లేచి వరప్రసాదరావు యింటికి బయలుదేరాడు.

గుమ్మంలో మనిషి - "బాబూ! తమరు దేవుడిలాంటివారు... పిలవగానే వస్తున్నారు" ఆనందంతో అన్నాడు.

"వెళ్లవయ్యా! నేను గవర్నమెంటు డాక్టర్ని, ప్రైవేటు కేసులు చూడకూడదు" చిన్న అబద్ధంతో కొట్టిపారేసాడు. అతను కాళ్లావేళ్లా పడ్డాడు కాని వినిపించుకోలేదు.

స్వార్థానికి—మానవత్వానికి జరిగిన ఘోర పోరాటంలో స్వార్థం విజేతగా నిలిచింది. మర్నాడు ఆ మనిషి చచ్చిపోయినట్లు తెలిసినా చలించలేదు కిరణ్.

* * *

చీకటి తెర లాంటి గతం విడిపోయింది కిరణ్‌లో. తనకు డబ్బివ్వలేనని చెప్పి వెళ్లిపోయినందుకు తన కొడుక్కు రవి చదువు ఆగిపోయిందని చెప్పి రాజేంద్రదిది స్వార్థం అనుకున్నాడు!

అదే నిండుమనిషి ప్రాణాలు బలైపోతాయని తెలిసి కూడా వెళ్లకుండా స్వార్థం చూసుకున్నాడు.

మరి రాజేంద్రదా ?

తనదా ?

ఏది స్వార్థం ? ? ?

# చేరవల్సినచోటు



యూనివర్సిటీ బహూకరించిన తాజా డిగ్రీ, లోకజ్ఞానం లోపించిన నీతి నియమాలు, అర్థం లేని ఆవేశాలూ కలిగిన రాజారాం ఆ సాయంత్రం రోడ్డుమీద వడుస్తూ, అడ్డంగా పడున్న ఓ కాయితాన్ని కాలితో పక్కకి తన్నాడు.

రిజర్వ్ బ్యాంకు నించి అప్పుడే బైటపడి, వయసుతో పెళపెళ లాడుతున్న ఓ రెండ్రూపాయల్నోటు చిత్తు కాయితం అడ్డు తొలగినందువ ముసిముసిగా నవ్వుతూ దర్శన మిచ్చింది.

## ఇందుర్తి సత్యన్నారాయణ

రాజారాం చటుక్కున వంగి దాన్ని తీసాడు.

"ఏమో! రూపాయి ఖర్చుతో మీరు లక్షాధికారులు కావచ్చు. వచ్చి లాటరీ టిక్కెట్టు కొని అదృష్టాన్ని పరీక్షించుకోండి" అని రోడ్డు పక్కనున్న కిళ్ళీషాపులోని మైకు ప్రజల మనోనిబ్బరానికి పరీక్ష పెడుతున్నది.

రాజారాం రెండు రూపాయల నోటును పైకెత్తి పట్టుకొని కిళ్ళీ షాపు వైపు నడిచాడు

"ఆఁ రేపే డ్రా! రేపటితో మీరు లక్షాధికారులు" మైకులో కేకలేస్తున్న కిళ్ళీకొట్టువాడు, రాజారాం చేతిలోని రెండ్రూపాయల నోటు చూసి మరీ రెచ్చిపోయాడు.

"ఈ రెండ్రూపాయలు రోడ్డుమీద దొరికింది—" అన్నాడు రాజారాం.

"అదృష్టమప్పుడే మీ వెంట పడింది. దాంతో ఓ రెండు లాటరీ టిక్కెట్లు కొని పంట పండించుకోండి, రేపు లక్షాధికారులు కండి" అంటూ 'కొట్టు' వాడు రెండు లాటరీ టిక్కెట్లు బైటికి తీసాడు.

రాజారాం పెదాలు బిగుసుకొన్నై.

"దయచేసి ఓ సహాయం చేస్తారా ?" అడిగాడు.

"చెప్పండి సార్!" అంటూ లాటరీ టిక్కెట్లున్న చేతిని యింకొంచెం చాపి అడిగాడు కొట్టువాడు.

"రోడ్డుమీద ఓ రెండ్రూపాయలనోటు దొరికిందని, అదెవరిదైతే వారొచ్చి తీసికెళ్ళొచ్చని మైకులో ఒకసారి చెప్పగలరా?'' అడిగాడు రాజారాం.

కొట్టువాడో క్షణంసేపు రాజారాంని ఆశ్చర్యంతో చూసాడు. ఆ తర్వాత ఆ కుర్రాడు పరాచిక మాడుతున్నాడేమోనని అనుమానించాడు.

కానీ రాజారాం ముఖంలో కనిపించిన సిన్సియారిటీ చూడంగానే కొట్టువాడికి — అమాయకత్వమంతా ఓ ముద్దగా ఏర్పడి. తర్వాత ఈ కుర్రాడి ఆకారంలోకి ఫిరాయించిందేమోనన్న భావన కలిగింది.

కిళ్ళీషాపతను యేమీ మాట్లాడకముందే, ఆ కొట్టుముందు ఉబుసుపోక చేరిన అవధ్ అనబడే అవధాని రాజారాంతో — "రెండ్రూపాయల్నోదని ఎవరూ రాకపోతే?" అన్న అనుమానాన్ని వ్యక్తం చేసాడు!

రాజారాం కొట్టువాడితో చెప్పాడు— "ఎవరూ రాకపోతే ఈ నోటు మీ దగ్గరే వుంచి, చీకటి పడేలోపు మరికొన్నిసార్లు ఎనౌన్సు చేసి చూడండి అప్పటికి ఎవరూ రాకపోతే ఆ రెండ్రూపాయల్తో ఓ రెండు లాటరీ టిక్కెట్లు కొందాం. ప్రయిజేదైనా తగిలే ఆ మొత్తాన్ని ముఖ్యమంత్రి నిధికి పంపుదాం."

అవధ్ చిన్నగా నవ్వాడు. కొట్టువాడు నిర్మొహమాటంగా పెద్ద పెట్టునే నవ్వేశాడు, నవ్వేసి—

"నువ్వెక్కడి సత్తెకాలపోడివోయ్ బాబూ! ఇదంతా చచ్చే పీకులాటవుద్దిగాని, అయినా నువ్వెంత అమాయకపోడివో నీకు తెలీటానికి మైకులో చెబ్తా చూడు'' అన్నాడు.

రాజారాం ముఖం విప్పారబడింది. నీతి నియమాల గురించి ఈ యిల్లిటరేట్‌కి ఓ ఉపన్యాసమిద్దామనుకొన్నాడు. కాని- ఆ రెండ్రూపాయల్నోటును దాని స్వంతదారుకు చేర్చడం తన అవసరంగా భావించడం వల్ల ఉద్రేకాన్ని తమాయించుకొన్నాడు.

కొట్టువాడు మైకు దగ్గరికి చేరి చెప్పసాగాడు మృదువుగా— "ఆ బాబూ! ఎవరో దురదృష్టవంతుడు రోడ్డుమీదో రెండ్రూపాయల్నోటు పారేసుకొన్నాడండి! అది మాకు దొరికింది. పారేసుకొన్నాయనెవరో వచ్చి ఆ నోటు తీసికెళ్ళండి బాబూ'' అని క్షణం సేపాగి ఊపిరి పీల్చుకొని

"-పోయిందనుకొన్న ఆ నోటు తీసుకొని ఓ రెండు లాటరీ టిక్కెట్లు కొనుక్కోండి బాబూ- ఏమో! అదే మిమ్మల్ని లక్షాధికారుల్ని చేయొచ్చు — ఆ రండి బాబూ ... రోడ్డు మీద రెండ్రూపాయలు పారేసుకొన్నాయనెవరో వచ్చి దాన్ని తీసికెళ్ళండి బాబూ!''

రాజారాంకి ఆ ఎనౌన్స్‌మెంట్ సజెస్టివ్‌గా వున్నట్టు తోచింది అయినా ఆ నోటు స్వంతదారు దొరికిన నోటును తిరిగి లాటరీ టిక్కెట్లకి తగలెయ్య పోవచ్చులే అనే నమ్మకమూ కల్గింది. తర్వాత-

"నేనో పావుగంట చూసి వెళ్ళిపోతాను — నాకు పనుంది ఎవరూ రాకపోతే నే చెప్పినట్టు చేయండి-'' ఏదో చెప్పబోతుండగా షాపనుత రాజారాంని ఆపాడు

"పావుగంటసేపా?! చూస్తుండండి-'' అని నవ్వి కొట్టువాడు మళ్ళీ మైకు పట్టుకొని "—ఆఁ ఎవరో రెండ్రూపాయలు రోడ్డుమీద పారేసుకొన్నారు బాబూ'' అని పాతపాట ఆలాపించాడు.

రెండో విడత ఎనౌన్స్‌మెంటు కొంత సంచలనాన్ని కల్గించింది నలుగురైదుగురు కిళ్ళీకొట్టు దగ్గరికి చేరారు.

అందులో ఒకడు కిళ్ళీకొట్టతన్ని "గుర్నాధం! రెండ్రూపాయలు దొరికిందటోయ్?'' అనడిగాడు పరామర్శగా.

"ఔన్సార్! పారేసుకొన్న వాళ్ళెవరో చెప్పి పట్టుకోపోవచ్చు'' అని గుర్నాధం మైకందుకొని "రెండ్రూపాయల్నోటొకటి...'' అని గొంతు చించుకో నారంభించాడు.

"ఆ నోటు మీలో ఎవరిదైనానా?'' అనడిగాడు రాజారాం షాపు దగ్గరకి చేరిన వార్ని

'లేదు బాబూ! రెండ్రూపాయలు దొరకడ మేవిటీ, అదెవరో అందరికీ దండోరా వేయడమేవిటి? ఎవరో వాళకి యిచ్చేస్తా మనడమేవిటి? యిదే యుగమో తెల్సుకొందామనొచ్చా!'' అన్నాడు వాళ్ళలో ఒకాయన.

మిగిల్నవాళ్ళూ ఆ నోటు తమది కాదని, కేవలం వినోదం చూద్దామని కొచ్చామనీ అన్నారు.

"అదేంటి? ఆ నోటు మాదని మీలో ఎవరూ క్లయిమ్ చేసుకోడంలేదూ? మహాప్రభో! ధర్మం యిలాగున నాలుగు పాదాలా నడిచేస్తున్నదేవిటి?'' అని తీవ్రంగా తల్లడిల్లాడు. అవధ్.

యింతలో నల్లగా, పొట్టిగా, సన్నగా వుండి కళ్ళజోడూ, లాల్చీ, పైజామాలు ధరించిన శాస్త్రి హడావిడిగా అక్కడికి చేరింది. ఆ శాస్త్రిని నామవాచకంలో జోగారావని, 'సర్వనామం'లో మాస్టారనీ అంటారు

"రెండ్రూపాయల్దొరికిందా గుర్నాధం! వాదెలాగుందోయ్ అది'' అన్నాడాయన అనుమానంగా. ఇటీవలే ఆయన మాస్టారు వృత్తినించి రిటైరైనాడు.

"లాగులూ, పాంట్లూ లాభంలేదండి ... అది మీదేనా? కాదా?'' నిర్మొహమాటంగా అడిగాడు గుర్నాధం.

"అవునోయ్... యిందాకిక్కడ పేపర్ చదూకోనెళ్ళా గదా ... కాఫీ హోటల్లో కెళ్ళి చూస్తే ఏడ్రూపాయలుండాల్సింది, అయిదే వున్నై జేబులో! మా ఆవిడగానీ ఎందుకైనా తీసిందేవో యింటి కెళ్ళాక అడగాలనుకొన్నా...కాఫీ తాగి బైటికొద్దును గదా నీ మాట వినిపించిందోయ్ మైకులో.''

"అయితే పట్టుకొపొండి మాస్టారూ మీ రెండ్రూపాయలూ'' అన్నాడు రాజారాం నిశ్చింతగా-ఎక్కువసేపు యిందుకోసం కాచుక్కూర్చోనాల్సిన అవసరం లేకపోయినందుకు ఆనందిస్తూ.

ఇంతలో—టక్ చేసుకొని, బూట్లేసుకొన్న ఓ కుర్రాడక్కడికి ఎక్కణ్ణించో ఊడిపడ్డాడు--"గుర్నాధం! ఇందాక అయిదు నోటిచ్చి సిగెరెట్లు కొంటే మూడివ్వాల్సింది ఏంతిచ్చావ్?'' అని గర్జిస్తూ.

"మూడూ యిచ్చాసావీ'' అన్నాడు గుర్నాధం.

ఆ కుర్రాడు కాలేజీ స్టూడెంట్స్ యూనియన్లో సాంస్కృతిక కార్యదర్శి. అయితే—గుర్నాధం అలాటి వాటిని ఖాతరు చేయడు.

"మూడిస్తే ఒకటే వుందేం?'' అని సాం. కా. వెటకారంగా అని, జేబులోంచి ఒక రూపాయి కాయితం తీసి ప్రదర్శించాడు

"ఇంకో రెండ్రూపాయల్నోటు కూడా యిచ్చాసావీ! సరిగ్గా చూసుకో' అన్నాడు నిర్లక్ష్యంగా గుర్నాధం.

"చూసుకోనే అడుగుతున్నా నువ్వొకటే యిచ్చావ్!'' కసిరాడు సాం. కా.

"మూడూ యిచ్చా ... ఎక్కడ పారేసుకొన్నావో ఎతుక్కో ఎళ్ళెళ్ళు'' అన్నాడు గుర్నాధం విసుగ్గా.

## చేరవల్సిన చోటు

"ఏంమాట్టాడుతున్నావ్ నువ్వు" అంటూ చొక్కాచేతులు మడవసాగాడు సా. కా.

ఆ కుర్రాడి దూకుడూ, ధీమా చూసే సరికి అందరికంటే ముందు జోగారావుగారి తల దిమ్మెక్కింది.

"ఆగాగబ్బాయ్" అని సాం. కా. ని ఆపి, గుర్నాధంతో—

"చూడు గుర్నాధం! ఆ నోటు ఒకవేళ నాది కాదేవోనోయ్.. నా జేబులో నోటు మా ఆవిడే తీసుకొందేవో ... పాపమానోటా కుర్రాడికే యిచ్చేయ్" అన్నాడు

"మీకు తెలీదులెండి మాస్టారూ ... నే నితనికిచ్చింది పాత నోటు ... మనకు దొరికిందేవో కొత్తది" అన్నాడు గుర్నాధం.

"అసల్నువ్ నాకేనోటూ యివ్వలేదు ... ముందో రెండ్రూపాయలొయిటు!" అర్చాడు సా. కా.

"ఆ సంగతిందాకే జూసుకోవాలి ... యిప్పుడొచ్చరిస్తే ఏం లాభం ? ఐయినా నీకు మూడ్రూపాయలివ్వడం నాకుగుర్తుంది" అన్నాడు గుర్నాధం నిర్లక్ష్యంగా.

మరో నిమిషంలో అక్కడ యుద్ధరంగం ఏర్పాటయేదేగానీ, యింతలో — రిక్షా రంగడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు లబలబలాడుతూ.

"బాబ్బాబు నా రెండ్రూపాయల్నాకిచ్చేయండ్నాయనో! అదే యియ్యాల మాకు తిండిగ్గతి ... లేకుంటే పస్తే బాబో" అంటూ గుర్నాధం చేతులు పట్టేసుకొన్నాడు రంగడు.

"రెండ్రూపాయ లివ్వడ వేంట్రా ? నీ గొడవేంటసలు?" అనడిగాడు అవధ్.

రంగడు సాం.కా. కేసి తిరిగి "మైకులో ఏం సెబ్తన్నారని యిందాక నిన్నడిగానా బాబూ—" అని, గుర్నాధం కేసి తిరిగి "యీ బాబేవో ఎవరో రెండ్రూపాయలు పారేసుకొన్నార్ట, వచ్చి తీసికెల్లమంటన్నారు! ఏందోసూద్దాం అని యిటొచ్చినాడు ఎందుకో అనుమానవేసి బనీస్టిబిలో సూద్దును గదా యిందాక బేరం తోలిన రెండ్రూపాయలూ జేబిలో లేవు ... బాబ్బాబు నాట్నాదే ... నాకిచ్చే నాయనా" అని రంగడు ఆవేశపడ సాగాడు.

గుర్నాధం సాం. కా. కేసి తిరిగి కళ్లెర్రజేసి "భలేవాడివయ్యా

సావులూ! రెండ్రూపాయల్దొరికిందని మైకలో చెబ్తే విని, దాన్నెగరేసుకుపోడానికి- ఏం తెలీనట్టే నాటకమాడతావా?'' అనడిగాడు కోపంగా.

సాం.కా. రంగడికేసి నిషాదంగా చూసి, గుర్నాధం వంక తిరిగి పళ్ళికిలించి ''గుర్నాధం! రెండ్రూపాయలెవరివైతే వాళ్ల కిచ్చేస్తానన్నావ్! అది నిజంగా ఎవర్దో నువ్వెట్టా కనుక్కొంటావోనని పరీక్షించా... పాపం... అది ఈ రిక్షా అతన్దే లాగుంది... యిచ్చెయ్'' అని మెహర్బానీగా అంటూ అక్కడ్నించి జారుకొన్నాడు.

''బ్బాబ్బాబు...పొద్దుట్నించి బేరాల్లేవు! రిక్షా కిరాయి పోను ఆ రెండ్రూపాయలే వుంది... ఎట్టా పడిందో అది కింద పడిపోనాది... నా నోట్టోకిచ్చేయ్ నాయనా...లేకుంటే యియ్యాల నాకు, నా పెళ్లాం పిల్లలకి గంజ లుండవ్... యింకో బేరమైనా తగిలే నాగుల్లేదు'' అని రంగడు తిరిగి వేడుకోసాగాడు.

''మాస్టారూ! మీరేవంటారు ... యిచ్చేద్దావా?'' అని గుర్నాధం జోగారావుకోసం చూసాడు. జోగారావు ఆ ఛాయలే లేదు!

మిగిల్న యిద్దరూ క్లయిమెంట్సు లేకపోవడంవల్ల రాజారాం, గుర్నాధాలతోపాటు అక్కడున్న జనంకూడా ఆ నోటు రిక్షావాడిదేనని నిర్ణయించారు.

తర్వాత అయిదు నిమిషాల పాటు అవథ్, గుర్నాధం చేసిన క్రాస్ పరీక్షలో, సమయస్ఫూర్తిగా జవాబులిచ్చి రంగడు ఆ నోటు తనదేనని రుజూ చేసుకొన్నాడు.

చివరికి ''నోటు యితన్దే లాగుంది ... యిచ్చేయండి గుర్నాధం గారూ'' అన్నాడు రాజారాం.

''పోయి న్నోపెట్టా పోయిందనుకోని – ఓ రెండు లాటరీ టిక్కెట్లు పట్టుకోసోరా! రేపేరా డ్రా ... లక్షాధికారి వౌతావేమో రేపటికల్లా!'' ఆశగా ఆశపెట్టాడు గుర్నాధం.

రంగడు రెండు చెవులూ తాకేలా పళ్లికిలించి ''రేపటి లచ్చెవడి క్కావాలి బాబూ... ఈ రోజు తిండికుంటే సాలు! నా రెండ్రూపాయల్నాకిప్పించండి'' అన్నాడు.

రాజారాంకు ఆనందం వేసింది. ''పాపం! రాటరీ వద్దు పాడూవద్దు ... అత్నెండూ అతనికిచ్చి పంపెయ్యండి!'' అన్నాడు.

గుర్నాధం చేసేది లేక పెటపెటలాడుతున్న రెండ్రూపాయల్నోటును రంగడి చేతిలో పెట్టాడు.

వాడి భాషలో ''ధర్మం తప్పక జయిస్తుంది''వంటి నాలుగు మంచి మాటలు, అందరికీ కృతజ్ఞతలూ చెప్పి రంగడు వెళ్లిపోయాడు.

అప్పటికి చీకటి పడుతున్నది. కొద్దిగా ఆలశ్యమైనా నోటును, దాని స్వంతదారుకు చేర్చగలిగినందుకు రాజారాం ఆనందపడ్డాడు.

పడి ''ఇంకా నయం! ఆ నోటును ముందరిద్దర్లో ఎవరికైనా యిచ్చేసావుకాదు నమ్మి'' అన్నాడు.

''ఏంటో ననుకొన్నా గానీ .. రోజులంత పాడుగా లేవు! ఒక నోటు కోసం ముగ్గురే వచ్చారు'' అన్నాడు గుర్నాధం.

''ఎంతమందొచ్చినా నిజంగా నోటు పోగొట్టుకొన్నవాడి ముఖంలో కళే వేరు!''అని రంగడి ముఖాన్ని గుర్తుతెచ్చుకోని తృప్తిపడ్డాడు రాజారాం.

''మరీ అంత నమ్మకం పెట్టుకోబోకండి... ఆ రిక్షా రంగడు వాళ్ళగూడెంలో నాటకాలూ, డ్రామాలూ బాగా వేస్తుంటాడు'' అన్నాడు అర్థోక్తిగా అవథ్

''అంటే ... రంగడు నాటకమాడాడంటారా?'' తల అడ్డంగా తిప్పుతూ వెటకారంగా అడిగాడు రాజారాం.

''ఇక్కడ అబద్ధమాడినా... యింకో అరగంటలో వాడు రంగమ్మ సారా కొట్టు దగ్గరికి చేరకపోడు ... మందు కొట్టేప్పుడు మాత్రం వాడు నాటకాలూ, అబద్ధాలూ ఆట్టం చేయడు'' అన్నాడు అవథ్ నవ్వుతూ.

రాజారాం కెందుకో అసంతృప్తి కల్గింది. నిజాయతీమీద పరిశోధన చేయాలనిపించింది.

* * *

''చిట్టీ! ఓ రెండ్రూపాయల్ది పోసుకోవే'' అంటూ రంగమ్మ పదమూడేళ్ళ కూతురు బుగ్గమీద చిటికేసాడు రంగడు. ఎందుకైనా పనికొస్తుందని యిప్పట్నించే యిలా చిటికెలు వెయ్యడంలాటి పన్లు చేస్తుంటాడు చిట్టిని.

''నీ కరువిచ్చినా – గోడకెల్లేసినా ఓటే'' అంది రంగమ్మ ఈసడింపుగా.

''అరువెందుకే రంగా! యియ్యాలప్పనంగా రెండ్రూపాయలు బజాయించినాన్లే! కటిక లొక్కానికే పోసుకో'' అన్నాడు రంగడు హుషారుగా.

తర్వాత తన నటనా చాతుర్యం, సమయస్ఫూర్తి యివ్వాళ తనకు రెండ్రూపాయల ఆదాయాన్నెలా తెచ్చిపెట్టాయో- సారా చప్పరిస్తూ, తోటి మద్యపాన ప్రియులకు వాడు వివరించసాగాడు, సారా పలికించే భాషలో.

బైట్నించి అందులో సగం విని, మిగతా సగం వినేందుకు మనసొప్పక, నీరసంగా యింటిదారి పట్టాడు రాజారాం!













## చేరవల్సిన చోటు

హుషారుగా విషాద గీతాన్నొదాన్ని ఈల వేస్తూ వచ్చి, రంగడు తడికెనో తాపు తన్ని "రత్తీ! కూడెట్టుకో" అని చీకట్లో వున్న పెళ్లానికో సలహా యిచ్చాడు.

మెల్లిగా దీపం వెలిగింది.

"కూడొండ లేదీ పూట" అంది రత్తి భయంగా.

"ఎందుకే? రెండ్రూపాయలిచ్చిపోయి నాగా! నూకలెత్తించలా?" అడిగాడు రంగడు.

వాడు హుషారుగా వుండకపోయినట్లయితే, ఈ పాటికీ రత్తి వీపుగిలుండాల్సింది. ఆ విషయం రత్తికి తెల్సు.

"పిల్ల ముండకు డబ్బులిచ్చి నూకలకి పంపినా—బజార్లో యాడ్నో డబ్బులు పారేసు కొచ్చింది" అంది రత్తి భయంగా. రంగడు నిర్ఘాంతపోయాడు.

"యాడ పారేసిందట!" అడిగాడు.

మొగుడింకా బూతులు మొదలు పెట్ట నందుకు రత్తికి ఆశ్చర్యమేసింది.

"ఏవో ... ముండ ... పెద్ద బజార్లో యాడో లాటరీ టిక్కట్లమ్మేకాడ పాట లేస్తుంటే యింటా వింటుందట ... ఆడే పారేసుండాల ... సినిమా పాటలింటే సొయ్యి తెలీదు దానికి" అంది రత్తి.

మతి పోయింది రంగడికి.

"పిల్ల ముండని కొట్టినావటే?" అడిగాడు ఆదోరకంగా.

"వళ్ళు సీరేసినా ... రెండ్రూపాయలు... యాడ్నించొత్తై? ఏడ్సేడ్సియిప్పుడే నిద్దర బోయింది" అంది రత్తి బాధగా.

రంగడు మెల్లిగా పిల్ల పడుకోనున్న దగ్గరికెళ్లి చూసాడు.

పదేళ్ల ఆ పిల్ల కాళ్లు ముడుచుకొని పడుకోనుంది. దాని అమాయకపు ముఖం మీద కన్నీళ్ల చారికలు, ఎర్రటి వేళ్ల గుర్తులు.

రంగడు బాధగా నిట్టూర్చాడు.

కానీ సారాకొట్టు రంగమ్మ రొంటెన తన మిత్రులతో చేరిన పెళ పెళ లాడే రెండ్రూపాయల్నోటు కిల కిలా నవ్వుతున్నది. 




### తిరువనంతపురంలో వినాయకచవితి వేడుకలు

తిరువనంతపురం తెలుగు సాంస్కృతిక సంఘం వారు ఎప్పటిలాగే ఈ సంవత్సరం కూడా వినాయక చవితినాడు సాంస్కృతికకార్యక్రమాలునిర్వహించారు. శాస్త్రీయ గానంలో ప్రతిభ ప్రదర్శించిన బాలలు చి. రఘురాం, చి. వాసుకీదేవిల వినాయక ప్రార్థన అనంతరం శాస్త్రీయ, కర్ణాటక గానంతో కార్యక్రమం ప్రారంభమయింది. "మా స్కూలులో ఒకరోజు" నాటికను చి. ధర్మా శ్రీరాం, శ్రీకృష్ణ, గుడిపాటి నరసింహమూర్తి, కృష్ణమూర్తి, కిరణ్మయి, నందులరావ్‌కిశోర్, వెంకటఅనిల్ కుమార్ ప్రదర్శించారు. శ్రీ ఎం.వై. ఎస్. ప్రసాద్ సాహితీ ప్రసంగం తరువాత 'ప్రేమ గోల' హాస్య నాటికని శ్రీయుతులు ఎం. యజ్ఞనారాయణ, కె. సుబ్రహ్మణ్యం, జి. విశ్వేశ్వరరావు, విదలదేవుని సత్యన్నారాయణ, కాశీనాధుని శివప్రసాద్ ప్రదర్శించారు. సంఘం అధ్యక్షుడు శ్రీ డి. వి. ఎస్. శాస్త్రి భవిష్యత్ కార్యక్రమాలని గురించి వివరించారు.

(ఒ.వి.)

### బ్రహ్మ జిజ్ఞాస

శివశక్త్యుల తత్వము, అచల మతి పరిశీలనములను(చతుర్థభాగము). గ్రంధకర్త శ్రీ మర్రిబోయిన రామసుబ్బయ్య, బ్రహ్మ విద్యలలో కెల్ల శ్రేష్ఠమయినదని తెల్పుతూ వేదాంత తత్వములోని సంశయాలను చక్కగా నివృత్తి చేసే 618 పేజీలు గల ఈ గ్రంధము వెల రు. 35. ప్రతులకు శ్రీ డి. సి. సుబ్బన్న, అడ్వొకేట్, 52/79, కోట వీధి, కర్నూలు, ఆం. ధ్రప్రదేశ్.

### ఎక్స్‌రేస్

ఆధునిక కవితా వేదిక. రష్యా విప్లవ మహాకవి మయకోవ్‌స్కీ ప్రత్యేక సంచిక. 27 పేజీలు. సాలు చందా 6 రూ.లు. వివరములకు ఎక్సరేస్, కొల్లూరి హవుస్, అమలాపురం—533 202.

### భావస్రవంతి

(విజయ సాహితి దశాబ్ద ప్రత్యేక మినీ సంకలనం) 22 పేజీలు వెల 2 రూపాయలు. వివరాలకు సిసింద్రీ, ఫౌండర్ అండ్ కన్వీనర్ విజయసాహితీ విజయపురి నార్తు, హిల్ కాలనీ—508 202 కెనాల్స్, నాగార్జునసాగర్.

### భోగిపళ్లు

న్యాయపతి కామేశ్వరి-రచనలు, సంకలన కర్త: డా. వెలగా వెంకటప్పయ్య. సహాయకుడు. చొక్కా వెంకటరమణ. పేజీలు 196. మూల్యం 6 రూ.లు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి, బర్కత్ పురా—హైదరాబాద్—27.

### వంటలు

పక్ష పత్రిక : ప్రథమ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక. 32 పేజీలు గల ఈ పుస్తకం వెల రు. 2 రూ.లు. ఎడిటర్, సి. హెచ్. వి. ప్రభాకరరావు, విద్యానగర్, జగిత్యాల.

### మీగడ తరకలు

స్వర్గీయ నాళం కృష్ణారావు గారి శతజయంతి సందర్భంగా వారి కవితలను కొన్నింటిని సంకలనము చేసి ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ వారు ప్రచురించారు. సంకలనకర్త శ్రీమతి వూటుకూరి లక్ష్మీకాన్తమ్మ. 48 పేజీలు, వెల రు.3 రూ.లు. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 34/4, ఆర్. టి బర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాదు—500 027.

### అరుణ కాంతి

రచన : శ్రీ సలాది శేషావతారం. 36 పేజీలు గల ఈ పుస్తకంలో మినీ కవితలు, గేయాలు మరియు ఒక కధానిక పొందుపరిచారు. వెల రెండు రూపాయలు. ప్రతులకు రచయిత పేర, క్రొత్తపేట—4533223, తూ.గో. జిల్లా (ఆం.ప్ర.)

### రెండో మనిషి

చిన్న కధలు : రచన: ఖాసిం యూసుఫ్,40 పేజీల వెల ఆరు రూపాయలు. ప్రతులకు విశి పబ్లికేషన్స్, 20—10—19, రాగిమాను వీధి, చిట్వార్రు, చిత్తూరు జిల్లా.

### మగవారిలో పటుత్వం ఎందుకు లోపిస్తుంది?

విజ్ఞాన మాస పత్రిక. సంపాదకుడు ఎస్ రాజేశ్వరరావు. వెల 2 రూపాయలు. వివరాలకు ఎం. ఎస్. సెక్స్ అండ్ సైన్స్, విజ్ఞాన మాస పత్రిక, లాలాపేట, గుంటూరు — 522 003.

### శ్రీ నారసింహ శతకము

రచన శ్రీ మామిండ్ల రామగౌడు, 24 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రతులకు రచయిత పేర, తెలుగు పండితుడు, రుద్రూరు —503 188, బోధన్ తాలూకా, నిజామాబాదు జిల్లాకి రాయాలి.

### అమృతావతరణం

మాస్టర్ సి. వి. వి. జీవిత చరిత్ర రచన శ్రీ గూడూరి నమశ్శివాయ. 86 పేజీలు. వెల:8రూపాయలు. ప్రతులకు: 1. శ్రీ ఎస్. రామనారాయణ, 1వ లైను, మారుతీనగర్, విజయవాడ — 4. 2. రచయిత పేర, శ్రీ మృత్యుంజయ ఫార్మసీ, గాంధినగర్, విజయవాడ 520 003.

### శ్రీ మాతృపూజ

విధానము. శ్రీ విశ్వశాంతి జ్యోతి ప్రచురణ. 44 పేజీలు. వెల రు. 2—50. ప్రతులకు శ్రీ విశ్వశాంతి జ్యోతి ప్రచార సమితి, జ్యోతిస్థాన్, శాంతిగిరి—దివ్యద్వార్, పెద్దాపురం—533 437.

### తూర్పుగోదావరి జిల్లా, తీర్థక్షేత్రములు - ఆలయములు

గోదావరీ మండలములోని కొన్ని ముఖ్యమైన తీర్థ క్షేత్రముల మాహాత్మ్యము సంగ్రహంగా ఈ పుస్తకంలో వివరించబడినది. సేకరణ రచన : భక్త పరమాణువు గుండు విఘ్నేశ్వరశాస్త్రి, వెల: 25 రూ. లు. దొరుకుచోటు : శ్రీ సీరవెంకట సీతారామ భజన మందిరము, లలితా నగరము, రాజమహేంద్రవరము—4.

### "స్వేచ్ఛాగానం" ఆవిష్కరణోత్సవము

శ్రీ కాణిపాకం లింగన్న రచించిన 'స్వేచ్ఛాగానం' కవితా సంకలనాన్ని డా. బి. ఎస్. రెడ్డి 1—9—82న చిత్తూరులో ఆవిష్కరించారు.

చిత్తూరుజిల్లా భారత్ కృషిక్ సమాజంవారి ఆధ్వర్యంలో శ్రీ లింగన్నకి ఘన సన్మానం జరిగింది. సభకు విద్వాన్ వి. శ్రీరాములురెడ్డి అధ్యక్షత వహించారు.

చిత్తూరు జిల్లా భారత్ కృషిక్ సమాజ అధ్యక్షులు శ్రీ సి. హరిహరరెడ్డి లింగన్నని శాలువతో సన్మానించారు. డా. బి. భాస్కరచౌదరి, కవిమునగిర శంకరరాజు, జిల్లా రచయితల సంఘాధ్యక్షులు శ్రీ బాలకృష్ణారెడ్డి, శ్రీ బాలప్ప, జయరాం, కేశవరెడ్డిగారలు ప్రసంగించారు. (ఒ.వి.)




"స్వేచ్ఛాగానం" కవితా సంకలన ఆవిష్కరణ సందర్భంగా కృతికర్త శ్రీ కాణిపాకం లింగన్నని సన్మానిస్తున్న శ్రీ సి. హరిహరరెడ్డి

# అవీ ఇవీ అన్నీ

### భక్త శబరి

(ఖండ కావ్యం) రచన : రాపాక అప్పారాయ కవి. 20 పేజీలు వెల 3 రూ. లు. వివరములకు రాపాక అప్పారాయకవి, ప్రథమ శ్రేణి ఆంధ్రోపాధ్యాయులు. (సెలెక్షన్ గ్రేడ్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, రాజాం, శ్రీకాకుళం జిల్లా.

### ఆంజనేయ శతకము

అష్టోత్తర శత నామావళి సంకీర్తనం రచన శ్రీ ఉపాధ్యాయుల రామారావు. 26 పేజీలు గల ఈ పుస్తకము నిత్య పారాయణం చేసుకొనవచ్చును. వెల 3 రూ.లు. ప్రతులకు: సారధి పబ్లికేషన్స్, యు. సీతామహలక్ష్మి, పెదపాడు—ఏలూరు తాలూకా, ప. గో. జిల్లా.

### శ్రీదేవి భాగవతం

రచయిత విద్వాన్‌పూడి వేంకటరామయ్య. మొదటి సంపుటం 1, 2, 3 స్కంధాలు మాత్రం. పేజీలు 274. వెల : 15 రూ.లు. రెండవ సంపుటం 4,5 స్కాంధాలు. పేజీలు 268. వెల 15 రూ. లు. వ్యావహారిక వచన కావ్యాలు. ప్రతులకు పి. శివకుమార్, 486, కొండమిట్ట, శ్రీకాళహస్తి — 517 644.

### శ్రీమద్రామాయణ సుందరకాండ

రచన : దేవత సుబ్బారావు. వెల : పది రూపాయలు. 123 పేజీలు. ప్రతులకు : దేవత సుబ్బారావు. 70 ఎస్. హెచ్. ఐ. రామచంద్రపురం, హైదరాబాదు— 32.



# వంటలు

## మూన్ నైట్ హల్వా

కావలసిన వస్తువులు:— క్యారట్లు నాలుగు, గుమ్మడి కాయముక్కలు రెండు, బంగాళాదుంపలు మూడు, గెనుసు గడ్డలు రెండు, కొబ్బరికోరు ఒక కప్పు, అరటిపండ్లు మూడు, నెయ్యి 100 గ్రా, చక్కెర 300 గ్రా, పాలు ఒక కప్పు, జీడిపప్పు 50 గ్రా, ఎండు ద్రాక్ష 50 గ్రా, ఏలక్కాయల పొడి, కొద్దిగా పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు.

తయారుచేయు విధను:— క్యారట్లు, గుమ్మడికాయ ముక్కలను పొట్టు తీసేసి బాగా సన్నగా తురమాలి. బంగాళాగుంపలు, గెనుసు గడ్డలు మెత్తగా ఉడకనిచ్చి పై పొట్టు తీసేసి చేత్తోనే నలిపి పొడిపొడిగా చెయ్యాలి. అరటి పండ్లనుసన్నని ముక్కలుగా తరిగి ఆముక్కల్ని మెత్తగానలిపిముద్దగా అయ్యేటట్లు చేయాలి, గుమ్మడి కోరులోని నీరు పిండేసి పెట్టాలి. ఇపుడు ఒకపాత్రలో పాలు తీసుకుని పొయ్యపై పెట్టి మరగనివ్వాలి. పాలు మరిగాక క్యారట్ కోరు, గుమ్మడి కోరు వేయాలి. ఇవి పాలలో ఉడికాక, వుడికించిన బంగాళాదుంప గెనుసు గడ్డలపొడి వేసి కలపాలి. తర్వాత కొబ్బరికోరు, అరటి పండ్ల ముద్ద వేసి బాగా కలపాలి. కాస్సేపటికి నీరు ఇగిరిపోతుంది. అపుడు చక్కెర వేసి కలపాలి. తర్వాత నెయ్యి కొద్ది కొద్దిగా పోస్తూ కలియపెట్టాలి. తర్వాత నేతిలో వేయించిన జీడిపప్పు, ఎండు ద్రాక్ష, ఏలక్కాయలపొడి, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు వేసి బాగా కలిపి హల్వా వలె అయాక దించేసి నెయ్యి రాసిన పళ్లెంలోకి వంచుకుని వెండి రేకు అద్దాలి. అద్దకున్నా ఫరవాలేదు.

— గార్ల సరస్వతి

## పాలూ వంకాయ

పెద్ద వంకాయలు—3, పాలు—1 కప్పుడు, కొత్తిమీరి—1 కట్ట, పచ్చిమిర్చి—6, ఎండు మిర్చి—3, ఆవాలు—1 చెంచాడు, మినపప్పు రెండు చెంచాలు, జీలకర్ర—1 చెంచాడు, కొద్దిగా యింగువ, అల్లం—చిన్నముక్క, పసుపు—చిటికెడు, తగినంత ఉప్పు.

చేయువిధానము:— మొదట వంకాయలు కాల్చి, తొక్కలుతీసి, ముద్దగా పిసికి ఉంచు కోవాలి. ఆ తరువాత పాలు బాగా కాచి, చల్లార్చాలి. చల్లారిన పాలలో వంకాయ ముద్దవేసి బాగా పిసుకుతూ కలపాలి. యిందులోనే పచ్చిమిర్చి, కొత్తిమీరి, అల్లం బాగా ముద్దగా నూరి కలపాలి! ఆ తరువాత ఎండి మిర్చిముక్కలూ, ఆవాలు, మినపప్పు, జీలకర్ర, యింగువా, పోపువేయించి అదికూడా ఈ పాలూ వంకాయ ముద్దలో వేసి, ఉప్పు చిటికెడు పసుపులతో పాటుగా తిరగమోత కలపాలి.

— జి. రామలక్ష్మి ★

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## శ్రీ విజయభాస్కరుని నూతన మంత్రి వర్గం:

రాష్ట్రంలో కొన్నినెలలుగా ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి అణగారింది. శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి నాయకత్వంలో నూతన మంత్రివర్గం ఏర్పడింది. నూతన మంత్రులతో సెప్టెంబరు 20 ఉదయం గవర్నర్ శ్రీ అబ్రహాం రాజభవనంలో ప్రమాణ స్వీకారం చేయించారు. నూతన మంత్రి వర్గంలో కేవలం కొత్తవారు ఐదుగురు మాత్రమే! తక్కిన వారంతా డాక్టర్ చెన్నారెడ్డి, శ్రీ అంజయ్య శ్రీ భవనంవెంకటరాంల మంత్రివర్గంలో ఉన్నవారే. కాని శ్రీ విజయభాస్కరరెడ్డి ధైర్యంగా చేసిన పని పూర్వపు మంత్రివర్గాలలో అభ్యాఖ్యాతులుగా (ఆరోపణలు గల వారుగా) ఉన్న పలువురిని మినహాయించడం. కొత్తగా వచ్చిన ఐదుగురు మంత్రులు అన్నివిధాలఅర్హులైనవారే. మంత్రులు ప్రస్తుతం 26 మంది (ముఖ్యమంత్రితోపాటు 27 మంది. తెలంగాణా, ఆంధ్రల నుంచి చెరొక మంత్రిని అదనంగా నియమిస్తానని, మంత్రులు ముప్పయికి మించరని ముఖ్యమంత్రి స్పష్టపరచారు. మంత్రి వర్గంలోనివారు వీరు: ముఖ్యమంత్రి—శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి, మంత్రులు— శ్రీయుతులు సి. జగన్నాథరావు,ఎన్. జనార్ధనరెడ్డి, ఎ. మదన్ మోహన్, ఎం. ఎ. అజీజు, ఎం. మానిక్‌రావు బి. రామ్‌దేవ్, సరోజినీ పుల్లారెడ్డి, కె. రోశయ్య, ఎం. వీరప్ప, పాలడుగు వెంకటరావు, చనుమోలు వెంకట్‌రావు, డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి, వి. వెంకటేశ్వరరావు,కోన ప్రభాకరరావు, సి. దాస్, డి మునిస్వామి, సహాయమంత్రులు—శ్రీయుతులు చంద్రబాబునాయుడు, జి. నాగేశ్వరరావు ఇందుకూరు రామకృష్ణంరాజు, పి. గోవర్ధన్‌రెడ్డి, ఆర్. వేమన్న, పి. వి. రాఘవులు, బి. సమ్మయ్య, వి. న్యాసినాయుడు, వి. హనుమంతరావు, టి. అమర్ సింగ్. దాదాపు పుష్కరంగా రాష్ట్ర రాజకీయాలకు దూరంగా వున్న శ్రీ విజయభాస్కరరెడ్డిని రానున్న ఎన్నికలలో ఇందిరాకాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూర్చగలరనే విశ్వాసంతో పార్టీ అధిష్టానవర్గం ముఖ్యమంత్రిగా ఎంపిక చేసింది. శ్రీ రెడ్డి నూరు పైసలా రాజనీతిజ్ఞుడు, మితభాషి. గడచిన పుష్కరంగా బహిరంగసభలకు, కార్యకలాపాలకు దూరంగా వున్నారు. అధికారంలో లేకపోయినా, ఆయనకు తన జిల్లాలో బలం ఏమాత్రం తగ్గలేదు. ఆయన నిరంతర ధూమపాయి, రోజుకు కనీసం పది సిగరెట్టు పెట్టెలు ఖాళీ చేసేవారు. కాని, ఇటీవల వైద్యుల సలహాపై పూర్తిగా మానుకున్నారు. సిగరెట్టు పాన వ్యసనాన్ని అంత సులభంగా వదలు కొన్నారంటే, ఎంతటి వజ్రసంకల్పులో తెలుస్తుంది. కర్నూలు సమీపంలోని లద్దగిరి గ్రామములో 1920 ఆగస్టు 16వ తేదీన ఆయన జన్మించారు. ఆయన తండ్రి శ్రీ పెద్ద నాగిరెడ్డి నిజమైన రాజసంగల రెడ్డి. జనం కుటుంబ వివాదాలను కోర్టులకు పోనీకుండా తానే తీరుస్తూ, అందరి మన్ననలూ పొందేవారు. శ్రీ విజయభాస్కర్ రెడ్డి చిన్ననాటి చదువు కర్నూలు మునిసిపల్ హైస్కూలులోను, కళాశాలచదువు మదనపల్లిలోని బెసెంట్ థియసాఫికల్ కాలేజిలోను సాగింది. ఆయన 1947 లో మద్రాసులో న్యాయశాస్త్ర పట్టభద్రులై, మద్రాసులోనే శ్రీ కె. ఉమామహేశ్వరం అనే సీనియర్ న్యాయవాది వద్ద అప్రెంటీస్‌గావున్నారు. తర్వాత స్వస్థలంలో న్యాయవాది వృత్తి చేపట్టారు. శ్రీ రెడ్డి, శ్రీ దామోదరం సంజీవయ్య కోడుమూరు సమష్టి నియోజకవర్గం నుంచి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. వారిద్దరూచిన్ననాటినుంచీమిత్రులే. కాని 1960లో శ్రీ సంజీవయ్య తన మంత్రివర్గంనుంచి శ్రీ ఆనం సంజీవరెడ్డిని తొలగించడంతో ఇద్దరికీ మనస్తాపం కలిగింది. శ్రీ సంజీవరెడ్డి కాంగ్రెస్ అధ్యక్షుడయిన పిదప శ్రీ విజయభాస్కరరెడ్డి వర్గానికి విధానసభ ఎన్నికల పోటీకి కాంగ్రెస్ టికెట్ ఇవ్వలేదు. శ్రీ రెడ్డి పోటీ చేయలేదు గాని, పోటీ చేసిన సంజీవయ్య ఓడిపోయారు. 1967 లో శ్రీ రెడ్డి కర్నూలు జిల్లాపరిషత్తు అధ్యక్షులుగా వున్నప్పుడు, అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి తన మంత్రివర్గంలో చేరవలసిందని ఆయనను కోరారు. ఆయన మంత్రివర్గంలో చేరి ఆర్థికశాఖను నిర్వహించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డికి చాలసన్నిహితంగా వున్నారు. కాని 1979లో శ్రీ బ్రహ్మానందరెడ్డి కేంద్రంలో చరణ్‌సింగ్ మంత్రివర్గంలో చేరడం వల్ల అభిప్రాయ బేదాలు గలిగి, బ్రహ్మానందరెడ్డితోను విడిపోయారు. శ్రీ రెడ్డికి లద్దగిరిలో కొంతభూమి వుంది, సొంత ఇల్లు లేదు. కర్నూలుకు వచ్చినప్పుడు మునిసిపల్ రహదారి బంగళాలో బస చేస్తుంటారు. నగరంలో, అమీరుపేటలో ఆయన కాపురం ఒక అద్దె ఇంట్లో. ఆయన మితభాషి అని ఇదివరకే తెలిపాను. టెలిఫోనులోను నిమిషం కన్నాఎక్కువ సేపు మాట్లాడరు. ఎవరినీ నమ్మరు. మనసులోని మాట ఎవరికీ చెప్పరు. పెదవి దాటితే పృధివి దాటుతుందని ఆయన సిద్ధాంతం. తాను సహాయం చేయలేనంటే స్పష్టంగా మొగమాటం లేకుండా చెబుతారు. చేయగలిగిందయితే వెంటనే అడిగిన వారి ఎదుటే ఎదుటివానికి తెలియజేస్తారు. శ్రీ రెడ్డి గద్వాలలో, వివాహమాడారు. సతీమణి శ్రీమతిశ్యామల. ఆయనకు ఇద్దరుకుమారులు,ముగ్గురుకుమార్తెలు. శ్రీరెడ్డి రాష్ట్ర రాజకీయాలకు దూరంగా వుండడం వల్ల గతదశాబ్దంగా ఇందిరాకాంగ్రెలో ముటాతత్వం బాగా పెరిగిపోవడం వల్ల ఎంతో చాకచక్యంతో వ్యవహరించవలసివుంది. మాటలు మాని చేతలకు ప్రాధాన్యమిచ్చి, ప్రశాంతంగా ఆలోచించి, పట్టుదలతో నిర్ణయాలను అమలు పరచే స్వభావం గల శ్రీ విజయభాస్కరుడు తమ సంస్థలోని ముటాలను కలుపుతారని సమర్థతతో సవ్యంగా పరిపాలనను నిర్వహిస్తారని ఆయన స్వభావం తెలిసిన వారు ఆశిస్తున్నారు. కాని, అప్పుడే — మంత్రివర్గం ప్రమాణస్వీకారంచేసి ఇరవైనాలుగు గంటలుకాకముందే రాష్ట్రంలోని మూడుప్రాంతాల అసంతృప్తులూ విడివిడిగా సమావేశమయి, ఫిర్యాదులు మోసుకొని ఢిల్లీకి వెళ్లారు. ఆంధ్రాణాం అనేకత్వం — అనే నానుడి ఎప్పుడు పుట్టిందో కాని, ఆరుకోట్లమందీ ఆరుముఖాలుగదా!



**ఉపశ్రుతి:**

ఇకమీద భారత రాజధానికి ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్ వారానికి నాలుగు సార్లు వెళ్తుందట గదా, అధికారులు ప్రకటించారు— అన్నారు నాతో ఒకరు. ఇక రాజకీయ నాయకుల దేహళీశ్వరులతో ముచ్చటించడానికి రోజు విడిచి వెళ్లి రావచ్చు— అన్నారు మా సంభాషణ వింటున్న ఒకరు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# ఉత్తరాలు


(4 వ పేజీ తరువాయి)


### న్యూఢిల్లీ లేఖ

న్యూఢిల్లీ లేఖ ఎంతో చదవడానికి ఆసక్తి కరంగా ఉంది.

యు. విజయకుమార్ పాత్రో (సాలూరు)

### ధర్మోరక్షతి రక్షతః

కమలహాసన్ ముఖ చిత్రం ఆకర్షవంతంగా వుంది. ఇందు సీరియల్ "ధర్మో రక్షతి రక్షితః" లో బ్రాహ్మణ సాంప్రదాయాలను చాలా బాగా వివరించారు. "దాంపత్య సంగీతం" మరీ మరీ చదవాలనిపిస్తూంటూంది. "కృష్ణ" అట్టమీద బొమ్మగా ముద్రించమని కోరుచున్నాము.

కాశి శ్రీదేవి (హిందూపురం)

* * *

"ధర్మో రక్షతి రక్షితః" సీరియల్ చాలా ఆసక్తికరంగా, ఉత్కంఠతతో చదివించేలా ఉంది. రచనా శైలి చాలా బావుంది.

జె. శ్రీనివాస్ (ముదిమాణిక్యం)

### దాంపత్య సంగీతం

శ్రీ సురేష్‌గారు 'దాంపత్య సంగీతం' సీరియల్ గురించి వ్రాస్తూ ఎనాటమీ ఎవన్నా నవలా మరియు ఫైనలియర్ ఏనాటమి ఏమిటి అంటూ వ్రాశారు. ఫైనలియర్‌లో ఎనాటమీ చదవకుండా సర్జరీ పరీక్షకు వెళ్ళడం అంటే ఎక్కాలు రాకుండా లెక్కల పరీక్షకు వెళ్ళడంలాంటిది. అట్లాగే వారికి ఏనాటమీలో గ్రంథాలు కాకుండా నవలలలాంటి మాన్యుల్స్ కూడా వుంటాయని తెలియనందుకు చింతిస్తున్నాను.

డాక్టర్ కె. చిదంబర్ (జంగారెడ్డిగూడెం)

### మల్లెల మాసం

జయసుధముఖచిత్రంతో వెలువడిన (10.9.82) ఆంధ్రపత్రికలోని "మల్లెల మాసం" కథలో ఆయాపాత్రల సంభాషణ మధ్యలో ఆంగ్లంలో వ్యవహరించడం సమంజసనీయంగా ఉంది.

బి. మహమ్మద్ సలీమ్ (గుత్తి)

### ధన్యవాదాలు

కాశ్మీరు, కన్యాకుమారిలలో తనకు జరిగిన మరుపురాని సంఘటనలను పత్రిక ముఖంగా వివరించిన ప్రముఖ (అందాల) ఆంధ్రుల అభిమాన నటి "జయసుధ" ముఖ చిత్రాన్ని పాఠకుల అభిరుచి మేరకు ప్రచురించిన మీకు ప్రత్యేక ధన్యవాదాలు.

బి. మహమ్మద్ సలీమ్ (గుత్తి) ●


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

